భారతీయ సాహిత్య నిర్మాతలు

# తోరూ దత్

మూలం:

పద్మినీ సెన్‌గుప్త

అనువాదం:

నాయని కృష్ణకుమారి



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

# విషయసూచిక

# 1. విశ్వ పుత్రిక

కొందరు రచయితలు తమ మాతృభాషలో కావ్యరచన చేయకపోవచ్చు. ఆటువంటి వాళ్ళే మొత్తం ప్రపంచానికంతా చెందినట్లుగా పరిగణింపబడగలరు. వాళ్ళుదేశంలో నన్నా పుట్టనీ, ఏదేశపు ముద్రనైనా వహించనీ, వాళ్ళ వాళ్ళ రచనలవల్ల, మొత్తం ప్రపంచం వాళ్ళను తనవాళ్ళుగా స్వీకరిస్తుంది.

తోరూదత్ ప్రపంచాని కంతటికీ ఆ విధమైన ఒక వరప్రసాదం. ఆవిడ భారతదేశంతో అవినాభావ సంబంధం కలిగిఉన్నా, సస్యశ్యామలమైన గంగానది లోయలో పుట్టినా, ఆవిడ మనస్సు మాత్రం ఒక జాతీ, ఒక భాషా, అనే సంకుచితమైన అడ్డు కట్టలకు లోను కాలేదు. ఆవిడ తన మనస్తత్వానికి తగినట్లు, ఇంగ్లీషు, ఫ్రెంచ్ సాహిత్య ప్రపంచంలోకి చొరవగా ప్రవేశించి ఆ భాషల్నే వాహికలుగా గ్రహించి సర్వవిద్యల్నీ కరతలామలకంగా లొంగదీసుకున్నది. అంతేకాక ఆ భాషలపట్ల తనకు తీర్చవలసిన బృహత్తరమైన ఋణం ఉన్నట్లుగా భావించి, అందుకు అనుగుణంగా శ్రమించింది. ఈపని చేయడంవల్లే ఆవిడ తన దేశాన్ని ప్రపంచ సాహిత్య పటంలో ప్రధానమైనదిగా అందరూ గుర్తించేట్లు చేయగలిగింది. ఆవిడ తన మాతృభాషయిన బంగాళీలో రచన చేయలేదు. అంతమాత్రంచేత ఆవిణ్ణి ఒక్కవాసికూడా ఇతరులకంటే స్వదేశాభిమానం తక్కువైనదాన్నిగా ఎంచడానికి వీల్లేదు.

ఆవిడ జనించిన కాలంలో దేశచరిత్ర చిత్రంగా ఉండేది. ఇంగ్లీషు వాళ్ళు ప్రభుత్వం నెరిపే ఆరోజుల్లో, లార్డ్ విలియమ్ బెంటింక్, మెకాలేలు, దేశీయుల్లో ఆంగ్ల విద్యావ్యాప్తికై తంటాలు పడుతుండేవారు. ఆ బృహత్కార్యాన్ని నిర్వహించడానికి, డబ్బు మంచినీళ్ళప్రాయంగా వెచ్చించేవారు. దేశీయులు ఇంగ్లీషు నేర్చుకోవడం తప్పనిసరైపోయింది. వాళ్ళయినా, పధ

ప్రభుత్వం తమ భాష నిలా బలవంతంగా తమ నెత్తిమీద రుద్దడమనే అంశాన్ని మహాదోషంగా గుర్తించలేదు. ఇంగ్లీషు నేర్చుకోవడం సర్వసాధారణ విషయంగా, అక్షరజ్ఞానంకల ప్రతివ్యక్తీ చేయవలసిన పనిగానే వాళ్ళు భావించుకున్నారు. అందువల్లనే మాతృభాషలోనే సృజనాత్మక సాహిత్యాన్ని రూపొందించాలనే పండితుల వాదనకు తోరూదత్ జవాబు చెప్పుకోవలసిన అవసరం లేకపోయింది. అంతేకాక, ఆమెకు తన జన్మకు సంబంధించిన ప్రాచ్య సాహిత్యపు విలువ బాగా తెలుసు. దాన్ని తాను సంపాదించుకున్న ఫ్రెంచ్, ఆంగ్ల సాహిత్యాల పరిజ్ఞానంతో దీప్తం చేయవలసిన అవసరం ఉన్నట్లుగా ఆవిడ చక్కగా గుర్తించింది. అందుకే తన తండ్రి అందించిన సహాయ హస్తాన్ని గ్రహించి సంస్కృతంలో ప్రవేశం పొందగలిగింది. ఆవిడకే ఆయుష్షు పరిపూర్ణంగా ఉండిఉంటే; సృజనాత్మకమైన తన సాహిత్యాన్నంతా క్రమంగా భారతీయంచేసి ఉండేది. తాను బ్రతికిన నాలుగునాళ్ళలోనే, తన సంప్రదాయమూ, సంస్కృతీ పరమైన తన వారసత్వమూ క్రమంగా తనను తన్మయురాల్ని చేస్తున్న సత్యాన్ని స్పష్టం చేసింది తోరూ. ఆవిడ ఇంకా బ్రతికిఉంటే, క్రైస్తవ జీవన విధానానికి చెందిన ఆలోచనా సరణినీ, అనుభవాన్నీ, అదేదో కేవల బహిష్కరణ యోగ్యమైందని అందర్నీ అనుకోనివ్వకుండా, దాన్ని ఆమోదయోగ్యంగా మార్చి ఉండేది. యూదులూ (జంటీలు) స్వతంత్రులూ, బానిసలూ, ఆంగ్లేయులూ, బెంగాలీలూ, ఇట్లా ఒక్కొ తెగవారు ఆరాధించే ఈశ్వర తత్త్వమే ఇందులోనూ ఉన్నదనీ, తానూ ఆ తత్త్వానికి చెందుతుందనీ స్పష్టంచేసి ఉండేది. కాని మనోమోహనకరమైన ఈ సుకుమారగాన ముకుళం వికసించకుండానే రాలిపోయింది.

తోరూ మంచి తాత్త్వికురాలు. ఆవిణ్ణి గురించి ఆలోచిస్తుంటే, ఎక్కువ విచారాన్ని కలిగిస్తూ మనస్సును కలచివేసేది, ఆవిడ ముందు దృష్టితో వివరించినట్లుగా, "ఇది ఇలా అయి ఉండేది" అనే ఊహ. తన చెల్లెలు "అరు" చిన్న వయస్సులో చనిపోగా తోరూ ఈ రకంగా వలపోసింది.

నోరు చెప్ప గలిగీ
కలం రాయ గలిగీ
ఎక్కువ విచారాన్ని కలిగించే

## మాటలిపి—

### ఇది ఇలా జరిగి ఉండేది!

తోరూ ఇరవై ఒకటో సంవత్సరంలో చనిపోయింది. ఆవిడ రచన లన్నీ ఆంగ్లంలో, ఫ్రెంచ్ భాషలోనే ఉండేవి. రెండు భాషల్ని జీర్ణించు కున్న ఈమె తత్త్వం తన సొంత దేశానికి కాకుండా పోయింది. దేశం ఆవిణ్ణి బహిష్కరించి అవమానించిందనే అపవాదు ఆవిడకు లేకుండా చేయడం సులభకార్య మేమీకాదు. అందుకు ఏ విమర్శకుడైనా పూనుకున్నా, ఆవిడ తనంతటతాను రెండు సార్లు విదేశాలను ఎన్నుకుని తన దేశం విడిచి వెళ్ళిపోవడం, అందుకు ప్రతిబంధకంగా నిలుస్తుంది, అని ఒక విమర్శకుడు అభిప్రాయ పడ్డాడు.

నిజానికి తోరూను ఎవరూ ఎప్పుడూ బహిష్కరించలేదు. దేశంలో ఉన్న వార్తా పత్రికలుగానీ, మరే పత్రికలుగానీ, ఆంగ్లంలో వ్రాసే ఏ హిందూ రచయితలైనా ఆవిడ కంటే ఎక్కువగా మననం చేసిందిలేదు. హిందూదేశం తయారుచేసిన గొప్పవాళ్ళ పట్టికలో తోరూ పేరు ఉంది. ఆవిడ జీవిత చరిత్రను, బెంగాలీ, ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషల్లో ఎంతో మంది వ్రాశారు. వంద ఏళ్ళ కిందట పుట్టినా, కాలం పెట్టిన పరీక్షకు ఎదురు నిలిచి ఆవిడ, సజీవంగా, ఉత్తమ శ్రేణికి చెందిన రచయితగా, ఇప్పటికీ నిలిచే ఉంది. తాను విడిచి వెళ్ళిన రచనలవల్ల ఎంతో ప్రజాభిమానాన్ని చూరగొన్నది. ఆయుష్షే ఉండివుంటే ఇంకా ఎంత గొప్పతనాన్ని సంపా దించుకునేదో! నిజంగానే ఆవిడ ఎక్కువకాలం జీవించి ఉంటే, ఆవిళ్ళో నిశితమైన పాండిత్యం, ప్రతిభా, ఎక్కువై ఉండేవా లేక సురిగిపోయి ఉండేవా? తన ఇరవై ఒకటో ఏటివరకూ, తాను రచనల్లో నిక్షిప్తంచేసిన భావనాన్నీ స్వచ్ఛతనూ చివరవరకూ కాపాడగలిగి ఉండేదా? ఆవిడ అతి శీఘ్రంగా ఎవరో తరుముకు వస్తున్నట్లుగా వెలుగారిపోయిన వర ప్రసాదిని.

కేవలం సంఖ్యను బట్టి చూస్తే ఆవిడ రచనలు ఆవిణ్ణి గొప్ప రచ యితల కోవలోనికి చేరనివ్వవు. తోరూను గూర్చి అంచనా వేసుకునేటప్పుడు, ఎవరైనాసరే, తోరూ జీవితాన్నీ, అందులో ఉండే విషాదభారాన్నీ ఆవిడ రచనలతో కలగలిపి చూచుకోవలసి వస్తుంది. ఆవిడ కవనశక్తీ, పాండి

త్యేమూ, ఆవిడ రచనల్లో భాగాలు మాత్రమే. కానీ ఆవిడ లేఖలూ, స్నేహాలూ, ఆవిణ్ణి గురించి ఎవరైనా ఒక అంచనాకు రావడానికి తోడ్పడ తాయి. తోరూ తన కవిత్వాన్ని జీవితంతో ప్రమేయం లేకుండా తీర్చిదిద్ది ఉంటే అది కాలంపెట్టే పరీక్షకు ఆగకుండా పోయేది. ఈ రెండూ కలిసి పోబట్టే, అవి ఈనాడు మన ముందొక అద్భుతమైన విలువలు కలిగిన యువతిని నిలువ బెట్ట గలిగాయి. అందుకే, విల్ఫ్రెడ్ ఒవెన్, కవిత్వమనేది తోరూ జీవితం లోపరుచుకున్న విషాదంలోనే ఉన్నదన్న మాట ఎవరికైనా నిజమే ననిపిస్తుంది. ఎందరో విమర్శకులుకూడా తోరూ కవిత్వం అందర్నీ ఆకర్షించడానికి కారణం, దానికీ ఆవిడ విషాదభరిత జీవితానికీ సంబంధం ఉండడం వల్లనేనని ఒప్పుకున్నారు. అందమూ, విషాదమూ, మృత్యుభీక రతా, తోరూ జీవితంలో చెర్లాట లాడుకున్నాయి.

ఎమిలీ బ్రాంటీ రచించిన ఉథరింగ్ హైట్స్ చదువుతున్నపుడు కానీ ఆవిడ కవిత్వాన్ని ఆస్వాదిస్తున్నపుడు కానీ మనలో రకరకాల అంచనాలు మొదలవుతాయి. అక్కడనుండి, వాటిమీద మనం అల్లుకునే ఊహలూ తీర్మా నాలూ మనల్ని నిలవనీయవు. అవి మనల్ని కదిల్చివేస్తాయి. ఒక్కోసారి కుంగదీస్తాయి. తోరూ విషయంలోనూ అంతే. ఆవిడ కవిత్వాన్ని గురించి మాట్లాడేటప్పుడు, ఆవిడ రాసిన కావ్యాలకూ, ఆవిడ జీవిత కావ్యానికీ మధ్య భేదం చూపించడం కష్టం.

తోరూ, బిరాంజర్ వ్రాసిన "నా వ్యాపకం" అనే కవితను అనువ దించిది. నిజానికి అటువంటి కవిత్వాన్ని తోరూ తానే సొంతంగా వ్రాసి ఉండడానికి తగింది.

**ఈ భూమ్మీద ఎవరికీ అక్కరలేనిదాన్ని**
**రుజాగ్రస్తంగా వికారంగా**
**ఉండీలేనట్లు**
**అన్నిటా అతి తక్కువగా**
**నా పుట్టుక నుండీ నిరసింపబడ్డదాన్ని !**
**ఈ పెదాల నుండి**
**చీల్చుకు వస్తున్న రోదన**

దురంత పరితాపం వల్ల మాత్రమే
బయటపడే వేదన!
అందుకు ఉపశమనంగా
ఆ పరమాత్ముడు చెప్తున్నాడు
పాడు! నా పిచ్చితల్లీ
పరవశించి తియ్యగా పాడు!

బాధా, బుద్ధికి అందని దురదృష్టంవల్ల కల్పింపబడ్డ చిక్కటి చీకటీ, తోరూ వెంట నీడలై సాగే సహచరులైనాయి. "కవిత ఒక చిరంతన సత్య మన్నమాట నిజమే అందులో సందేహం ఆవంతయినా లేదు. కాని కవికూడా తన ఆత్మీయతా ముద్రవల్ల మన శ్రద్ధాసక్తుల్ని తన వైపుకు ఆకర్షించు కుంటూనే ఉంటాడు!" అని ఆ విమర్శకుడే ఉద్ఘోషిస్తున్నాడు.

తోరూ ఓ అద్భుత వ్యక్తి. ఆవిడ ఎన్నో భాషల్ని తన వశం చేసు కున్నది. మూడు భాషల్ని మంచినీళ్ల ప్రాయంగా వాడుకుంటూ, ఒక భాష నుంచి మరోభాషకు అనువాదాలు నిర్వహిస్తూ, ఆవిడ అద్భుతమైన గారడీలు చేసి చూపించింది. ఫ్రెంచ్, ఇంగ్లీషుభాషల్లో ప్రావీణ్యం కలిగాక, ఆవిడ దృష్టి సంస్కృతంపైకి మళ్ళింది. పది నెలల స్వల్ప కాలంలో ఆ భాషను చదవడం, దాన్ని అనువదించడం చేయగలిగింది. మేరీ మార్టిన్ అనే తన స్నేహితురాలికి ఉత్తరం వ్రాస్తూ, హిందూదేశపు ప్రాచీన సాహిత్యాన్ని మథించాలనే తన కోరికను తెలియజేసింది. "మిక్కిలి పేరు ప్రతిష్ఠలు కల ఇతిహాసాలు రామాయణ భారతాలు. వాటిని మూల భాషలోనే చదవాలని నాకు గాఢమైన కోరిక. మళ్ళీ నేను కేంబ్రిడ్జ్‌ని చూడడానికి వచ్చేలోగా ఓ పూదిరి సంస్కృత పండితురాలైనా పోగలను. అబ్బ! అక్కడికి రావాలని నేనెంత తహతహలాడుతున్నానో!"—

తోరూ ఎప్పుడూ, విదేశాలలో జీవితాన్ని గడపాలనే మోజును వెల్లడి స్తూనే ఉండేది. కాని వెంటనే తన హైందవ వాతావరణంలోకి వెళ్ళిపోతూ ఉండేది. బెంగాలీ నేర్చుకున్న వాళ్ళకు నిజానికి సంస్కృతం రాయడమూ చదవడమూ అంత కష్టంకాదు. తోరూ బెంగాలీ చాలా ధారాళంగా మాట్లా డేది కానీ, అందులో రాయడం మాత్రం అంతగా పట్టుబడలేదు. ఆవిడ

రాసిన బెంగాలీ ఉత్తరం ఒకటి చూస్తే, ఆవిషయం స్పష్టమౌతుంది. అందులో వ్రాత చిన్నపిల్లలు వ్రాసినట్లుగా కొట్టివేతలతో తప్పులు తడకలుగా ఉంది. చివరకి తన పేరుకూడా సరిగా వ్రాసుకోలేదు.

1875 డిసెంబరులో తోరూ సంస్కృతం నేర్చుకోవడం మొదలు పెట్టింది. 1876 కల్లా, మేరీకి రాస్తున్న మరో ఉత్తరంలో అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసే విషయాలు వెల్లడించింది. "చూడూ! ఈసారి ఫ్రెంచ్ సాహిత్య క్షేత్రం నుండి కాక, సంస్కృత క్షేత్రంనుండి ఒక పెద్ద ధాన్యపు పనసు కూడబెట్టాను. ఇప్పటికే రెండు మూడు కంకుల్ని చేరవేశాను" అని వ్రాసింది. "హిందూదేశపు గేయగాథలూ, పురాణ కథలూ" అనే ఆవిడ కృతి 1878 లో ఆమె చనిపోయిన తర్వాత అచ్చయింది. ఈ దశలోనే తోరూ మానసిక వ్యవస్థలో పెద్ద మార్పు వచ్చినట్లుగా కనిపిస్తుంది. ఫ్రెంచికీ, ఆంగ్లానికీ సంబంధించిన ఆకర్షణలనుండి విడివడి ఆమె దృష్టి క్రమక్రమంగా హిందూదేశం మీద లగ్నం కాసాగింది. ఆమె కృతు లన్నిటి లోనూ మొదట గణించవలసిన "గేయగాథల"లో కథాంశమంతా హిందూ దేశానికి సంబంధించినదే. ఆ గాథల్ని మలచడంలోనే ఉన్నత శిఖరాల్ని అధిరోహించింది. ఇందులో తోరూ, ఆంగ్లసాహిత్యంతో పోటీపడడానికి వ్యర్థప్రయత్నాలు చేస్తూ మనకు కనిపించదు. తనకు కావలసిన ప్రేరణ కోసం తన జాతికీ దేశానికీ సంబంధించిన పురాణ గాథల వైపు సుముఖత ప్రదర్శిస్తూ కనిపిస్తుంది. ఆవిడ వ్రాసిన, సావిత్రి, ప్రహ్లాద కథలలో ఆసియా ఖండానికి సంబంధించిన ఆత్మయొక్క ఆంతర దృష్టి ఆశ్చర్యజనకంగా విస రింపబడ్డది. దాన్ని ఏ నవీన ప్రాచ్యవాసీ ఇంతవరకూ అంత చక్కగా స్పష్టం చెయ్యలేదు. అలాగే ఆవిడ అనువదించిన "జోగాఢ్య ఉమ" కూడా చక్కని కల్పనతో కూడిన కవితా శిల్పఖండం. ఇవి చూస్తుంటే కవయిత్రి తాను పుట్టిన జాతికి సంబంధించిన గాథల్ని తనకోసమే పాడుకుంటున్నట్లు కనిపిస్తుంది. ఈ పాటలు ఆవిడ ఎప్పుడూ కళ్ళనిండా ఆనందబాష్పాలు నింపుకుని సుముఖంగా ఆదరించే పాటలు. ఇవి చూచే విమర్శకులు ఆవిడలో జీర్ణించుకుపోయిన హైందవతత్త్వాన్ని పదే పదే చెప్పుకున్నారు. మన సంస్కృతి పయనించే అభ్యుదయ పథంలో ఆవిడ ఒక మేలు రాయివంటిదని చాటుకున్నారు.

తోరూ ఫ్రాన్సునూ, ఇంగ్లండునూ చాలా గాఢంగా అభిమానించిన మాట నిజమే. ఆ రెండు భాషల విషయంలో ఆవిడ గుణజ్ఞురాలున్నూ, రసజ్ఞురాలున్నూ! కాని తన వ్యక్తిత్వంలోనూ, ఆలోచనా పద్ధతిలోనూ, ఊహా కల్పనలోనూ ఆవిడ నూటికి నూరుపాళ్ళూ హైందవ స్త్రీ. హిందూ దేశం తర్వాతే ఆవిడ ఫ్రాన్సును గాఢంగా అభిమానించింది కాని తన జీవితంలో ఇంగ్లండులో స్థిరపడాలనుకున్నది. అందుకు బహుశా కారణం, హైందవ స్త్రీలకంటే ఆంగ్ల స్త్రీలకు స్వేచ్ఛ ఎక్కువగా ఉందనే భావన కావచ్చు. బెంగాల్ స్త్రీలలో చాలామంది 19 వ శతాబ్దపు మధ్యభాగంలో పరదాలచాటునే ఉండేవారు. తోరూ తాను విదేశాలలో ఉన్నప్పుడు అపగతం చేసుకున్న స్వేచ్ఛకు విరుద్ధంగా తన దేశంలో ఎన్నో ఆంక్షల్ని గమనించ గలిగింది. అందుకే ఆమె అంతర్జాతీయ పరిధిలో చక్కగా ఇమిడి తనకు జన్మతః లభ్యమైన హైందవ తత్త్వంతో క్రైస్తవ మతవిధానాన్ని ఆలినం చెయ్యగలిగింది. ఇదే ఆవిడ తన జీవితంలో సాధించిన మహత్తర కార్యం. "గాసే" అనుకున్నట్లుగా ఆవిడ శివుడిమీదా విష్ణువుమీదా తాను పెంచుకున్న విశ్వాసాన్ని, చిన్నతనంలో అబ్బే వివిధ విషయాలతోపాటు అవతలికి తోసేసి ఆ స్థానంలో పవిత్రమైనదంటూ మరో మత విశ్వాసాన్ని గ్రహించలేదు. తాను జీర్ణించుకున్న మతం తనకు పూర్తిగా సంతృప్తి నిచ్చిన మాట నిజమే. క్రీస్తుపట్ల ఆవిడకున్న గాఢమైన నమ్మకం అంత చిన్నతనంలో తాను తనువు చాలించవలసి వచ్చినా, ఆ మృత్యువునూ, బాధనూ శాంతంగా ఎదుర్కొన గలిగే శక్తిని ప్రసాదించింది. అంతమాత్రాన ఆవిడ శివుడూ విష్ణువూ అనే భావనల్ని చిన్నపిల్లల భావనలుగా తీసి పారేయలేదు. పైపెచ్చు మిక్కిలి ఆసక్తితో ఆవిడ హిందూ పురాణాల వైపుకు దృష్టిని సారిస్తుండేది. అక్కడ కనిపించే దేవదేవీ సముదాయమన్నా, ఆ నాయికలూ నాయకులన్నా ఆవిడకు ఎనలేని గౌరవం. నిజానికి గాసే కూడా జ్ఞాపకాల్ని నెమరువేసుకుంటూ తోరూ కవిత్వంమీద తన పుస్తకానికి రాసుకున్న పీఠికలో ఇలా వివరించాడు. "ఆవిడ కవితాఖండికలు వేదాలకు సంబంధించిన గాంభీర్యాన్ని నింపుకున్నా ఎంతో సరళ ప్రకృతి కలిగి శోభించేవి. అల్పత్వం కానీ, తుచ్ఛత్వం కానీ, లేశమైనా చేరనియ్యవు."

తోరూ, తన దేశ సంస్కృతిని ఫ్రాన్స్ ఆంగ్ల దేశ సంస్కృతులతో కలగలిపి అల్లుకుంది. తనకు పుట్టుకతోనే లభ్యమైన దేశ్యమైన తెలివితేటల

ఖలం వల్లనే, ఆవిడ ఆంగ్లకవుల వరుసలో గణనీయమైన స్థానాన్ని పొందింది. అతిశ్రద్ధగా ఆవిడ సంతరించుకొన్న కళావిన్యాసం అద్భుతమైంది. అది దివ్యమైందనీ, ఏకేశ్వరాసక్తమైందనీ తోరూ లోకానికి చాటగలిగింది.

ఫ్రెంచ్ రచయితా, విమర్శకుడూ అయిన జేమ్స్ డ్రామెస్టేటర్ తోరూను గురించి యిలా వ్రాశాడు.

"బెంగాల్ ఆడపడుచైన తోరూ ప్రపంచంనుండి ఎంతో అబ్బురాన్నీ ఎన్నో అభినందనల్నీ అందుకోగలిగిన వరప్రసాదిని. జాతివల్లా సంప్రదాయం వల్లా ఆవిడ హిందువు. చదువువల్ల ఆంగ్ల వనిత. హృదయతత్త్వంవల్ల ఫ్రెంచ్ పడతి. ఆంగ్లంలో కవిత లల్లింది. ఫ్రెంచ్ భాషలో వచన రచన సాగించింది. తనకు పద్దెనిమిదేళ్లు వచ్చేనాటికి ఆంగ్ల కవుల్నీ, వాళ్ళ ఛాయల్లో ఫ్రెంచ్ కవుల్నీ హైందవులకు పరిచయం చేసింది. తనలో మూడు దేశాల సంప్రదాయాలనూ, తత్త్వాలనూ మిళితం చేసుకున్నది. తన పాండిత్యం పరిపూర్ణ వికాసోన్ముఖ మవుతూన్నప్పుడు, తనలో ఉన్న ప్రతిభ ఉద్బుద్ధం అవుతూన్నప్పుడు, తనకు కేవలం ఇరవై సంవత్సరాల వయస్సులోనే ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది. ప్రపంచ సాహిత్యంలో తోరూలాంటి వ్యక్తి మరొకరు లేరు. ఆవిడ కావిడే సాటి!

## 2. బెంగాల్ వాతావరణం

బెంగాల్‌ను ఆంగ్లేయులు స్వాధీనం చేసుకున్నప్పుడు ఆ చర్యపట్ల అనుకున్నంత ప్రతిఘటన జన సమూహం నుండి కలుగలేదు. రాజకీయాలను దూరంగా ఉంచి, భావాల్లోనూ ఆలోచనా పద్ధతిలోనూ, ఒక విప్లవకరమైన మార్పును తేవాలని మాత్రమే జనం ప్రతిఘటించారు. వాళ్ళ దృష్టిలో బెంగాల్ బ్రిటన్‌తోపాటు సమాన స్థానాన్ని పొందగలిగింది. చాలామంది బెంగాలీలు విదేశీ భావాలతో కూడుకుని ఉన్నా అందరూ, భావపునరుద్ధరణ మనేది అవసరమనే నిర్ణయించారు. నిద్రాణంగా ఉన్న హిందూదేశం జాగృతం కావాలని విశ్వసించారు.

అమెరికా దేశీయుల స్వాతంత్ర్య సంగ్రామమూ, ఫ్రెంచ్ విప్లవమూ తోరూ ఆలోచనా పద్ధతులమీదా, రచనలమీదా తమ ప్రభావాన్ని చూపిం

చాయి. అప్పుడే వైజ్ఞానిక రంగంలో ప్రపంచం వేస్తున్న ముందడుగూ, పటిష్ఠమైన ఫ్రెంచ్ ఆంగ్ల సాహిత్యాల వారసత్వమూ, ప్రత్యక్షైకాత్మ వాదాన్నీ, ఉపయోగితా వాదాన్నీ, డార్విన్ సిద్ధాంతాన్నీ విక్టోరియన్ జీవితంలో ఉన్న పవిత్రమైన ఆకర్షణమూ, హిందూదేశానికి అందుబాటులో ఉండేట్లు చేయగలిగాయి. ఇవన్నీ ఈ దేశాన్ని ప్రత్యక్షంగా ప్రభావితం చేశాయి. ముఖ్యంగా బెంగాల్ దేశం ఈ ప్రభావానికి పూర్తిగా లోనయింది.

అధునిక భారతదేశానికి జనకు డనిపించుకున్న రాజారామమోహన రాయ్ తనకు యూరప్ ఖండంతో సంబంధం ఉండడంవల్లా, హిందూదేశం మీద అపార ప్రేమ ఉండడంవల్లా, తన దేశాన్నంతా, సరికొత్త జీవంతో, నింప నారంభించాడు. ప్రాక్పశ్చిమాలు నేస్తం కట్టుకునే కొత్త విధానాన్ని నవసాహిత్యంలో ప్రవేశపెట్టాడు. ఆయన కోరిన మత సాంఘిక సంస్కరణలూ, స్త్రీలపై ఆనాడు జరుగుతున్న అత్యాచారాలమీద ఆయనపడ్డ తపనా, పశ్చిమదేశాల్లో జరిగే స్వాతంత్రోద్యమాలమీద ఆయన కున్న శ్రద్ధా, హిందూదేశం మీద గాఢప్రభావాన్ని చూపించగలిగాయి. ఫ్రెంచ్‌దేశం ఎగరేసిన స్వాతంత్ర్య పతాకం చూచి, సంతోషం పట్టలేక గంతేసి కాలు విరగకొట్టుకున్నాడని చెప్తారు. ఆయన మతవిషయకం గానూ, విద్యావిషయకం గానూ, దేశంలో కలిగిన బ్రహ్మాండమైన జాగృతికీ, సంస్కరణకూ కారకుడై ముందు నడిచాడు. విద్యా వైజ్ఞానిక రంగాల్లోగానీ, మతసాంఘిక రంగాల్లోగానీ బెంగాల్ దేశం పునర్జన్మను పొందడానికి కారకు డాయనే.

1817 లో కలకత్తాలో బెంగాలీ సంస్కరణవాదులూ, లోకహితైషులూ కొందరు ఆంగ్ల మిత్రులతో కలిసి హిందూ కళాశాలను ప్రారంభించారు. ఆంగ్ల బెంగాలీ సమైక్యాన్ని చాటే మొదటి సంస్థ అదే. అందులో వంద మంది విద్యార్థు లుండేవాళ్ళు. మరుసంవత్సరం కేరీ, వార్డ్, మార్ష్‌మన్ అనే మిషనరీలు సేరాయ్‌పూర్ కళాశాలను ప్రారంభించారు. వాళ్ళు ముగ్గురూ తమ జీవితాలను బెంగాల్ పునరుజ్జీవనానికి ధారపోసిన మహనీయులు, ఆ కాలేజీకి మొదటి ప్రిన్స్‌పాలు డా॥ డఫ్. తర్వాత డేవిడ్ లెస్టర్ రిచర్డ్‌సన్ ఆ స్థానాన్ని ఆక్రమించుకున్నాడు. తోరూదత్తు కుటుంబానికి చెందిన నీలమణిదత్తుకు కేరీ ఆప్తమిత్రుడు. బెంగాల్లో బ్రిటిష్ రాజ్యస్థాపన జరిగిన అనంతరం 18 వ శతాబ్ది రెండవ పాదంలో తయారైన హైందవ

విద్యావంతుల్లో ఈయన ఒకరు. రాజారామ్‌మోహనరాయీ, మరికొంపరూ మిషనరీలతో కలిసి మెలిసి తిరిగినట్లుగానే ఈయనా వాళ్ళతో తిరిగాడు. ఆ రోజుల్లో హైందవ జీవితంమీద ఈ మిషనరీల ప్రభావం ఎంతైనా ఉంది. అక్కడ ప్రారంభమైన నవ వైజ్ఞానికోద్యమం క్రైస్తవ విధానంతో కలిసి మెలిసి వ్యవహరించింది. బైబిల్‌ను మూలభాషలో చదవాలన్న కోరికతో రాజారామమోహనరాయ్ హిబ్రూ గ్రీక్ భాషల్ని స్వయంగా నేర్చుకున్నాడు. నిజానికి ఆనాటి మేధావులందరూ విదేశభాషల్ని నేర్చుకోవాలన్న కుతూహలంతో గ్రీక్, ఫ్రెంచ్, లాటిన్, జర్మన్ భాషల్ని చాలా ఆప్తితో చదివేవాళ్ళు.

కేరీ హిందూదేశంలో కాలూనడానికి, నిలదొక్కుకోడానికీ నీలమణి చాలా సహాయం చేశాడు. తన యింటనే ఆశ్రయమిచ్చాడు. పేరుపొందిన ఆ మిషనరీ ఎవరూ లేనివాడు. ఆయనభార్య పిచ్చిది. పిల్లలు రోగగ్రస్తులు. అటువంటప్పుడు గౌరవప్రదుడైన ఓ హైందవుడు చేసిన సహాయాన్ని అతడు ఎప్పుడూ మర్చిపోలేదు. మానికతలా వీధిలో ఉండే నీలమణి ఇల్లు రామ్‌బాగన్. రామ్‌బాగన్ కేరీకి సొంత ఇంటికంటే ఎక్కువైంది. ఆ ఇల్లే తర్వాత తోరూ ఇల్లు కూడాను. నీలమణి బాగా ఉన్న కుటుంబానికి చెందిన వాడు. ఆ హిందూ కుటుంబం సమన్వయదృష్టి కలిగిన కుటుంబం. ఆయన పూజలు విరివిగా చేసేవాడు. దానాలకు ధర్మాలకూ విచ్చలవిడిగా ఖర్చుపెట్టే వాడు. అట్లా ఖర్చుపెట్టి చివరికి చేతుల్లో పమ్మిడీలేని స్థితికివచ్చినప్పుడు కేరీ నీలమణికి ఎంతో సహాయకారిగా ఉండేవాడని చెప్పుకుంటారు. ఆ విధంగా ఆంగ్ల జిజ్ఞాసువులకూ, మిషనరీలకూ, తోరూ కుటుంబానికి మధ్య సంబంధం తోరూ పుట్టక ముందు మూడుతరాలనుండే ఆరంభమైం దనవచ్చును.

హైందవుల్ని ఆంగ్ల రచనా వ్యాసంగం బాగా ఆకర్షించింది. తొలి రోజుల్లో బెంగాల్‌లో తయారైన కవుల్లో హెన్రీలూయీ వివియన్ డెరోజియో (1809 – 1831) ఒకరు. హిందూ కళాశాలలో ఆయన మొదట గుమాస్తాగా ఉండి తర్వాత అధ్యాపక పదవిని అందుకోగలిగారు. ఆయనతల్లి హైందవి. తండ్రి పోర్చుగీస్ దేశస్థుడు. ఆయన రచించిన కావ్యాల్లో బాగా ప్రచారాన్ని పొందినది "జంఘీరా పకీరు–ఇతర రచనలు." హిందూ కళాశాల ప్రిన్సిపాలు డేవిడ్ లెస్టర్ రిచర్డ్‌సన్ కలకత్తా 'లిటరరీ గజెట్'కు సంపాదకత్వం వహించి, ఈయన్ని బాగా ప్రోత్సహించాడు. రిచర్డ్‌సన్ రాసిన

"సాహితీ పత్రాలు ఆనాటి బెంగాలీ కవులమీద గొప్ప ప్రభావాన్ని చూపించింది.

1874 డిసెంబర్ బెంగాలీ పత్రికలో తోరూ డెరోజియో మీద ఓ వ్యాసం వ్రాసింది. కాశీప్రసాద్ ఘోష్ అనే కవి డెరోజియోను అనుసరించి ఆంగ్లంలో పద్యాలు వ్రాసేవాడు. అట్లా వ్రాసిన వాళ్ళల్లో ఆయనే ప్రథమ బెంగాలీ. ఆయన రచించిన 'షాయక్' తదితర పద్యాలూ 1830 లో ప్రచురితమైనాయి. 1835 కు పూర్వం మోహన్‌లాల్, హసన్ ఆలీ, రాజ గోపాల్ అనే ముగ్గురు కవులు ఈ కోవకు చెందినవాళ్ళే. రాజనారాయణ దత్ తాను వ్రాసిన 'ఓస్మిన్', 'అరేబియన్ టేల్' అనే రచనల్ని 1841 లో రిచర్డ్‌సన్‌కు అంకితమిచ్చాడు. ఆయన వాటిని ప్రాచీనమైన గాథా పద్ధతిలో రచించాడు.

మైకేల్ మధు సూదన దత్తుకూడా (1827–1873) హిందూకళాశాలలో విద్యాభ్యాసం చేశాడు. ఆయన రిచర్డ్‌సన్‌కు అభిమాన పాత్రుడైన విద్యార్థి. ఆయనకు ముందు, కాశీప్రసాద్, రాజనారాయణ లిద్దరూ ఆ కళాశాలలో చదువుకున్నవారే. మధుసూదనదత్తు 1843 లో క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు. కొన్నాళ్ళు కలకత్తాలోని బిషప్ కళాశాలలో ఉండి తర్వాత 1849 లో మద్రాసు వెళ్ళాడు. మొదట ఆయన ఇంగ్లీషులోనే వ్రాసినా తర్వాత తన మాతృభాషలోనే రచనా వ్యాసంగాన్ని కొనసాగించి అందులో ప్రసిద్ధుడైన కవిగానూ నాటకకర్తగానూ పేరు ప్రతిష్ఠ లార్జించుకున్నాడు.

జూలై 1876 లో తన ఆంగ్ల స్నేహితురాలు మేరీమార్టిన్‌కు తోరూ ఉత్తరం వ్రాస్తూ మైకేల్‌ను గురించి ప్రస్తావించింది. అప్పుడే అచ్చయిన తన పుస్తకం "Sheaf gleaned in French Fields" ను బెంగాలీ అనే పత్రికలో విమర్శించారనీ, బాగా చదువుకున్న మనుష్యుల్లోకూడా వ్యక్తంకాని సంస్కృతి ఈ రచనలో కనిపిస్తున్నట్లుగా వ్రాశారనీ, తెలియజేసింది. అంతేకాక ఆ విమర్శకుడు తాను మైకేల్ మధుసూదనదత్ కుటుంబానికి చెందినట్లుగా పొరపాటు పడ్డాడనీ, కాని ఆయన తమకేవిధంగానూ బంధువు కాడనీ వివరించింది. మైకేల్ జెస్సూరు జిల్లాలో ఉండే సగర్‌దారి గ్రామంలో పెరిగినవాడు.

1851 లో తోరూ పినతండ్రి హరిచందర్‌దత్ Fugitive Poems అనే ఓ కావ్యాన్ని ప్రచురించాడు. అంతేకాక, ఆధ్యాత్మిక పరమైనవీ, నీతి

దాయకమైనవీ, కవితాత్మ కలిగినవీ, అయిన రచనలు చేశాడు. తోరూ మరో పినతండ్రి గిరీశ్‌చందర్ 'Cherry Blossoms' అనే కావ్యాన్ని వ్రాశాడు. వీళ్ళు D. F. A. అని పేరుపొందిన దత్తు కుటుంబ గ్రంథానికి (Dutt Family Album) తరుచూ వ్రాస్తుండేవాళ్లు. D. F. A. ను 1870లో, తోరూ తండ్రి గోవిన్ చందర్‌దత్ ప్రకటించారు. అందులో ఆయన రచనలే కాక, ఆయన మేనల్లుడు ఉమేశ్‌దత్ పద్యాలుకూడా ఉన్నాయి. ఆ పుస్తకాన్ని లాంగ్‌మన్ అండ్ గ్రీన్ కంపెనీవారు ప్రచురించారు. మొదట మొదట దానికి అతిసామాన్యమైన ఆదరణే లభించినా రానురాను, అది బెంగాల్‌లోని చాలామంది రచయితల్ని కుతూహలచిత్తుల్ని చేసింది. దత్తు కుటుంబానికి ఆంగ్లంలో పద్యాలు వ్రాయాలనే గాఢమైన తపన ఎంత ఉందో తెలియజేయడమేకాక, ఆ పుస్తకానికి సాహిత్యపు విలువకూడా ఉంది. అది బెంగాలీలు వ్రాసిన ఆంగ్ల పద్యాల మొదటి సంకలన గ్రంథమని చెప్పవచ్చు. అంతేకాక ఆంగ్లంలో బెంగాలీలు వ్రాసిన ప్రాచీన పద్యరచనా విభాగానికి ఈ గ్రంథమే ప్రాతినిధ్యం వహించింది. మైకేల్ మధుసూదనదత్తు వ్రాసిన Captive Lady కూడా అటువంటిదే. D. F. A. లో తోరూ రచనలు కానీ అరూరచనలు కానీ చోటుచేసుకోలేదు. అందుకు కారణం ఆ సమయంలో ఇంగ్లండులోఉన్న ఆ పిల్లలిద్దరూ పద్యాలు వ్రాయాలనే విషయాన్ని మనస్సుకు తెచ్చుకోకపోవడమే కావచ్చును. 1873 లో వాళ్లు హిందూదేశానికి తిరిగివచ్చాకనే తమ రచనల్ని ప్రచురించే విషయం ఆలోచించారు. అప్పటినుండీ వాళ్లు బెంగాల్ పత్రికకు వ్రాయడంలో నిమగ్నులయ్యారు. ఇంగ్లండులో ఉన్నప్పుడు వాళ్ళు ఫ్రెంచ్ పద్యాలను ఇంగ్లీషులోకి అనువదిస్తుండేవారు.

D. F. A లో గోవిన్ చందర్ 66 పద్యాలు వ్రాశాడు. ఆయన శైలి 17 వ శతాబ్దికి చెందిన దానిలాగా వింతగా ఉండేది. ఉమేష్ అందులో ఉన్న 197 పద్యాలలో 73 పద్యాలు వ్రాశాడు. ఈ గ్రంథం ప్రతిభాపూర్ణమైన ఒక కుటుంబానికి స్మృతి చిహ్నమేకాక కలకత్తానగరంలో, ఉన్నత ఆంగ్ల విద్యాభ్యాసాన్ని తొలిసారిగా ప్రోత్సహించిన ఉపాధ్యాయులకు అభినందన పత్రంగాకూడా భాసించింది. తోరూకు ఈ గ్రంథమంటే చాలా ఇష్టం. తోరూ స్నేహితురాలు మేరీ తోరూ పుస్తకానికి విమర్శరాసి క్వీన్స్ మేగజైన్‌కు పంపించగా వాళ్లు దానిని ప్రచురణకు స్వీకరించలేదు. అది తెలిసి తోరూ "పాపం! నీ విమర్శ వాళ్లు వేసుకోలేదుకదూ! పోనీలే! వాళ్ళంతే!

వాళ్ళను గురించి నాకంత మంచి అభిప్రాయ మేమీలేదు. **D. F. A.** ను కూడా వాళ్ళు సుముఖంగా చూడలేదు!'' అని వ్రాసింది.

ఆ కుటుంబంలో మరో కవి శశిచంద్రదత్. ఆయన 1878 లో "Vision of Sumeru" అనే పుస్తకాన్నీ, మరికొన్ని పద్యాలనూ ప్రచురించాడు. ఈయన పినతండ్రి గోవిన్‌దత్తు బంధువూ అయిన రమేష్‌చంద్ర దత్తు, దత్తు కుటుంబంలోని కవులందరి కంటె ప్రసిద్ధి వహించినవాడు. ఈయన తోరూ కుటుంబంతో సన్నిహితంగా మెలగుతూ, తోరూ, అరూల కవిత్వాన్ని మెచ్చుకుంటుం టేవాడు.

19 వ శతాబ్దం హిందూదేశంలో ఆంగ్లాన్ని ప్రవేశపెట్టడం వల్లనే కాక వైజ్ఞానికమైన సంస్కరణలతోనూ, మతసంబంధమైన గుర్తింపులతోనూ చాలా ఫలవంతమైన కాలంగా తీర్మానింపబడ్డది. ఈ కాలంలోనే యూరప్ దేశీయులు హైందవ విజ్ఞానంచేత గాఢంగా ఆకర్షింపబడి సంస్కృత సాహిత్యాన్ని లోతుగా తరచబూను కున్నారు. ఈ కాలానికి కొంచెం ముందుగా కలకత్తాలో రాయల్ ఏషియాటిక్ సొసైటీ పుట్టింది. సర్ విలియం జోన్సు, జాన్ విల్సన్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, సర్ విలియం హంటర్ మొదలైనవారు హిందూదేశానికి సంబంధించిన ఉత్కృష్టమైన ప్రాచీనతమీద అనంతమైన శ్రద్ధాసక్తుల్ని తమ తమ దేశాలలో కల్పించడానికి కారకులయ్యారు.

తోరూ ఆ విధంగా సారవంతమూ, సృజనాత్మకమూ అయిన కాలంలో బ్రతికింది. తన కాలంలో దేదీప్యమానంగా వెలగడమేకాక తాను పుట్టిన వంద సంవత్సరాల తర్వాత, ఈనాటికీ సాహిత్యరంగాన్ని వెలిగిస్తున్న ధ్రువతారలా భాసిస్తున్నది.

# 3 రామబాగన్‌లో దత్తు కుటుంబం

దత్తు కుటుంబానికి చెందినవారు మొదట బెంగాల్ దేశంలోని బర్ద్వాన్ జిల్లాకు చెందిన అజాపూర్‌లో ఉండేవాళ్లు. కులంచేత వాళ్లు కాయస్థులు. నీలమణి 1757 జనవరి 3 న జనించాడు. తన సంతానానికి కంతటికీ, తన

వ్యక్తిత్వంలోని ప్రత్యేకతవల్ల స్ఫూర్తినీ ఉత్సాహాన్నీ కలిగించాడీయన. నీలమణి నాన్నగారు తన కుటుంబంలో కొందరిని బర్ద్వాన్‌లోనే వదిలిపెట్టి తాను కలకత్తాలో ఉన్న రామబాగన్‌కు తరలివచ్చారు. అక్కడ ఆయనను ఉదార స్వభావం కలిగిన విజ్ఞాన ఖనిగా అందరూ మెచ్చుకొనేవారు. ఆయన ఈవీ, అతిథుల్ని ఆదరించే తీరూ, ఎంతోమందిని ఆయన యింటికి రప్పించేవి. స్నేహితులు ఆయన చుట్టూ పోగయ్యేవారు. ఎంతో ఓర్పునూ ఔదార్యాన్నీ చూపించే ఆయన భావాలపట్ల అందరికీ గౌరవమే.

నీలమణికి, రసమయి, హరీష్, పీతాంబర్‌లు ముగ్గురూ కొడుకులు. గోవిన్‌చందర్ రసమయి మూడవ కొడుకు. తోరూ తండ్రి ఆయనే. రసమయి మిగిలిన కొడుకులు, కిషన్‌చందర్, కైలాస చందర్, హరిచందర్, గిరీష్ చందర్‌లు. పీతాంబరుడి బిడ్డలు, ఈశానచందర్ శశిచందర్‌లు. ఈశానుడి కొడుకే ప్రసిద్ధిచెందిన రచయితా, భారతీయ చరిత్ర తత్త్వవేత్తా, అయిన రమేష్‌చందర్. ఈనాటికీ రామబాగన్ దగ్గర ఆయన నివసించిన ఇల్లుంది. దాని ముఖద్వారం మీద, "ఆర్. సి. దత్, I. C. S, C. I. E. ప్రసిద్ధ సాహిత్యవేత్త – ఇందులో 1848 నుండి 1872 వరకూ నివసించాడు" అనే చెక్కడపు అక్షరాలను మనం చూడవచ్చు. ఆయన చుట్టం అశోరదత్ ఇప్పటికీ ఆయింట్లోనే ఉంటున్నాడు.

తోరూ తాతగారు రసమయిదత్ ఎంతో ఆసక్తితో ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేశారు. ఆయన ఆర్థిక శాస్త్రవేత్తకూడా. తమ భాషపట్ల ఆయనకున్న కుతూహలాన్ని ఆంగ్లేయులు సహజంగానే ప్రోత్సహించడం జరిగింది. తోటి బెంగాలీలలో ఆంగ్ల సాహిత్యాధ్యయన వ్యాప్తికి, ఆ ప్రోత్సాహం బాగా తోడ్పాటు నిచ్చింది. రసమయి హిందూ కళాశాల కమిటీలో గౌరవకార్యదర్శి. లఘువాద న్యాయస్థానంలో న్యాయాధిపతి పదవినీ, అభ్యర్థన న్యాయశాలలో కమిషనర్ పదవినీ ఆయన నిర్వహించారు. "ఇంట్లో బ్రహ్మాండమైన ఇంగ్లీషు పుస్తకాలను సేకరించి, తన బిడ్డలకు ఆంగ్ల సాహిత్యంమీద వెర్రి మోజును కలిగించాడు. అదే ఆయన మనవరాళ్ళకు వారసత్వంగా లభించింది" అని రమేష్ చందర్ దత్ రసమయిని గురించి వ్రాశాడు.

రసమయి తండ్రి బాగా డబ్బు ఖర్చుపెట్టి పూజలూ పురస్కారాలు చేస్తుండేవాడు. ఆయన్ని నిర్ధనుణ్ణిచేసిన అవంటే రసమయికి పడేదికాదు. అందువల్ల సనాతనాచారం కల బ్రాహ్మణులందరికీ ఆయనంటే పడేదికాదు.

రసమయి, తోరూ పుట్టడానికి రెండేళ్ళకు ముందు 1854, మే 14 న చని పోయాడు. ఆయన, బైబిల్ చదివి, అందులో ఉన్న సూక్తుల్ని ఇంట్లో ఉన్న ఆడవాళ్ళందరూ చదువుకుని బెంగాలీ భాషలో వ్రాసుకుంటే బాగుంటుందంటుండేవాడు. వాళ్ళందరికీ మార్గదర్శి, స్కాట్, బైబిల్ మీద వ్రాసిన సమీక్ష మాత్రమే.

దత్తు కుటుంబం క్రైస్తవమతా న్నవలంభించడం చాలా తమాషాగా జరిగింది. దాని వివరాలు S. M. Mackey అనే ఆయన 1854 జూన్ 29 న వ్రాసిన ఉత్తరంలో ఉన్నాయి. రసమయి చనిపోయి, దహనక్రియలు పూర్తిచేసిన వెంటనే, ఆయన పెద్దకొడుకు కిషన్‌కు చాలా జబ్బు చేసింది. ఆ జబ్బుతోనే ఆయన మరణించాడు. ఆయన తమ్ముడు గిరీష్, చావుబ్రతు కుల్లో ఉన్న అన్నకోసం 'అజిల్‌వీ టెంపుల్' అనే మిషనరీని పిలిపించాడు డాక్టర్ మాకే. టెంపుల్‌తోపాటు, తాను బయలుదేరడానికి వీలుకాక, ఇవార్ట్ అనే మరొకర్ని పంపించాడు. తన అన్న కిషన్ చచ్చిపోబోయేముందు పరలోకాన్ని చూచాడనీ, క్రైస్తవమతంమీద నమ్మకాన్ని పెంచుకున్నాడనీ, ఆ మతాన్ని స్వీకరించదలుచుకున్నాడనీ గిరీష్ వాళ్ళకు స్పష్టం చేశాడు. కాని చనిపోబోతున్న మనిషి మంచం దగ్గరికి క్రైస్తవ మిషనరీలను తీసుకు రావడానికి ఎవరూ ఒప్పుకోలేదు. అందువల్ల, గిరీశే తాను హిందువైనా, మిష నరీ బాధ్యతల్ని స్వీకరించి, పరిశుద్ధాత్మనూ పరలోక ప్రభువునూ, అతని పుత్త్రుడినీ, పేర్కొంటూ, తన అన్నను క్రైస్తవ మతస్థుణ్ణి చేసేశాడు. అప్పుడు కొన ఊపిరితో ఉన్న కిషన్ తన కుటుంబ సభ్యుల నందర్నీ తన చుట్టూ చేర్చుకుని, తాను క్రైస్తవుడననే అర్హతతో తనవారి నందరినీ క్రైస్త వులు కమ్మని కోరుకున్నాడు.

డాక్టర్ మాకే కథనం ప్రకారం కిషన్ మరణించిన తర్వాత, కుటుంబ సభ్యులంతా, క్రైస్తవులుగా మారడంలోగల మంచి చెడ్డల్ని మేలు కీళ్ళనూ పూర్తిగా చర్చించి నిర్ణయించుకున్నారు. అయితే కుటుంబమంతా ఇట్లా పరివర్తనం చెందడం స్త్రీల కెవ్వరికీ ఇష్టంలేదు. దత్తులంతా క్రైస్తవులు కావడం 1862 లో గానీ పూర్తికాలేదు. కిషన్ మరణానికీ, దీనికీ మధ్య ఎనిమి దేళ్ళ వ్యవధి ఉండడానికి కారణం బహుశా, హైందవ తత్వంయొక్కా, స్త్రీలయొక్కా ప్రతిఘటన కావచ్చు.

గోవిన్ చందర్ బాబు బృందావన్ మిత్తర్ కుమార్తె క్షేత్రమణిని వివాహం చేసుకున్నాడు. ఆమె హైందవ మత గ్రంథాలనూ, పురాణాలనూ పుక్కిటపట్టిన స్త్రీ. బెంగాలీ భాష బాగా వచ్చును. తన యింట్లో, తాను, అధికారం చేస్తున్నట్లుగా తెలియనీయకుండానే ఆవిడ మకుటంలేని మహారాణి. ఆ అధికారంవల్లా, ఆమెకు పాటలూ కథలూ చెప్పే నేర్పువల్లా, బిడ్డ తోరూలో పాతకాలానికి చెందిన వీరగాథలపైన మక్కువ గాఢంగా ఏర్పడడం జరిగింది. తోరూ తన ఫ్రెంచ్ స్నేహితురాలు మిలే క్లారిస్సేకు ఉత్తరం వ్రాస్తూ "మా అమ్మ రాత్రివేళప్పుడు మా దేశానికి సంబంధించిన పాత పాటల్ని పాడుతుంటే ఎప్పుడూ నా కళ్ళనిండా నీళ్ళూరుతుండేవి" అని తెలియజేసింది.

క్షేత్రమణి, తన భర్తా, పిల్లలతోపాటు, 1862 లో క్రీస్తుమతం పుచ్చుకున్నా ఆకుటుంబంలోని అందరి స్త్రీలకు మల్లేనే, లోలోపల హైందవ మత విశ్వాసాన్ని కూడా పదిలంగా నిలుపుకుంది. రానురాను క్రైస్తవమతం ఆవిడలో అచంచల విశ్వాసాన్ని నింపింది. గోవిన్ చందర్ ఒకప్పుడు ఈ మత పరివర్తనంవల్ల తనకూ తన భార్యకూ మధ్య అగాధం ఏర్పడుతుందేమోనని భయపడ్డట్టుగా కనిపించేవాడు. D. F. A. లో ఆయన వ్రాసుకున్న ఒక పద్యం ఈ విషయానికి సాక్షి.

**ఒద్దు వెళ్ళి పోవద్దు**
**ఒక్క నిముషం నిలు !**
**నన్ను శపిస్తూ చీదరించుకోవద్దు !**
**అందరిలాగే నువ్వూ**
**నన్నొక్కణ్ణే**
**అద్ధంతరపు అడవిలో వదిలేసి**
**పోనే పోవద్దు !**
**హృదయం లేనిదీ**
**క్రూరత్వం పొదువుకున్నదీ**
**గర్వాంధమైనదీ**
**ఆ గుంపుతో చేరి**
**నువ్వూ నన్ను పరిహసిస్తావా !**

ఫలశూన్యమైన
ప్రభాతాన్నయినా పరిహసించే నన్ను
ప్రతిమల్ని నిరసిస్తూ
ప్రభువు ముందు మోకరిల్లే నన్ను
వదిలేసి వెళ్ళిపోతావా!
ఒద్దు!

క్షేత్రమణి పెళ్ళినాటికి ఆవిడకున్న ఆంగ్లభాషా పరిచయం చాల తక్కువ. తర్వాత ఆవిడ అందులో మంచి ప్రవేశం సంపాదించుకున్నది. The Blood of Jesus అనే గ్రంథాన్ని బెంగాలీ భాషలోకి అనువదించింది. దాన్ని Tract & Book Society వారు కలకత్తాలో ముద్రించారు. అల్పాయుష్కమైన తన కుటుంబంలో దీర్ఘకాలం బ్రతికింది ఈవిడే. బ్రతికి నన్నాళ్ళూ భగవంతుడికి ప్రాతినిధ్యం వహించే పవిత్రయోగిని లాగా లాగా ఆవిడ వ్యవహరించి 1900 సంవత్సరంలో స్వర్గస్థురాలయింది.

క్షేత్రమణి ప్రభావం తన కూతుళ్ళిద్దరి మీదా, వాళ్ళ తండ్రి ప్రభావంతోపాటు జతగూడి ఉంది. బిషప్ క్లిఫర్డ్ హరిహరదాస్ అనే ఆయన దత్తు కుటుంబాన్ని గురించి వ్రాస్తూ, "తోరూ తనకున్న తెలివినీ పాండిత్యాన్నీ తండ్రి వైపు వాళ్ళనుండీ, నైతికమైన హృదయ సౌందర్యాన్నీ, నిర్మల ప్రవర్తననూ తల్లిదగ్గరనుండి పొంది ఉండాలి, తప్పదు." అని వివరించాడు.

గోవిన్ చందర్ చాలా ఉదారుడు. అందరి యెడలా సానుభూతి కలవాడు. ఎవరిపట్లా అసహనానికి, కార్పణ్యానికి చోటివ్వనివాడు. రసమయి అయిదుగురు కొడుకుల్లోనూ బాగా ప్రసిద్ధి వహించిన వాడీయనే. 1836 లో హిందూకళాశాలలో చేరి ఆయన ప్రొఫెసర్‌గారికి మది మెచ్చే శిష్యుడయ్యాడు. ప్రొఫెసర్ డేవిడ్ లెస్టర్ రిచర్డ్సన్‌కు గోవిన్ అంటే ప్రాణం. గోవిన్ చందరూ, మైకేల్ మధుసూదనదత్తూ, ఇద్దరూ కలిసి కాలేజీ నాటకాల్లో పాల్గొనేవారు. షేక్స్పియర్ పద్యాలు చదవడ మెట్లాగో ఆయన తన టీచర్ దగ్గర నేర్చుకున్నాడు. ఆ టీచర్ ప్రభావం గోవిన్ మీద ఎక్కువగా ఉండేది. ప్యారీచరన్ సర్కార్, గగనేంద్రమోహన్ టాగూర్, భూదేవముఖర్జీ, భోలానాధ్ చందర్ మొదలైన వారంతా, గోవిన్‌తోపాటు రిచర్డ్సన్‌కు అభి

మానవమాత్రులైన శిష్యులే. ఆ రోజుల్లో హిందూ యాక కళాల చాలామంది రచయితల్ని ఆలోచనాపరుల్నీ తయారుచేయగలిగింది.

గోవిన్‌చందర్ చాలా చిన్న వయస్సు నుండీ ఏవో గిలుకుతూనే ఉండేవాడు. చిన్నప్పుడే కొన్ని పద్యాలను ఒక సంపుటంగా ప్రచురించగా దాన్ని (Black wood) పత్రిక సుముఖంగానే విమర్శించింది. 1848 డిసెంబర్ కలకత్తా రివ్యూలో కూడా దానిమీద మంచి విమర్శ వచ్చింది. ఆ పద్యాలే తర్వాత మిగతావాటితోపాటు D.F.A. లో చోటు చేసుకోవడం జరిగింది.

చదువు పూర్తయ్యాక గోవిన్ ప్రభుత్వ శాఖలో చేరి, ఆదాయ వ్యయ శాఖాధికారాన్ని చేపట్టాడు. అప్పుడు బెంగాలీలను చిన్నచూపు చూస్తున్నాడనే అభియోగం మీద, ఆయన మిక్కిలి తెగువతో ప్రవర్తించడంవల్ల, గోవిన్‌ను బొంబాయికి బదిలీ చేశారు. అక్కడి కాయన తన కుటుంబంతో తరలి వెళ్ళవలసి వచ్చింది. కానీ, అక్కడ కూడా ఆయనకు తాను చేసే ఉద్యోగంలో పెంపు కనిపించలేదు. మీదు మిక్కిలి వెనుకటి తన ప్రవర్తన వల్ల తనను నిర్లక్ష్యం చేసినట్లే కనిపించింది. అందువల్ల తన ఉద్యోగానికి ఆయన రాజీనామా ఇవ్వవలసి వచ్చింది. బాగా ధనవంతుడవడంవల్ల ఆయన్నిదేమీ బాధించలేదు. మీదు మిక్కిలి ఉద్యోగం లేకపోవడంవల్ల చాలా సమయం ఆయన సాహిత్యవ్యాసంగంలోనూ, మతవిషయిక వ్యావర్తనంలోనూ వెచ్చించడానికి వీలు కలిగింది.

గోవిన్ తన కుటుంబంతో సహా ఇంగ్లండు నుండి 1873 లో తిరిగి వచ్చిన వెంటనే, ఆయన్ని గురించి రమేష్ చందరదత్ ఇలా వ్రాశాడు: "ఆయనా, ఆయన కుటుంబమూ నేనంటే చాలా దయగానూ, మర్యాదగానూ, హుందాగానూ చూచేవారు. వాళ్ళ హృదయాలు పవిత్రమైనవి. ఇంగ్లండు నుండి తెచ్చుకున్న జబ్బు, పెద్దబిడ్డ అరూను, ప్రతిభావంతురాలైన తోరూనూ కబళించింది. ఇంగ్లండులో ఎడ్మండ్‌గాసే తోరూ కవిత్వాన్ని స్తుతించాడు. ఆమె పద్యాలు చదివినవాళ్ళల్లో కొంత మంది వాటిని బాగా అభిమానించారు. ఆమే గనుక కొంత పరిణత వయస్సును పొందేవరకూ బ్రతికి ఉంటే, ఆంగ్ల సాహిత్యంలో తనపేరును చిరస్థాయిగా నిలుపుకుని ఉండేది. గోవిన్ చందర్ పిల్లల మరణం తర్వాత కొన్ని సంవత్సరాలు మాత్రమే బ్రతికాడు. ఆ తర్వాత కొన్నేళ్ళకు ఆయన భార్య ఆయన్ని అనుసరించింది.

# 4. బాల్యం

తోరూ రామబాగన్‌లో పుట్టింది. ఆయిల్లు కలకత్తా నగరం మధ్యలో మానిక్‌తలా వీధిలో ఉండేది. గోవిన్ చందర్‌కు ముగ్గురు పిల్లలు. 1851 అక్టోబర్ 18 న పెద్దవాడు అబ్జూ జనించాడు. 1865 జూలై ఏడవ తారీకున పరమపదించాడు. రెండవ బిడ్డ అరు 1854 సెప్టెంబర్ 13 న పుట్టింది. 1874 జూలై 23 న మరణించింది. తోరూ 1856 మార్చి 4 వ తేదీన జనించి, 1877 ఆగష్టు 30 న మరణించింది.

దత్తు కుటుంబం పిల్లలతో సహా, 1862 వ సంవత్సరంలో కార్న్‌వాలిస్ స్క్వేర్‌లో ఉన్న చర్చిలో మత పరివర్తనం పొందింది. ఇది జరిగాక, ఒకనాడు అరూ, తోరూ లిద్దరూ ఆడుకుంటున్నారు. ఉన్నట్లుండి "ఆరూ, నీవు క్రైస్తవివి కదా! బైబిల్‌లో ఎవరైనా ఒక చెంపన కొడ్తే వాళ్ళకు రెండో చెంప చూపించమని ఉంది. నిన్ను కొడ్తే నువ్వేం చేస్తావ్?" అని తోరూను ప్రశ్నించింది. "నేనూ రెండోచెంప చూపిస్తాను!" అని తోరూ సమాధానం చెప్పిందో లేదో అరూ, తన చెల్లెలు నివ్వెరపోయేటట్లు లాగి చెంప మీద కొట్టింది. తోరూ ప్రతీకారం చెయ్యడం అట్లా ఉంచి బేరుమని ఏడవడం మొదలు పెట్టింది. ఆవిడ జీవిత చరిత్ర వ్రాసిన హరిహర్‌దాస్ కూడా తోరూ రెండోచెంప చూపించిందో లేదో చెప్పలేదు. దీన్నిబట్టి తోరూకంటే అరూ గడుసుదే అనిపించినా, జీవితంలో మాత్రం చిన్నదైన తోరూ తన అక్కను ముందుకు నడిపిస్తుండేది.

పిల్లలు ముగ్గురూ చిన్నప్పటి నుండీ చాలా శ్రద్ధగా చదివేవాళ్ళు. బాబూ సాహెబ్ చందర్ బెనర్జీ అనే ఓ సచ్ఛీలుడైన క్రైస్తవుడు వాళ్ళకు ఉపాధ్యాయుడు. ఆయన మేనగోడలు 1885 లో భారత జాతీయ కాంగ్రెస్‌కు మొదటి అధ్యక్షుడుగా ఎన్నికైన W. C. బెనర్జీగారి భార్య. ముగ్గురు పిల్లలకూ బాబూసాహెబంటే ఎంతో యిష్టం. 1877 లో మిస్ మార్టిన్‌కు

ఉత్తరం వ్రాస్తూ తోరూ ఆయన్ని ఎంతో ప్రశంసించింది. "ఆయన మాకు ఇంగ్లీషు చెప్పేవారు. మేము చాలా చిన్నపిల్లలంగా ఉన్నప్పటి నుంచీ ఆయనే మాకు టీచరు. చిన్నప్పుడు ఆయనంటే మా కెంతో యిష్టంగా ఉండేది. పెద్దయ్యాక ఆ యిష్టం గౌరవంగా మారిపోయింది. ఆయన సిసలైన మానవుడు. నిజమైన క్రైస్తవుడు. మా దుఃఖాలతోటీ, సంతోషాల తోటీ ఆయన సహానుభూతిని పొందేవారు. ఆయన దగ్గర పాఠం చెప్పు కోవడం ఓ గొప్ప వరం! ఆయన్ని మెల్లిగా మాటల్లోకి దింపి, అవీ యివీ చిల్లర విషయాల ప్రసక్తి తెచ్చి కాలం గడిపేయాలని ఎంతో ఆరాటపడే వాళ్ళం. కాని ఆయన పడనిచ్చేవారా? మమ్మల్ని ఎక్కువ మాట్లాడనిచ్చే వారు కాదు. ఒకసారి మేము ఒకరి తర్వాత ఒకరంగా, ఆర్థిక శాఖలో ఉద్యోగం చేసే వాళ్ళను గురించీ, వాళ్ళ ఆరోగ్యాలను గురించీ ఎంతో ఆత్రుతతో అడిగి అల్లరి చేయడం నాకు బాగా గుర్తు.

ఆయన దగ్గర మేము మిల్టన్ వ్రాసిన 'పారడైజ్ లాస్ట్' చదువు కున్నాం. దాని మొదటి భాగమూ, రెండో భాగమూ మాకు కంఠతా వచ్చు"

చదువుతోపాటు అరూ, తోరూ లిద్దరూ పియానో వాయించడమూ, ఇంగ్లీషు సంగీతం నేర్చుకోవడమూ ప్రారంభించారు. అప్పుడు వాళ్ళ కా విద్య నేర్పి నావిడ మిసెస్ సైనేస్. పిల్ల లిద్దరూ పాశ్చాత్య దేశాలకు వెళ్ళిన తర్వాత కూడా ఆ విద్యను బాగా రాణించారు. అక్కడ మంచి పియానో వాద్యకత్తెలుగా, పాశ్చాత్య సంగీతాన్ని పాడేవాళ్ళుగా గుర్తింపు తెచ్చు కున్నారు. వాళ్ళ గొంతులో భావ గాంభీర్యమూ, మంచి ఒదుగూ ఉండేవి.

ఈ విధంగా అబ్బిన పాశ్చాత్య బెంగాలీ సంగీత సంపదా, కలకత్తాలో పూర్వీకులు సంపాదించి పెట్టిన యిల్లూ, తోటా, చుట్టూ చేరే లెక్కలేనంత మంది స్నేహితులూ, బంధువులూ, చదువూ వీటన్నిటితోటే తోరూ బాల్యం ఎంతో ఆనందంగా గడిచేదనే చెప్పవచ్చు. కానీ, ఆ ఆనందానికి విఘాతం కలిగించిన విషాదసంఘటన 1865 తో జరిగింది. అదే, చిన్న వయస్సులో అబ్జూ చనిపోవడం.

రమేష్ చందర్, తనకు బంధువులైన దత్తు కుటుంబీకులను గురించి బాగ్‌మరిలో ఉన్న వాళ్ళ యింటినిగురించీ తోటనుగురించీ ఎంతో మనో హరంగా వ్రాసుకున్నాడు.

"ఆ యింటిచుట్టూ ఉన్న తోట చాలా ఎకరాలమేర వ్యాపించి ఉంది. దాన్నిండా ఎక్కడ చూచినా చల్లని నీడనిచ్చే ఫలవృక్షాలు. అక్కడే ఒక కాలవ మీద గ్రామీణ సౌందర్యానికి ప్రతీకలా ఒక వంతెన ఉంది. మా చిన్నప్పుడు అదంటే మాకు ప్రాణంగా ఉండేది. మే మా తోటంతా తిరిగి చూస్తుండేవాళ్ళం. గోవిన్‌చందర్‌కు ఒక్కడే కొడుకు అబ్జూ! వాడు మాకు తాను తిరిగే స్థలాలన్నీ చూపిస్తుండేవాడు చాలా చిన్నతనంలోనే వాడు మమ్మల్ని విడిచి వెళ్లిపోయాడు. వాడి మరణం తల్లికి తండ్రికీ పెద్ద దెబ్బ. ఫలవృక్షాలతో కూడిన వనమధ్యంలో అనుకూలంగా విశాలంగా నిర్మింపబడిన భవనం హుందాగా ఉండేది. పరిపూర్ణ విశ్రాంతికి ప్రతీకగా కనిపించేదది. ఆ భవనంలో చాలా జాగ్రత్తగా ఏరి, అమర్చుకున్న మంచి పుస్తకాలుండేవి. గోవిన్ చందర్ మనస్సుకు శాంతినిచ్చేవి అవే"—

ఎన్ని సౌకర్యాలున్నా ఎంత ఆనంద మున్నా పొందికైన దత్తు కుటుంబం మీద మృత్యుచ్ఛాయలు చాలా తొందరగా కమ్ముకో నారంభించాయి. అబ్జూ చనిపోయిన తర్వాత గోవిన్‌చందర్, మిగతా పిల్లల్ని పోగొట్టుకుంటానేమో అన్న భయంతోనే బ్రతుకుతుండేవాడు. వాళ్లు తన్ను విడిచి ఎక్కడికైనా పోవడాన్ని భరించలేకపోయేవాడు. ప్రతి నిముషమూ వాళ్ళతో కలిసి గడపడానికే తహతహ లాడేవాడు.

14 సంవత్సరాల వయస్సులో అబ్జూ చనిపోయాక అతనిమీద గోవిన్ ఒక గీతం వ్రాశాడు. D. F. A. అచ్చవుతున్న కాలంలో ఇంగ్లండ్‌లోఉన్న రమేష్‌చందర్‌కు ఈ గీతాన్ని గోవిన్ పదేపదే వినిపిస్తుండేవాడు. భగ్న హృదయుడైన ఆయన ఆక్రోశించిన భావం ఇది.

"గడిచే రోజుల్ని బరువుగా
గుణించుకుంటూ
అలసిన మనస్సుతో
ఒంటరిగా గుండెలు పగిలి
మిగిలిపోయాను!"

కాని పెద్ద పిల్లవాడు పోయినప్పుడు కూడా ఆయనకు భగవంతుడి మీది నమ్మకం సడలలేదు. అసలా నమ్మకమే ఆ దంపతులిద్దరికీ అన్ని కష్టాలలోనూ, పెద్దపిల్లవాడు పోయినప్పుడు కూడా ధైర్యాన్ని కలిగించింది.

ప్రేమకు చావు లేదు
అక్కడ ఎడబాటు ఎప్పుడూ లేదు
సమయ మాసన్న మైతే,
చింతించే వారందరూ
చిరునవ్వులు చిందించక తప్పదు
విస్మయాపాదకమైన
విశ్వవిభుని పీఠం ముందు
నా ప్రాణానికి ప్రాణమైన
బిడ్డతోపాటు నిలుచుని ఉంటాను.
అతణ్ణి స్తుతిస్తూ ప్రార్థిస్తూ
అంతమే లేని అఖండ మంత్రాన్ని జపిస్తూ
చెర విడిపించుకునే
శుల్కాన్ని సిద్ధం చేసుకుని
నా బిడ్డతో పాటు
నిలుచుని ఉంటాను నేను!

ఇదే విశ్వాసం తోరూను కూడా అనేక దుఃఖాలనుండి ఉద్ధరించి బ్రతికించింది. ఈ భూమిమీద నీరసంగా వెళ్ళబుచ్చిన రోజులకంటే భిన్నంగా నిత్యసంతుష్టమూ శాశ్వతమూ అయిన జీవితం ఉందనే నమ్మకం ఆవిడకుండేది. అటువంటి నమ్మకంతోనే ఆవిడ రచనలన్నీ తడిసి బరువెక్కి ఉండేవి.

గోవిన్ స్వయంగా తన ముగ్గురు పిల్లల్ని గురించీ చాలా అద్భుతమైన వర్ణన చేసుకున్నాడు.

అందరికీ 'జన ముద్దు' బిడ్డ
నా పెద్ద కొడుకు
అవడానికి పెద్దవాడే కానీ
అంతర్యంలో ఎంతో పసివాడు

అతిశయోక్తి దూషితం కాని
అచ్ఛమైన పలుకు సుమా యిది :
వాడి వయస్సు కోవలో
అంత ఎత్తు ఎదిగిన వాడు లేడు
అంత నిర్మలినాత్ముడు లేడు!
ఇంటికి నిండైన దీపం
నా రెండో బిడ్డ
గుండె నిండా బెరుకూ భయమూ :
ఉన్నపళాన ఎవ్వరినీ పూసుకుని తిరగడు
అన్నకంటే ఎన్నో రెట్లు ఆవేశం తక్కువైన పిల్ల!
తటాలున ఎర్రబారే బుగ్గలూ
నిటారుగా దిద్ది తీర్చిన కనుబొమ్మలూ
ఆ బిడ్డ తీరే నిర్మలమూ గంభీరమూ!
సాయం సంధ్యలో వెలిగే
నక్షత్ర కాంతిధారలాగా
శాంతమూ సుందరమూ :
చిట్ట చివరి బాల
చిక్కుపడిన ఉంగరాల జుట్టుతో
అర్భకంగా అచ్చరకూనలా
అందాలు చిమ్మే పాప!
పట్టిన పట్టు చెల్లించుకోగల
పసిడి నిగ్గుల సిగ్గుల బరిణె
నేను పిలుస్తున్నా
పెడచెవిన పెట్టి
పిల్లితోనూ పిట్టతోనూ
అల్లీ బిల్లీ కబుర్లు చెప్పే
అతి తెలివైన

అనుంగు బిడ్డ!
నా కోసమే
నిర్ణయమైన
నా కుటుంబం ఇదీ!"—

1869 చలికాలంలో యూరప్ వెళ్ళబోయేముందు తోరూ కుటుంబం కలకత్తాలోనే కొంతకాలం గడిపింది. అప్పుడు వాళ్ళు రామ్‌బాగన్‌లోనూ, బాగ్‌మరీలోనూ ఉంటుండేవాళ్ళు. తోరూకు ముఖ్యంగా తోటలో ఉన్న ఇల్లంటేనే చాలా యిష్టం. ఆవిడ రచన లన్నిటిలోనూ ఆ యింటి ప్రసక్తి ఉంటుండేది. అక్కడ హుందాగా, ఎత్తుగా పెరిగిన చెట్లంటే ఆవిడ కెంతో మక్కువ.

ఏమి అద్భుతమైన చెట్లు!
మసక మసుగుల్లో మెసిలే
సాల వృక్షాల చిట్టి చివళ్ళు
వాటిని హత్తుకుని ఆనందిస్తూ
విశ్రాంతి కోరే చూపుల తీరులు!

ఏపుగా స్తంభాల్లా ఎదిగిన
పోక మాకుల పోకిరి పోకిళ్ళు
వాటి చివళ్ళ కదలాడే
చిరుకొమ్మల కలికి తురాయి

చిన్న చిన్న ఆకులతో
చిక్కగా పరుచుకున్న చింతచెట్లు
సన్నగా
తిక్త గంధాన్ని వెదజల్లే
అన్నువైన వేప చెట్లు!
కెంపుల్లాంటి పువ్వుల్ని
వింపుకుని

పెళ్ళికూతుళ్ళ వేషాల్లో
కళ్ళు చెదిరేట్లు నిలిచే
కలికి తురాయి చెట్లు!

అత్తి చెట్లు అమర్చిన
ఒత్తైన నీడల గుడారాల కింద
అక్కడక్కడా ఒత్తిగిల్లిన
ఆకుల మాటుల్ని చీలిస్తూ
అతి మనోహరమై వెలిగే
అస్తమిత సూర్య సౌందర్యం!
అనంతసేనా వైభవం
అలవోకగా విశ్రమించే
ఇక్క అక్కడే!

ఒయ్యారంగా ఊగిసలాడే
వెదురుగడల నీడల్లో
పిల్ల తెమ్మెర లాలసినట్లుగా
పికిలి పిట్టల చప్పుళ్ళు

ఒత్తుగా నల్లగా పెరిగి
వలయాలై అందగించే
మామిడి తోపుల ఇళ్ళల్లో
కాకులు గుమిగూడి చేసే
కడలేవి సందళ్ళ సంరంభం

చంపకాలూ పొగడపూలూ
ఇంపు గూర్చే దేవదార్లూ
హారనాయక మణుల్లాగా
చేరి మెరిసే నాగసరుల్లూ

అన్నిటినీ అందుకుంటూ
అల్లిబిల్లిగ పైకి సాగే
అడవి ద్రాక్షల తీగె గుంపూ
గ్రామ్య వనితల భూషణాలై
ఆర్య కవితను వాసి కెక్కిన
శిరీష కుసుమాల సందడి!

బ్రహ్మరాక్షసుల్లా
బలమైన అశ్వత్థ వృక్షాలు
చిక్కులుపడి జడలు కట్టిన
గచ్చతీగెల అల్లిక పొదలు

ఇన్నీ ఇవన్నీ
ఇంకా ఎన్నో వేలకొద్దీ
ఎర్రని శిరః కవచమో
బంగారపు తురాయి కుచ్చో
ముచ్చటగా అలంకరించుకుని
నల్లబారే సాయంకాలపు
నీడల జాడల్లోపల
హుందాగా నిలుచు నుంటాయి—

ఈ దేశంలో అందమైన చెట్లను చూచి ప్రేమించే ఎవరో కొద్దిమంది మాత్రమే ఇంత సిసలైన వర్ణన చెయ్యగలరు. "మా కాజురీనా చెట్టు" అని తోరూ వ్రాసిన కవిత ఆవిడకు చెట్లతోఉన్న గుప్తానుబంధాన్ని వెల్లడి చేస్తుంది.

తోరూ వ్రాసిన ఉత్తమ కవితల్లో "బాగ్‌మరి" ఒకటి. ఆ పిల్లలు ముగ్గురూ, తమ బంధువర్గంతోనూ స్నేహబృందంతోనూ ఆ విశాల మైదానాల్లో ఆడుకోవడం ఎవరైనా ఊహించవచ్చు.

మా తోటను మేఖలలా చుడుతూ
పచ్చని ఆకుల సముద్రం!

మాంద్యం మాపే తెలివి
పలురకాల పచ్చదనాల
కడలేని కడలి!

రకరకానికీ మధ్య
రంగుల్లో కనిపించే
చిక్కని భేదాలు
ఇక్కడే సాధ్యం!

హుందాగా లేత పచ్చగా మెరిసే
చిగుళ్ళు కమ్మిన చింతచెట్లు!
వాటిమధ్య ఆకుపచ్చగా మెరిసే
ఆమ్ర వృక్షాలు గుంపులు గుంపులు!

మధ్య మధ్యగా
మసక రంగుతో
విటారుగా నిలిచి నవ్వే
తాటి వృక్షాల
తీరైన వరసలు!

స్తబ్ధంగా విశ్రమిస్తున్న
సరోవర శరీరం మీద
సరదాగా వాలిపోతున్న
పొగనైన తురాయి చెట్లు!

భయావేగం కలిగించే
జాకీ చప్పుళ్ళ ఆర్భాటంలా
అదురుపాటు కలిగిస్తూనే
అంతటా విరిసే అరుణ వర్ణం!

తూర్పు దిక్కుగా
తిరి నిలుచున్న
వెదురు కర్రల సౌందర్యాన్ని
ఎదిరించే దేదీ లేదు

సందుల్లో నుంచి చంద్రుడు
తొంగి తొంగి చూస్తూనే
తెల్లని కలువల్ని మొత్తం
వెండి గిన్నెలుగా మార్చిన వేళ

ఆ అందాన్ని తలదన్నేది
అసలేదీ లేనే లేదు.

సృష్ట్యాదికి చెందిన
ఈడెన్ తోటను చూస్తున్నట్లు
ఆ అందాన్ని చూచి చూచి
ఆ అందాన్నే అనుభవించి
ఎవరైనా
పరవశించి పోవలసిందే!

ఇటువంటి బాగ్‌మరీ తోటలో ఇల్లు తోరూ బ్రతికున్నప్పుడూ, తర్వాతా కూడా చాలామందిని ఆకర్షించింది. ఎంతోమంది విదేశీయులు కూడా దాన్ని చూడాలని కుతూహలపడేవాళ్ళు. మిస్ ఎలిజబెత్ కాటన్ అనే ఆవిడ తోరూ అభిమానుల్లో ఒకతె. తోరూ చనిపోయిన 30 ఏళ్ళ తర్వాత 1907 డిసెంబర్ నెలలో, ఆవిడ కలకత్తాకు వచ్చి హరిదాస్‌గారికి ఈ విధంగా ఉత్తరం వ్రాసింది.

"అయ్యా! కలకత్తా నగరాన్ని ప్రతిభావంతురాలైన తోరూ స్మృతి చిహ్నంగా ఎన్నో ఏండ్లనుండీ నేను భావిస్తూవచ్చాను. సంఖ్యలో తక్కువైనా, విలువైన జ్ఞానఫలాల్ని పంచిపెడుతూ, ఆవిడ నివసించిన ఇంటిని, ఏమాత్రం వీలుగా ఉన్నా నాకు చూడాలని ఉంది. మిస్టర్ ఎడ్మండ్ గాస్

చెప్పినట్లుగా, సంస్కృత సాహిత్యానికి సంబంధించిన అవిది తాంతర్యాలను తోరూ అవగతం చేసుకున్న చోటు, ఆ తోటను కూడా చూడాలనిఉంది నాకు.''

తాను పుట్టినచోట చాలా ఆదర్శవంతంగా అనిపించిన తోరూ బాల్యం విదేశాలలో పరిపక్వమైందిగా గోచరించింది. గోవిన్‌చందర్ తన పిల్లలకు విదేశయాత్రా, చదువూ అందజేయాలనే దృఢసంకల్పంతో ఉండేవాడు. అందువల్లనే తోరూ ఆవిడ చెల్లెలూ నల్లవాళ్ళదేశాన్ని ఆవరించుకొని ఉన్న సముద్రాన్ని దాటగలిగారు. ఆ పనిచేసిన మొదటి బంగాళీ బాలికలు వీళ్ళే. తోరూను గురించి, స్నేహితురాలు మిసెస్ బార్డన్ ఈ విధంగా వ్రాసింది.

''ఆవిడ తలిదండ్రులు చురుకైన తమ బిడ్డలిద్దరికీ సాధ్యమైనంత ఉన్నతవిద్యను అందజేయడానికి పూనుకున్నారు. మేము ఆ సంవత్సరం (1869) చలికాలంలో స్వదేశానికి తిరిగి వెళ్తుండడంవల్ల, వాళ్ళకు మాతో తమ పిల్లల్ని పంపించడానికి వీలుకలిగింది. మా ఆయన సలహాప్రకారం, తల్లీ తండ్రీ ఇద్దరూ మాతో 'నైస్' దాకా వచ్చారు. అక్కడ మా తలిదండ్రు లుండేవాళ్ళు. వాళ్ళు మూడు నాలుగు నెలలు అక్కడే గడిపినట్లు నాకు జ్ఞాపకం. 'నైస్'లో నివసించే కొంతమందికి మేము వాళ్ళను పరిచయం చేశాము. అక్కడే చాలా తొందరగా పిల్లలిద్దరూ ఫ్రెంచ్ నేర్చుకోగలిగారు.''

తోరూకూ, అరూకూ, ఫ్రాన్స్ అంటే చెప్పలేనంత అభిమానం. భారత దేశం తర్వాత వాళ్ళను బాగా ఉత్తేజితుల్ని చేసింది ఫ్రాన్స్ దేశమే. ఫ్రెంచ్ వాళ్ళుకూడా తోరూను ఫ్రాన్స్‌దేశపు మహిళగానే పరిగణించేవారు. 13 ఏళ్ల పసివయస్సులో ఫ్రెంచ్ గడ్డపై కాలుమోపిన తోరూ, ఆ దేశపు భాషను చాలా తొందరగానూ, ఎంతో సులువుగానూ, నేర్చుకోగలిగింది. తాను జీవించినంతకాలమూ ఫ్రెంచ్‌దేశపు కాల్పనిక సాహిత్య మధువును తనివి తీరా సేవించి జీర్ణించుకోగలిగింది. ఆవిడకు ఫ్రాన్స్‌దేశమంటే చెప్పలేనంత ప్రేమ. ఆ దేశం ఆవిడ ప్రాణం.

# 5. ఫ్రాన్స్ దేశం

గోవిన్‌చందర్, ఆయన కుటుంబం మొదట మార్సేల్స్‌లో దిగి అక్కడ నుండి 'నైస్' చేరుకున్నారు. అక్కడే 1870 లో వసంతం వచ్చేదాకా ఉన్నారు. తోరూ అరూ లిద్దరూ అక్కడ స్కూల్లో చేరి ఫ్రెంచ్ చదువుకుని అందులో మంచి ప్రవేశం సంపాదించుకున్నారు. వాళ్లు వెళ్లింది ఇదొకచోటే బడి. ఇదయినా కొన్నాళ్ళతర్వాత మానేశారు. తర్వాత గోవిన్ ఏర్పాటు చేసిన మేడమ్ ష్వేయర్ అనే ఉపాధ్యాయిని ఇంటిదగ్గరే వాళ్ళకు ఫ్రెంచ్ భాష నేర్పేది. వాళ్ళిద్దరూ ఫ్రెంచ్ సాహిత్యపు లోతుల్ని కనుక్కోడానికి పూనుకున్న సమయం నిజంగా అదే. అందుకు తోడు ఫ్రెంచ్ విప్లవం కూడా తోరూను కదిలించివేసింది. ఆనాటి సాహిత్యంలో ఎక్కడ చూచినా స్వాతంత్ర్య కాంక్ష ముమ్మరంగా కనిపించేది. జార్జ్ శాండ్స్ నవలల్లో వ్యక్తమైన స్త్రీ స్వాతంత్ర్య ప్రయత్నంలాంటిది భారత మహిళలకు కూడా అవశ్యం కావలసిన ప్రయత్నమే. తోరూకు ఫ్రాన్స్ అంటే అభిమానం మరీ పెరిగిపోసాగింది. ఆవిడ తానొక ఫ్రెంచ్ బాలిక కావాలని కోరుకుంటుండేది. తన డైరీల్లో "ఎవరూ మార్చలేని, అధికారం చలాయించలేని, స్థిరసంకల్పం కల ఫ్రెంచ్ మహిళను నేను!" అని తనను గురించి వ్రాసుకుంది.

నైస్‌లో వాళ్ళు హెలెవిటి హోటల్లో ఉండేవాళ్ళు. అక్కడున్నప్పుడు తోరూ కలకత్తాలో ఉన్న తన బంధువు అరున్ చందర్‌దత్తుకు ఉత్తరాలు వ్రాస్తుండేది. "మేం భోంచేస్తుండగా నీ ఉత్తరం వచ్చింది. ఇద్దరు వాద్యగాళ్ళు ఫిడేలూ, హార్ప్, వాయిస్తున్నారు. అట్లా మోగించడంవల్ల తినే అన్నం బాగా సయిస్తుందట. అది ఫ్రెంచ్ పద్ధతి. ఇక్కడ జరిగే సంత చూడడానికి ఓరోజున వెళ్ళాము. జనమంతా రంగురంగుల ముఖాచ్ఛాదనాలుతగిలించుకునీ, ఒళ్ళంతా రంగు పూసుకునీ ఒకరిమీదికొకరు 'బాన్‌బాన్'లువిసురుకుంటూ ఆనందంతో కొట్టికోలాహలంగా ఉన్నారు. 'లెంట్' సమయానికి ముందు అందరూ

ఇట్లా సంతోషంగా ఉంటారట. లెంట్ సమయంలో వాళ్లు కాథలిక్కులు కాబట్టి చాలా పెద్దమనిషి తరహాగా, కట్టడిగా ఉండాల్సిన అవసరం వాళ్ళకుంది. అందువల్ల సరదా అంతా దానికి ముందే తీర్చుకుంటారు.''

ఒకరోజున గోవిన్ కుటుంబం సంతకు బయలుదేరింది. బురదగా నానా కంగాళీగా ఉన్న రోడ్లవెంబడి నడిచి వాళ్ళ గుడ్డలన్నీ బురద కొట్టుకు పోయాయి. అప్పుడు అందరూ ఒక బండి మాట్లాడుకున్నారు. ఆ బండి అంత వీలుగా లేకపోయినా, కలకత్తాలో ఇంతకంటే శిథిలావస్థలో ఉండే బళ్ళను ఎక్కే అలవాటునుబట్టి వాళ్ళకేమీ అసౌకర్యంగా లేదు. తల్లీ తండ్రీ బండిలోనే ఉండిపోగా, ఆడపిల్లలు మిస్టర్ ఇలియట్ అనే ఆయనతో బయటికి బయలుదేరారు. ఆయన శ్రీమతి బార్టన్‌కు తమ్ముడు. పంజాబ్ I.C.S. లో మెంబరు కూడానూ. సంతనంతటినీ సమగ్రంగా చూడడానికి పిల్లలు ఒక డాబామీదికి వెళ్లి అక్కడ కుర్చీలమీద నిలబడవలసి వచ్చింది.

ఫ్రాన్స్‌లో గోవిన్ కుటుంబానికున్న స్నేహితుల్లో ఒక డాక్టరుగారి భార్య కూడా ఉంది. ఆవిడకు ఈ పిల్లలంటే ఎంతో ఇష్టం. పిల్లలిద్దర్నీ ఫ్రెంచ్‌లోనే మాట్లాడాలని ఆవిడ కట్టడి చేస్తుండేది. అట్లా మాట్లాడినందు వల్లనే భాష బాగా వస్తుందనీ, అలవాటవుతుందనీ ఆవిడ అభిప్రాయం. వాళ్లు మాట్లాడేటప్పుడు ఎన్ని తప్పులు తడకలు దొర్లినా ఆవిడ, 'అద్భుతం!' అని ప్రశంసలు కురిపిస్తుండేది!

ఆ రోజుల్లో ఇంగ్లండుకంటే ఫ్రాన్స్ దేశానికి పేరుప్రతిష్ఠ లెక్కువగా ఉండేవి. తోరూ ఫ్రెంచ్ జీవితాన్ని క్షుణ్ణంగా చదివింది. చాలా సాంప్రదాయికమైన పద్ధతిలో పెరిగిన ఫ్రెంచ్ బాలికలు, బెంగాల్లోని అధునాతన రీతిలో పెరిగిన హిందూ బాలికలకంటే మెరుగ్గా ఉండడం తోరూను బాగా అలరించింది. అందుకే తోరూ తాను రచించిన ఒక నవలలో ఫ్రెంచ్‌బాలిక జీవితాన్ని చిత్రించడానికి పూనుకున్నది. ఆ పాత్ర పేరు మార్గరెట్. నైస్‌లో తనకు పరిచయమున్న ఫ్రెంచ్ బాలికల చిత్రణ ఆ పాత్రలో కనిపిస్తుంది. అయినా ఆ కథానాయకురాలు 'తోరూ' కూడా కావచ్చు. అందులో కథ ఫ్రెంచ్‌వాళ్ళకు సంబంధించిందే. కథానాయిక ఇల్లు ఇంగ్లండులో ఉంటుంది. కాని ఆవిడ మాత్రం తనకు ఫ్రాన్స్‌లో ఉంటేనే బాగుంటుందనీ, ఫ్రెంచ్ జీవితమే తన కిష్టమనీ చెప్తుంటుంది.

జేమ్స్ డ్రామేస్టర్, తోరూకు ఫ్రెంచ్ సాహిత్యంతో ఉన్న సన్నిహిత పరిచయానికి బాగా ముగ్ధుడయ్యాడు. "ఫ్రెంచ్ దేశంలో తోరూ నివాసం, ఆవిడ ఆలోచనల్నీ కల్పితోహాల్నీ ఎంతగానో ప్రభావితం చేసింది. అందుకే ఆవిడ అక్కడ నివసించిన వివరాలను ఎవరైనా క్షుణ్ణంగా తెలుసుకోవాలను కుంటారు. ఫ్రాన్స్ ఆవిడ మెచ్చిన దేశమూ, ఫ్రెంచ్ ఆవిడకు నచ్చిన భాషా కాగలిగాయి'' అని ఆయన వ్రాశారు.

నైస్‌లో దత్తు కుటుంబం 'ప్రోమెనేడ్ డెస్ యాంగ్లాయిస్'లో నివ సించింది. అక్కడ కనిపించే చిత్రవర్ణ శబలితమైన మెడిటరేనియన్ దృశ్యం వాళ్ళకు చాలా యిష్టం. అక్కడి రంగురంగుల పువ్వులూ, బోగన్‌విల్లాలూ, కొత్తగా రంగు పులుముకుని ఎర్రటి పెంకుల్తో అందంగా కనిపించే రక రకాల ఇంటి కప్పులూ, పర్వతసాను ప్రదేశాలలో చిక్కగా కమ్ముకుంటున్న ద్రాక్ష తీగెల చిక్కులూ, పండ్ల తోటలూ, నీలి సముద్రమూ వీటి నన్నిటినీ చూచి ఆడపిల్లల్లో ఉన్న కవితాత్మ పరవశించేది. కాన్స్‌నుండి మొనాకోకు వాళ్ళు చేసిన ప్రయాణం వాళ్ళను తన్మయత్వంలో ముంచింది. దానివల్ల ఫ్రెంచ్ జీవనమాధుర్యాన్నీ సంస్కృతీ మధువునూ వాళ్ళు తనివి తీరా క్రోలడం సంభవించింది.

దక్షిణ ఫ్రాన్స్‌కు చెందిన ఇంత చల్లని మనోహరమైన వాతావరణం అరూకు పడలేదు. ఆవిడ తోరూకన్నా సుకుమారమైన బాలిక. అందువల్ల అప్పుడప్పుడూ పడక వేస్తుండేది. అందువల్లనే దత్తు కుటుంబం అక్కడనుండి బయలుదేరక తప్పలేదు. అయినా ఫ్రాన్స్‌లో వాళ్లు గడిపిన ఆ కొద్దిమాసాలూ ఆడపిల్లల జీవితం మీద చెరగని ముద్ర వేయగలిగాయి.

గోవిన్‌చందర్ పారిస్‌మీదుగా ఇంగ్లాండుకు తన కుటుంబాన్ని తర లించాలనుకున్నాడు. ఇక్కడకంటే చలీ తేమా ఎక్కువగా ఉండే ఆ ప్రదే శంలో, అరు ఆరోగ్యం బాగుపడుతుందని ఆయన ఎట్లా అనుకున్నాడో అదే చిత్రం! 1870 వసంతంలో తమ చిరకాల స్నేహితురాలు శ్రీమతి బార్డన్‌తో కలిసి వాళ్ళు ఇంగ్లండ్ ప్రయాణం సాగించారు.

తోరూను గురించీ అరూను గురించీ శ్రీమతి బార్డన్ ఇట్లా వ్రాసింది. "వాళ్ళకు కళలను గురించీ చరిత్రను గురించీ బాగా తెలుసు. ఆ జ్ఞానాన్ని వాళ్ళకు ప్రసాదించింది వాళ్ళ నాన్నగారే. ఒకసారి వాళ్లను నైస్‌లో కానన్

షెల్డర్ హౌసుకు తీసుకువెళ్ళాము. అక్కడో బల్లమీద చచ్చిపోతున్న మల్లుడి విగ్రహం కంచుతో చేసింది ఉంది. బార్డనో, తోరూ నాన్నగారో, దాన్ని చూపించి ఇదేమిటో చెప్పండి చూద్దాం! అని అడిగారు. ఇద్దరూ, ఒక్కక్షణం కూడా తటపటాయించకుండా వెంటనే చెప్పేశారు. వాళ్ళకదేమిటో తెలీడానికి వాళ్ళు రోమ్ చూడలేదుగదా! మాకు చాలా ఆశ్చర్యం కలిగింది. కేవలం పుస్తకాలు చదివి అదేమిటో తెలుసుకోగలిగారన్నమాట వాళ్ళు!

గోవిన్‌చందర్‌ను పారిస్ నగరం బాగా ఆకర్షించింది. ప్రపంచానికి రాజధాని అనిపించుకోగల పారిస్‌లో ఉండడానికి ఆయన నిశ్చయించాడు. అందంలో, అమరికలో, వాతావరణంలో, పరిశుభ్రతలో, ఎందులో చూచినా అన్ని నగరాలకంటే గొప్పది పారిస్ నగరం. కాని వాళ్ళక్కడ ఎక్కువ కాలం ఉండలేదు. "చాలా రోజుల తర్వాత వాళ్లు ఇంగ్లండుకు బయలు దేరారని హరిహరదాస్ వ్రాసినా వాళ్లు మొత్తంమీద ఫ్రాన్సుదేశంలో ఉన్నది నాలుగు నెలలే. అందులో ఎక్కువకాలం నైస్‌లోనే గడిపారు.

చివరకు వాళ్ళ ప్రయాణం బోలోన్ మీదుగా ఇంగ్లండుకు సాగింది. 1874 ఫిబ్రవరిలో బెంగాల్ పత్రికలో ఇంగ్లీషు కాలవ దాటడం మీద ఒక వ్యాసం ప్రచురింపబడ్డది. గోవిన్‌చందర్ ఇండియానుండి మార్సేల్స్‌దాకా చేసిన ప్రయాణాన్ని పై ప్రయాణంతో పోల్చి చూచాడు. పి అండ్ ఒ వాళ్లు ఏర్పాటుచేసిన మొదటి ప్రయాణంలో నిర్వాహకులు, తన్ను, ఒక మొగలాయీ చక్రవర్తినో, ఈజిప్టు వైస్రాయినో చూచినంత ఘనంగా చూచారు. రెండో ప్రయాణం మొదటిదాన్తో పోల్చుకుంటే చిరాకు పుట్టించేదిగా అనిపించింది. బోలన్ ను గురించి థాకరే వ్రాయడం చేత అది బాగుంటుందని భ్రమించి గోవిన్ అక్కడ ఆగడం జరిగింది. కాని వాళ్ళకెవ్వరికీ బోలన్ నచ్చలేదు. నిజానికది చాలా చిన్న రేవు. పరమ ఛండాలంగా కనిపించేది. అక్కడ కేవలం నావికుల కోసం నిర్మితాలయిన యిళ్లుమాత్రమే ఉన్నాయి. అక్కడ వాతావరణం వెచ్చగా నిర్మలంగా ఉన్నా వాళ్ళకు ఆ ఊళ్ళో ఆగి కాలం వ్యర్థం చెయ్యడం ఇష్టం లేదు. అందుకే వెంటనే బయలుదేర నిశ్చయించు కున్నారు. ఫోక్‌స్టోన్ దగ్గరగూడా ఆగలేదు. అక్కడ రైలెక్కి లండన్ ప్రయాణాన్ని కొనసాగించారు.

దత్తు కుటుంబం ఫ్రాన్స్‌లో కొన్ని నెలలు మాత్రమే ఉన్నా తోరూను ఫ్రాన్సు అమితంగా ఆకర్షించింది. అది కేవలం ఆదేశం అందమైందనిగానీ,

ఆ భాషమీద ఆకర్షణవల్ల గానీ కాదు. "తోరూ మా దేశాన్ని అమితంగా ప్రేమించడమేకాక ఫ్రాన్స్ కష్టదశలో ఉన్నప్పుడు ఆ ప్రేమను కురిపించింది" అని "మిలె క్లారిసా బాదర్" వ్రాసింది. తోరూ ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధ సందర్భంలో ఫ్రాన్ నభిమానించి సానుభూతి చూపించింది. ఆ రోజుల్లో తోరూకు పదునాలుగేళ్లే. అయినా ఫ్రాన్స్‌దేశపు రాజకీయాల పట్ల ఆమెకు విపరీతమైన శ్రద్ధా సక్తు లుండేవి. బిస్మార్క్ రాజనీతిపట్ల వైముఖ్యం ఉండేది. బిస్మార్క్ పేరెత్తి తిట్టకపోయినా, ఫ్రాన్స్ దేశపు భవిష్యత్తును గురించి ఎంతో బాధపడుతుండేది.

యుద్ధం ప్రారంభమైనప్పుడు తోరూ, "నా మనస్సంతా ఫ్రాన్స్ మీదే ఉంది" అని వ్రాసుకుంది. ఫ్రెంచ్ చరిత్ర అంటే ఆవిడకు ఇష్టం. ఫ్రాన్స్ శాసన సభలో 1851 లో విక్టర్ హ్యూగో ఇచ్చిన ఉపన్యాసాన్ని తోరూ అనువదించింది. దాన్ని "సమకాలిక చరిత్రలో ఒక రంగం" అనే పేరుతో బెంగాల్ మేగజైన్ ప్రచురించింది. రాజ్యాంగంలో కొన్ని మార్పులు కావాలని కొందరు పట్టుపట్టగా, విక్టర్ హ్యూగో దాన్ని వ్యతిరేకించారు. అట్లా మార్పులు చేస్తే, అవి లూయీ నెపోలియన్‌ను ఫ్రాన్స్ దేశానికి రాజుగా పట్టం కడతాయని ఆయన భయం. హ్యూగో గాఢమైన ప్రజాస్వామ్యవాది. ప్రభుత్వం ఒక చక్రవర్తి హస్తగతం కావడం ఆయన కిష్టంలేదు. తోరూ ఆయన అభిప్రాయాల్ని నిశ్చయంగా బలపరిచింది. ఇదేకాక, మిష్టర్ థియర్ ఉపన్యాసాన్ని అనువదించి, తోరూ దాన్నికూడా బెంగాల్ మేగజైన్‌లో ప్రచురించింది. 1870 లో ఫ్రాన్స్ ప్రష్యామీద యుద్ధ ప్రకటన చేసే తీర్మానాన్ని మిష్టర్ థియర్ నిరసించాడు.

ఒక చిన్న బాలిక విదేశీ రాజకీయాలలో ఇంత శ్రద్ధా భావాన్ని కనపరచడం చూస్తే తోరూ ఎంతగా తన్నుతాను ఫ్రెంచ్ బాలికగా మలుచుకున్నదో తెలిసి వస్తుంది.

1871 జనవరి పత్రికలో తనకు ఫ్రెంచ్ దేశమంటే ఎంత ప్రేమ ఉన్నదో వెల్లడించింది తోరూ. ఆ భావం ఒక ఫ్రెంచ్ దేశభక్తుడి భావనకు తీసిపోదు. "మేము పారిస్‌లో ఉన్నది కొద్దిరోజులే అయినా, అది ఎంత అందమైన ప్రదేశం! అవేం వీధులు! అదెంత గొప్ప సేన! కాని అది ఎంతగా పతనమైపోయిం దిప్పుడు! నగరా లన్నిటిలోకీ అది తలమానిక

మైందే అయినా, ఈ క్షణాన దాన్నిండా ఎంత దుఃఖం!''—ఫ్రాన్స్ ఆ రకంగా పతనం చెందడానికి దానికి గల నాస్తికతే కారణమనీ, దేవుడందుకే దాన్ని శపించాడనీ తలపోసింది తోరూ. "ఓ ఫ్రాన్స్! ఎంత పతనం చెందావు నువ్వు. ఇంత అవమానం భరించిన తర్వాతయినా నువ్వు భగవంతుణ్ణి పూజించు, సేవించు! నీ కోసం నా గుండె ఎట్లా ముక్కలవుతోందో!'' అని వాపోయింది.

తోరూకు ఫ్రాన్సుమీదున్న అభిమానాన్ని ఆవిడ వ్రాసిన మరో పద్యం చక్కగా విదితం చేస్తుంది. పదిహేనేళ్ళ ప్రాయమప్పుడు వ్రాసిన. ఆపద్యం చూస్తే ఆవిడ మనస్సు ఎంత పరిపక్వ దశను అందుకుందో స్పష్టంగా తెలుస్తుంది.

## ఫ్రాన్స్ - 1870

కాదు కానే కాదు
ఈ దేశం చావదు
అమితమైన రక్తస్రావం జరిగి
అది మూర్ఛ మాత్రమే!

హుందా తనం లేని ఇంగ్లండు
పక్కనుంచే పారిపోయింది
రక్షించు రక్షించు వీరుడా
పక్కన ఎవ్వరూ లేరు.

ఈ రక్త ప్రవాహాన్ని
అరికట్టే దెవరు?

గోధుమ రంగు జుట్టును
చక్కగా సవరించండి
ఒక్కటే కళ్ళల్లో పడి
కనపడటం కష్టంగా ఉంది!

ముఖంమీద చన్నీళ్ళు
ముమ్మరంగా చల్లండి
రక్తంలో మునిగి తేలుతూ
చేష్టలు తక్కి పడి ఉంది.

దయచేసి చాలినంత మద్యం
తాగడానికి తెచ్చి పెట్టండి.

ఎవ్వరూ వినరేమర్రా
ఈ మాత్రం చెయ్యడానికి
ఎవ్వరూ ముందుకు
రా రెందుకు !

మనుష్య సందోహానికి
మహానేతవు నువ్వు.
మూర్ఛలో పూర్తిగా మునిగి
ఎన్నాళ్ళిట్లా పడి ఉండడం !

ఆలోచనా స్వేచ్ఛా సత్యం
అపశకునాల్ని దాటే దెప్పుడు ?
చీకటి మాటున మణిగిన ఆశ
మా కోసం తలఎత్తే దెప్పుడు ?

అదుగో ఆవిడ కదులుతోంది
విరిగిపోయిన ఖడ్గ రాజమా !
ఆవిడ చూపుల్లో
అగ్ని కదలాడుతోంది.

ఒక్కగంటలో ముప్పు ముంచుకురాగా
విజయగర్వంతో విర్రవీగే

ఆ త్తిలాకు చెందిన అల్లరి మూకల్లారా !
ఎంత సాహసం !

ఆవిడ చుట్టూ చేరి
కేకిసలు కొట్టి
తాటాకులు కట్టడానికి
ఎంత సాహసం మీకు !

ఆవిడ నిలుచుంటున్నది
కలహానికి తిరిగి కాలు దువ్వుతూ
బలాన్ని మరింతగా పుంజుకుని
నిబ్బరంగా నిలుచుంటున్నది !

ఆమె నొసట మెరిసే
నక్షత్ర కాంతి
విశ్వా న్నంతటినీ
వెలిగించగలదు !

అన్ని జాతుల జనుల్లారా !
అవశ్యం తలలొగ్గండి మీరు !
తాను నడిచే దారిలో
తిరిగే ఆవిణ్ణి
నాయకత్వాన్ని పొందనివ్వండి !"

# 6. ఇంగ్లండు దేశం

దత్తు కుటుంబం మొదట లండన్లో చారింగ్ క్రాస్ హోటల్లో బస చేసింది. తర్వాత I. C. S. పరీక్షలకు కట్టడానికి అక్కడ చదువుతున్న వాళ్ళ బంధువు రమేశ్‌చందర్‌దత్, వాళ్ళ కోసం గ్రాస్‌వెనర్ హోటల్లో గదులు మాట్లాడిపెట్టాడు. తర్వాత వాళ్ళు బ్రాంమ్‌డన్‌లో అన్నిసదుపా

లున్న ఒక యింటికి మారారు. సిడ్నీప్లేస్, ఆన్‌స్లో స్క్వేర్‌లో ఆ యిల్లు తొమ్మిదో నెంబరు ఇల్లు. అక్కడుండ గానే ఆడపిల్ల లిద్దరూ, ఫ్రెంచ్ కవితను ఇంగ్లీషులోకి అనువదించడానికి పూనుకున్నారు. రమేశ్ ఒకసారి ఇలా వ్రాశాడు: "నేను వాళ్ళను చూడడానికి ఎప్పుడూ వెళ్తుండే వాడిని. గంటల తరబడీ కాలం, తోరూ అరూలతో ఆనందంగా గడిచిపోయేది. గోవిన్‌చందర్ ఆయన కుటుంబం ఎప్పుడూ మత చరిత్రనూ, సాహిత్యాన్నీ అవలోకనం చేస్తుండే వాళ్ళు. వాళ్ళు చాలామంది క్రైస్తవులతో పరిచయం పెంపొందించుకున్నారు. D. F. A. ప్రచురించబడ్డాక గోవిన్ నాకూ ఒక పుస్తకాన్ని బహూకరించాడు. అందులో ఆయన వ్రాసిన పద్యాల్ని గుర్తుపెట్టి నీళ్ళు నిండిన కళ్ళతో, వాటిని ఆయన నాకు చదివి వినిపించాడు. ఆ పద్యాలు చనిపోయిన వాళ్ళ అబ్బాయిమీద అల్లుకున్న పద్యాలు."

తోరూ మరో బంధువు అరున్‌చందర్‌దత్తు. అతనంటే తోరూకు ప్రత్యేకాభిమానం. యూరప్ నుండి ఆవిడ అతనికి తరుచూ ఉత్తరాలు వ్రాస్తుండేది. అతను కేంబ్రిడ్జ్ కార్పస్ క్రిస్టీ కాలేజీ నుండి డిగ్రీ పుచ్చుకుని ఇంగ్లండులోనే స్థిరపడ్డాడు. మంచి పేరు తెచ్చుకున్న డాక్టరై అక్కడే ఓ ఇంగ్లీషు పిల్లను పెళ్ళి చేసుకున్నాడు.

తోరూ అరూ లిద్దరూ ఇంగ్లండులో చాలా సంతోషంగా ఉండేవాళ్లు. వాళ్ళకు సర్ జార్జి మెక్‌ఫర్న్, సర్ బార్టల్ ఫ్రేరీలతో పరిచయం లభించింది. మెన్‌ఫర్న్ భార్య తోరూ, అరూ లిద్దరికీ సంగీతం చెప్పింది. సర్ బార్టల్ 1862 నుండీ 67 వరకూ బెంగాల్ గవర్నరుగా ఉండేవారు. తోరూ ఫ్రేరీ దంపతులతో వింబుల్‌డన్‌లో చాలా రోజులు కులాసాగా గడిపి నట్లు వ్రాసుకుంది. వాళ్ళ మరో స్నేహితుడు సెవెలియర్ డి. చాటెలేన్ అతడు షేక్స్పియర్ నాటకా లన్నిటినీ ఫ్రెంచ్‌లోకి అనువాదం చేశాడు విక్టర్ హ్యూగో కాయన స్నేహితుడు కూడానూ.

తోరూ కన్న అరూ వయస్సులో పెద్దదే అయినా మానసికంగా చిన్నది. తోరూకు ఏ విషయంలోనైనా చొరవ ఎక్కువ. అరూను ఆవిడే నడిపిస్తుండేది. చివరకు చదవడంలోనూ, వ్రాయడంలో కూడా అరూకు తోరూ సలహాలు లభిస్తుండేవి. వాళ్ళిద్దరి మధ్యా ఉన్న ప్రేమా, చెలిమీ చాలా నిర్దుష్టమైనవి. హరిహరదాస్ తను వ్రాసిన తోరూ జీవిత చరిత్రలో వాళ్ళ మధ్య జరిగిన సంభాషణని ఈ విధంగా వివరించాడు:

గోవిన్‌చందర్ దత్తు: అరూ! నువ్వు కలకత్తాలో ఉన్నప్పుడు లార్డ్ లారెన్స్‌ను చూడాలనుకునేదానివి! ఆయనే ఈయన!

లార్డ్ లారెన్స్: నువ్వు నిజంగానే నన్ను చూడాలనుకున్నావా? ఏముందమ్మా నన్ను చూపడానికి! శక్తంతా ఉడిగిపోయిన ముసలివాణ్ణి! అది సరేగాని, నీ చేతులో ఆ పుస్తక మేమిటి?

అరూ: నవలండీ! మిస్ ములాన్ వ్రాసిన 'లార్డ్ హాలిఫాక్స్'.

లా.లా.: నువ్వు నవల లెక్కువగా చదవకూడదు. చరిత్ర గ్రంథాలు చదవాలి.

అరూ: (మాట్లాడదు).

తోరూ: కాని మాకు నవల లంటేనే చాలా యిష్టం సుమండీ!

లా. లా.: ఎందుకనో!

తోరూ: (నవ్వుతూ) ఎందుకా? నవలల్లో ఉండేదంతా నిజం. చరిత్ర లన్నీ ఉత్త బూటకం కాబట్టి!"—

మిలే క్లారిసే బాదర్, తోరూ వ్రాసిన ఫ్రెంచ్ నవలను ప్రస్తావిస్తూ పై మాటల్నే విమర్శించింది.

"ఆనాడు ఆ పెద్దమనిషికి పూర్తిగా, తల్లకిందులుగా జవాబు చెప్పింది తోరూ. ఆవిడ చరిత్రకంటే పురా కల్పిత గాథలకే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చే హైందవ కవి కుటుంబానికి చెందింది. అందుకే తన్ను తాను ఆ విధంగా సమర్థించుకుంది."

తోరూ అరూమీద పెద్దరికాన్ని నెరపడం అరూకుగానీ, తండ్రికిగాన్లీ అభ్యంతరకరం కాలేదు. పైపెచ్చు పోను పోను అరూ మరీ ఎక్కువగా తోరూమీద ఆధారపడుతుండేది. చూచిన వాళ్ళంతా వీళ్ళిద్దరిలో ఎవరు పెద్దవాళ్ళని అడుగుతుండేవారు. ఇద్దరిలోకీ అరూ సౌమ్యురాలు. తోరూ మంచి జ్ఞాపకశక్తి గల పిల్ల. ఆవిడ జ్ఞాపకశక్తి అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుండేది. తాను చేసిన అనువాదాలన్నీ ఆవిడకు కంఠగతంగా ఉండేవి. ఆవిడ ఎక్కడా, ఏనాడూ నట్టుపోయేది కాదని గోవిన్‌చందర్ చెప్తుండేవాడు. పైపెచ్చు ప్రతిదీ ఎంతో శ్రద్ధగా అధ్యయనం చేసేది. ఎందులోనన్నా సందేహం వస్తే నిఘంటువులు, శబ్దకోశాలు, విజ్ఞాన సర్వ

స్వాల వంటివి, అన్నీ చూచి సందేహనివృత్తి చేసుకుంటే తప్ప ఆవిడ మనస్సు కుదుటబడేది కాదు. తర్వాత వాటిమీద వివరణల్ని వ్రాసుకుని ఉంచుకునేది. ఎప్పుడన్నా తండ్రికీ కూతురికీ మధ్య ఫ్రెంచ్, ఇంగ్లీషు, సంస్కృత పదాల విషయంలో ఏదన్నా అభిప్రాయ భేదం వస్తే, చిట్ట చివరికి కూతురి వాదమే నెగ్గుతుండేది. ఏదన్నా పందెం వెయ్యాల్సొచ్చినా సాధారణంగా "తోరూదే గెలుపు." ఖర్మ చాలక ఎప్పుడైనా ఓడిపోతే, తోరూను గమనించడం చాలా సరదాగా ఉండేది నాకు. అటువంటి సందర్భాలలో ఆవిడ ముఖం నిండా ముందు నవ్వు పులుముకునేది. తర్వాత తన సున్నితమైన వేళ్ళతో సుతారంగా నా గరుకు చెంపల్ని నిమిరేది. తర్వాత సందర్భానికి సరిపోయేట్లుగా తనకు నచ్చిన బారెట్ బ్రౌనింగ్ లాంటి ఏ కవయిత్రి మాటల్నో ఒప్పజెప్పేది.

"నా తెలివి తెల్లవారా! నువ్వు పెద్దవాడివి. నాకంటే తెలిసినవాడివి. పూర్ణపురుషుడివి. – ఇటువంటిదే ఏదో సరదా అయిన ధోరణిలో పడేసేది తోరూ!" అని గోవిన్ వ్రాసుకున్నాడు.

దత్తు కుటుంబం వారంతా సర్ ఎడ్వర్డ్ రెయాన్‌తో చాలా స్నేహంగా ఉండేవారు. 1837 నుండీ 43 వరకూ కలకత్తా సుప్రీమ్ కోర్టులో ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరించా డాయన. విక్టోరియన్ యుగానికి చెందిన డికెన్స్, థాకరీ మొదలైన ప్రసిద్ధ రచయితల కందరికీ ఆయన స్నేహితుడు. గోవిన్‌చందర్ తాను సర్ ఎడ్వర్డ్‌ను కలుసుకున్న సంఘటనల్ని గుర్తుకు తెచ్చుకుంటూ బెంగాల్ పత్రికలో 1878 జూలై నెలలో ఓ వ్యాసం ప్రకటించారు. ఆడపిల్ల లిద్దరినీ సర్ ఎడ్వర్డ్ అడిగిన ప్రశ్నలూ, వాటికి తోరూ తడుముకోకుండా టకీ మని చెప్పిన సమాధానాలు గుర్తుపెట్టుకోదగ్గవి. ఉదాహరణకు "మీకు థాకరీ కూతుళ్ళు తెలుసా, వాళ్ళు మీ పొరుగునే ఉన్నారు" అని న్యాయమూర్తిగా రడిగితే, తోరూ తెలియదనే చెప్పేది. కారణం వాళ్ళ పరిచయం తోరూకు లేదు. కేంబ్రిడ్జ్‌లో ఉండగా ఆయన భార్యను మాత్రం ఎప్పుడో తోరూ కలుసుకున్నది. "థేకరీ నవలల్లో ఏవి మీ కెక్కువ ఖిష్టం" అని ఆయన అడగగానే "పెండెనిస్" చాలా మందికి నచ్చుతుంది! అది బాగా పేరుబడ్డ నవలే అయినా, దానికంటే ఎన్నోరెట్లు గొప్ప కళాఖండ మనిపించుకునేది "ఎస్మాండ్!" అని సమాధానం వెంటనే చెప్పేది తోరూ.

అక్టోబర్ 7 వ తారీఖున తోరూ అరుణ్‌కు ఉత్తరం వ్రాస్తూ బెణకటం వల్ల తాను రెండు వారాల పాటు ఇంట్లోనే ఉండిపోవాల్సివచ్చినట్లుగా తెలియజేసింది. బ్రోంప్టన్‌లో వాళ్ళ యింట్లో పియానో లేదు. "నాన్న మా కొకటి అద్దెకు తెచ్చిపెడ్తా నన్నారు" అని వ్రాసింది. తోరూ అరూ లిద్దరికీ చదువు సంధ్యలు సరిగా సాగుతున్నాయో లేదో పర్యవేక్షణ చేయ డానికి ఒక పంతులమ్మ కుదిరింది. ఆమె శ్రీమతి లాలెస్.

తను ఇంకో బంధువు ఉమేష్‌కు ఉత్తరం వ్రాస్తూ, లండన్లో ఉన్నన్నాళ్ళూ తమ దినచర్య ఎట్లా ఉండేదో వివరించింది తోరూ. అసలే ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉండే ఆ పిల్లలకు అటువంటి దినచర్య బాగా శ్రమను కలిగించేదే. కాసేపయినా హాయిగా ఊపిరి పీల్చుకోవడానికి వీలులేనంత ఎక్కువ పని ఉండేది. భారతదేశం చేరుకున్నాక కూడా తోరూ ఆరోగ్యం మరీ దిగజారినా ఆవిడ దినచర్య మాత్రం ఇంకా చిక్కగా ఉండేది. ఇంత నియమబద్ధమైన కార్యాచరణను ఆవిడంతట ఆవిడే నియమించుకున్నదో, లేక అది వాళ్ళ తండ్రి ఆదేశమో చెప్పడం కష్టం.

"నాకు ఉత్తరం వ్రాయడానికి కూడా తీరిక చిక్కడం లేదు. ఎప్పుడు చూచినా చదువే! పొద్దున్న ఏడూ ఏడున్నర మధ్య పియానో సాధన చెయ్యాలి. తర్వాత టిఫిన్ తిని బైబిల్ చదవాలి. దాంతో ఎనిమిదిన్నర దాకా సరిపోతుంది. మళ్ళీ తొమ్మిదిన్నర దాకా పియానో సాధన. దాని తర్వాత నేను 'టైమ్స్' చదువుతాను. జరుగుతున్న యుద్ధ వార్తలమీద నాకు ఆసక్తి. ఆ విషయంలో ఖచ్చితంగా నీకంటే నాకే ఎక్కువ విషయాలు తెలుసు. పది గంటల కల్లా మిసెస్ లాలెస్ వచ్చేస్తారు. మాకు మధ్యాహ్నం మూడున్నర వరకూ ఆవిడతోనే గడిచిపోతుంది. నాలుగు గంటలకి నాన్నగారితో కలిసి పఠనా వ్యాసంగం సాగిస్తాము. శుక్రవారాలయితే మిసెస్ మెన్‌షర్న్ వస్తారు. ఆవిడ మాకు సంగీతం చెప్తున్నారు. సోమవారాలు మిస్టర్ పార్ ఇంటికి సంగీత పాఠాలు నేర్చుకోడానికి వెళ్తాము. తర్వాత మళ్ళీ మేమూ, మా పియానో సాధన!" అని తమ దినచర్యనంతా ఉమేష్‌కు వ్రాసిన ఉత్తరంలో వివరించింది తోరూ!

వాళ్ళ ఫ్రెంచ్ అధ్యయనం కూడా బాగానే సాగేది. ఉమేష్‌కు వ్రాసిన ప్రతి ఉత్తరాన్నీ తోరూ, "భగవంతుడు నిన్ను సర్వాపదల నుండీ అన్ని పాపాలనుండీ రక్షించాలి" అని ముగిస్తుండేది.

వాళ్ళు ఇంట్లో ఒక ఇటాలియన్ సేవకుణ్ణి కుదుర్చుకున్నారు. అతనితో ఎప్పుడూ ఫ్రెంచ్ మాట్లాడడం వల్ల ఆ భాష బాగా రావడానికి వీలు కలిగింది. వాళ్ళ వంటమనిషి ఇసబెల్ వాళ్ళ దగ్గర కొన్ని భారతీయ వంటకాల్ని వండడం నేర్చుకుంది. "మా భోజనాల బల్లమీద కట్లెట్లూ, రోలీపోలీలూ, మాత్రమే కాక, వాటితోపాటు వేడి వేడి కచోరీలూ, కాబేజీ కూరా, చేపలకూరా వంటివి చూస్తే ఎంత హాయిగా ఉండేదని!" అని చెప్పుకుం దొకచోట తోరూ. శీతాకాలంలో రెండుసార్లు పడే మంచూ, ఆ మంచుతో ఆడుకుంటూ, దాన్ని బంతులుచేసి విసురుకోవడం, అందువల్ల కలిగే ఆనందం, వాటి సంగతి కూడా వ్రాసింది తోరూ. ఎప్పుడైనా వాళు. 'ఐమీ రోబ్సర్ట్', 'మిడ్ సమర్ నైట్స్ డ్రీమ్' వంటి నాటకాలు చూచేవాళ్ళు.

1871 లో దత్తు కుటుంబం కేంబ్రిడ్జ్ చేరుకున్నారు. అక్కడ పార్కర్స్ పీస్‌కు ఎదురుగ్గా రీజెంట్ వీధిలో ఉండేవారు. స్త్రీలకోసం ఏర్పాటు చేసిన సభలకు వెళ్ళి శ్రద్ధగా ఉపన్యాసాలు వింటుండేవాళ్లు. అక్కడ వాళ్ళకు ఫ్రెంచ్ చెప్పడానికి బోగెల్ అనే టీచరు కుదిరాడు. కేంబ్రిడ్జ్‌లో ఉన్న రోజుల్లో వాళ్ళకు కనిపించిన ఏకైకాకర్షణ మేరీమార్టిన్. ఈవిడే తర్వాత తోరూకు ప్రాణప్రదమైన స్నేహితురాలుగా మారిపోయింది. తర్వాత వాళ్ళిద్దరి మధ్యా ప్రపంచంలో స్థిరంగా నిలిచిపోయేదీ, అందరూ జ్ఞాపకం ఉంచుకోతగ్గదీ అయిన లేఖారచన నడిచింది. ఎప్పుడో తర్వాత తోరూ జీవిత చరిత్ర వ్రాసిన హరిహరదాస్‌కు నిజానికి సహాయం చేసిందీ ఈ మేరీ మార్టినే. ఆయన 1913 లో కలకత్తాలో మిస్ మార్టిన్‌ను కలుసుకున్నాడు తనకు తోరూ జీవిత చరిత్ర వ్రాయాలని ఉందని తన అభిలాషను వెల్లడించాడు. ఆవిడ వెంటనే ఆ విషయంలో చాలా కుతూహలాన్ని చూపించింది. తనకూ తోరూకూ మధ్య నడిచిన ఉత్తరాల్ని ప్రచురించుకోవడానికి అనుమతి కూడా ఇచ్చింది. ఆ కృతజ్ఞత వెల్లడిచేయడానికే హరిహరదాస్ తన పుస్తకాన్ని ఆవిడకే అంకిత మిచ్చాడు.

"తాను చూపిన మైత్రనైన సానుభూతికి
కృతజ్ఞతతో, ఎంతో ప్రేమతో,
తన భారతీయ స్నేహితురాలూ, ప్రాణ
మిత్రమూ అయిన తోరూదత్తు

స్మృతి కావ్యం,
మేరీ ఇ. ఆర్. మార్టిన్‌కు
అంకితం చేయబడుతున్నది.''—

మేరీ మార్టిన్ రివరెండ్ జాన్ మార్టిన్‌కు ఒక్కతే కూతురు. అయన కేంబ్రిడ్జిలోని సిడ్నీ ససెన్స్ కాలేజీకి చెందినవాడు. సెంట్ మాథ్యూస్‌కు 1859 నుండీ 84 వరకూ 'వికార్'పదవి నిర్వహించినవాడు. 1872 లో అక్కచెల్లెళ్ళిద్దరూ మొదటిసారి మేరీని కలుసుకున్నారు. అప్పటికి మేరీకి 15 ఏళ్లు తోరూకు 16. మేరీ మెల్వర్న్‌వెల్స్‌లో స్కూలు పద్యను నేర్చు కుంటుండేది. తర్వాత, తోరూ చనిపోయిన చాలా కాలానికి 1910-13 సంవత్సరాలలో మిషనరీగా మేరీ కలకత్తా వచ్చింది.

కేంబ్రిడ్జిలో దత్తు కుటుంబానికి లభ్యమైన మరో స్నేహితుడు బిషప్ క్లిఫర్డ్. ఆయన వీళ్ళను మొదటిసారి ప్రొఫెసర్ కోవెల్ ఇంట్లో కలుసు కున్నాడు. కోవెల్ కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో పనిచేసినప్పుడు రెండు కుటుంబాలూ చాలా సన్నిహితంగా ఉండేవి.

కేంబ్రిడ్జి నుండి దత్తు కుటుంబం సముద్రతీరంలో ఉన్న సెంట్ లియొనార్డ్‌కు తమ నివాసాన్ని మార్చారు. ఆమీద ఇంగ్లండులో ఉన్నన్నాళ్లు అక్కడే ఉన్నారు. అక్కడ వాళ్ళకు మాస్టర్ గిరార్డ్ ఫ్రెంచ్ చెప్పేవాడు. "నాకూ మా నాన్నకూ ఫ్రెంచ్ నేర్పడానికి ఆయన వారానికి రెండు మూడు సార్లు వచ్చేవారు. అప్పుడు అరు మాతో కలిసి చదివేది కాదు. అంతకు ముందే జబ్బుపడి లేవడంవల్ల ఆమె చాలా బలహీనంగా ఉండేది, ఆయనకు కవిత్వమంటే చాలా యిష్టం. డి. యఫ్. ఏ. నుండి రెండు మూడు ఖండికల్ని ఎంచి ఆయన ఫ్రెంచ్ కవితగా అనువదించారు కూడానూ''—అని తోరూ ఒక ఉత్తరంలో వ్రాసింది. మిటెబాదెర్‌కు కలకత్తానుండి పంపించిన అరూ తోరూల ఛాయా చిత్రం సెంట్ లియొనార్డ్స్‌లో తీసిందే. అందులో అరూ ఎంతో అలిసిపోయి పందొమ్మిదేళ్ళకంటే ఎంతో ఎక్కువ వయసున్న దానిలాగా కనిపించింది. అందుకు విరుద్ధంగా తోరూ మిసమిసలాడుతూ జీవకళ తొణికిసలాడుతున్నట్లుగా ఉంది. నల్లని జుట్టు భుజం మీదికి జీరా డుతూ తెలివైన ముఖంమీది వర్చస్సుతో చాలా అందంగా ఉంది. అప్పటి కావిడకు పదేహేడేళ్లే. ఆ ముఖం చూస్తుంటే మరో అయిదేళ్ళకే అవిజ్ఞక్షయ

బలితీసుకుంటుందని ఎవరూ అనుకోలేరు. ఎంత జబ్బుగా ఉన్నా అరు జీవితంకూడా మరో రెండు సంవత్సరాలలో అంతమవబోతుందన్నట్లుగా లేదు. వాళ్ళిద్దరూ బాగా కుచ్చులు కుచ్చులుగా ఉన్న విక్టోరియన్ గౌన్లు వేసుకుని ఉన్నారు. ఆ ఫోటో చూస్తుంటే వాళ్ళిద్దరూ ఎందుకు చీరలు కట్టుకోలేదని పిస్తుంది: అసలు కలకత్తాకు తిరిగి వెళ్ళిన తర్వాతనైనా వాళ్లు చీరెలు కట్టుకున్నారో లేదో!

తోరూ ప్రచురించిన "భారత దేశపు ప్రాచీన గేయగాథలు" అన్న పుస్తకంలో ఆవిడ కవితా ఖండిక "నియర్ హేస్టింగ్స్" ఒకటి. అందులో అరూ ఆరోగ్య స్థితి చూచాయగా తెలుస్తుంది మనకు. దారినబోయే స్త్రీ చేసిన సానుభూతి పూర్వకమైన చిన్న పని తోరూ నెంతగా కదిల్చివేసిందో ఆ ఖండిక వెలువరిస్తుంది.

హేస్టింగ్స్ దగ్గర
గులకరాళ్ళు పరుచుకున్న
కదలి ఒడ్డున
నడయాడుతుండేవాళ్ళం!

శిశిరంలో
అన్నిటికంటే ముందు
ఆరముగ్గిన పీచ్ పండ్లు
గోడలమీద ఒరుగుతుండేవి.

దూరంగా
ఏకత్వం భజించే
ఆకాశమూ భూమీ!

పట్టణం పంపించే
పలురకాల ధ్వనులన్నీ
ప్రతిధ్వనిస్తుండగానే
పగలు జరిగిపోయేది.

ఒంటరిగా అక్కడ మిగిలే మేము
అపరిచితులం !

అలసటగా
విసుగును మోస్తూ
మెల్లగా అక్కడే తిరిగే మేము
రోగగ్రస్తులం !

ఫిర్యాదులు చెయ్యడం తెలీని
అంతర్యం గల మా అక్క
అక్కడే కూర్చుండి పోయేది.

నీడలన్నీ చిక్కపడి
బూడిద రంగుకు తిరిగిన వేళ
నడివయస్సు దాటిన మనిషి
నడుచుకుంటూ
వచ్చేసింది దాపుకు !

సాధుత్వం కనిపించే
సౌమ్యమైన ఆ ముఖాన్ని
ఏ చిత్రకారుడూ కవీ
ఎప్పుడూ రూపు దిద్ది ఉండడు !
మహర్షి కుండవలసిన ఆ వర్చస్సును
మరెవ్వరూ చూచి ఉండరు.

ఆవిడ మమ్మల్ని దాటుకుంటూ
అవతలికి వెళ్ళి వెనక్కి వచ్చింది
ఒక్క చూపులోనే
మా అపరిచితత్వాన్ని
అంచనా కట్టింది

ప్రాణమ్ని వాళ్ళైనా మీరని
మాటలు కలుపుతూ
మంతనా లాడింది.

అశ్రుజలంతో తడిసినట్లు
ఆర్ద్రంగా ఉన్న
అరుణవర్ణపు గులాబీలను
అక్కచేతి కందిస్తూ
అన్నది గుండెల నిండుగా

"ఆ పరమేశ్వరుడు చల్లగా చూడాలి
తల్లీ, మీ యిద్దరినీ!"—

పొదరిళ్ళ అలంకారం కోసం
పొందిగ్గా మేము పెంచుకునే
పెద్ద కమలా అంత
ప్రశస్తమైన పూలు
నిండుగా విచ్చుకున్న
అందమైన ఆ గులాబీలు!

అపరిచితురాలి చేతికి
ఆ పూవుల్ని అందించిన ప్రేమ
అంతకంటే అందమైనది!

అందర్నీ కాపాడే కరుణామయుడు
ఆ వ్యక్తి కెప్పుడూ ఋణపడి ఉంటాడు తప్పదు!
ఆవిడ పేరే తెలీదు నాకు
ఆవిణ్ణి ముందెప్పుడూ చూడకపోవచ్చు నేను
ఆవిడంటే అంతరంగంలో

అంతులేని ప్రేమ పొంగుతుంది ;
ఆవిడ కెప్పుడూ ఆనందాన్నే
అవశ్యం కోరుకుంటాను నేను ;

ఎన్ని విషాదాల నీలి నీడలు
భవిష్యత్తును కప్పి చెలగినా
ఆవిడ జ్ఞాపకా లెప్పుడూ
అంతరించిపోవు లోపల !

ఎన్నటికీ వాడిపోవడం తెలీని
ఆవిడిచ్చిన గులాబీలే
అను నిత్యమూ నా గుండెల్లో
అందంగా విరుస్తుంటాయి——

1872 డిసెంబర్ నుండి 73 ఏప్రెపెల్ వరకూ కేంబ్రిడ్జ్‌లో దత్తు కుటుంబమూ, మేరీ మార్టిన్ కుటుంబమూ రోజూ కలుసుకుంటుండేవి. రెండు కుటుంబాలూ కలిసి వ్యాహ్యాళికి పోవడం, టీలు తాగడం, నెగళ్ళ దగ్గర వెచ్చ వెచ్చగా సాయంత్రాలు గడపడం, వంటి విషయాలన్నీ మేరీ తల్లిగారి డైరీలో కనిపిస్తాయి. దత్తు కుటుంబం సెంట్ లియొనార్డ్స్‌కు వెళ్ళిపోయిం తర్వాత మళ్ళీ రెండు కుటుంబాలూ కలుసుకోలేదు. "అందుకే మా యిద్దరి మధ్యా జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఎంతో ఆత్మీయత ఉండడం సంభవించిందనుకుంటాను" అని వ్రాసింది మేరీ ఒకచోట.

గోవిన్‌చందర్ తన కుటుంబంతో సహా 1873 సెప్టెంబర్‌లో పి & ఓ 'లైనర్ పెషావర్' లో ఇండియాకు తిరుగు ప్రయాణం సాగించాడు.

# 7. స్వదేశాగమనం

తోరూ విదేశాలలో ఉండగా భారతదేశంలో ఉన్న స్నేహితులకూ, బంధువులకూ ఎందరికో ఉత్తరాలు వ్రాస్తుండేది. వాటిల్లో చాలా కొద్దిగా మాత్రమే దొరికాయి. కాని ఇండియాకు తిరిగి వచ్చాక తోరూ మేరీకి వ్రాసిన ఉత్తరాలన్నీ భద్రం చేయబడ్డాయి. అవన్నీ హరదాస్ వ్రాసిన తోరూ జీవిత చరిత్రలో భద్రం చేయబడ్డాయి. 1873 సెప్టెంబర్ నుండి మొత్తం యాభైమూడు ఉత్తరాలు తోరూ మేరీకి వ్రాసింది. ఆ ఉత్తరాలు ఎంతో విలువైనవి. విజ్ఞానార్జన చెయ్యాలనీ, వ్రాయాలనీ గాఢమైన కాంక్ష కలిగిన ఓ మంచి తెలివి గల యువతి హృదయాన్ని యథాతథంగా ఆవిష్కరించ గలిగినవి. కలకత్తాలో రామ్‌బాగన్, బాగ్‌మరీల, మధ్య తమ యింట్లో తాము గడిపిన జీవిత మంతా ఆ ఉత్తరాలలో ప్రతిఫలించింది. మనస్సులో తిరిగి యూరప్ వెళ్ళాలనే కోరిక ఎంత బలంగా ఉన్నా, తోరూ తాను పుట్టిన ఊరు వదలడానికి మళ్ళీ వీలులేకపోయింది.

కలకత్తాలో ఆవిడ జీవితం ఎంతో చురుకుగా, ఆనందప్రదంగా సాగింది. తలిదండ్రులూ, పెంపుడు జంతువులూ, లెక్కలేనంత మంది బంధువులూ, స్నేహితులూ, పుస్తకాలూ, రచనా వ్యాసంగమూ ఇవన్నీ ఆవిణ్ణి ఆనందంగా ఉంచుతుండేవి. కాని విదేశాల నుండి తిరిగి వచ్చిన సంవత్సరం లోపున తోరూ క్షయవ్యాధి బారిపడకుండా తప్పించుకోలేక పోయింది.

తోరూకూ మేరీకీ మధ్య ఎటువంటి అరమరికలూ లేవు. ఆమె పట్ల ప్రేమ నిండిన హృదయంతో తోరూ తన సుఖాల్నీ, దుఃఖాల్నీ చెప్పుకుంది. ఆ ఉత్తరాలను చూస్తుంటే అవి కేవలం ఇద్దరు ఆడపిల్లల మధ్య నడిచిన మామూలు ఉత్తరాల లాగా కనిపించవు. రకరకాల విషయాల తోటీ, రహస్యాలతోటీ, సంఘటనలతోటీ, నిండి సాహిత్య ప్రతిపత్తి కలిగిన రచనల్లా కనిపిస్తాయి. మన సంస్కృతి ముద్ర బలంగా వాటిమీద కనిపిస్తుంది.

"తోరూ తెలివి తేటలు ప్రకాశించడానికి వీలులేకుండా అర్ధాంతరంగా ఆగిపోయాయి. అట్లాకాక, అవి పరాకాష్ఠ నందుకునే అవకాశమే ఉంటే, ఆవిడ ఉత్తరాలు ఆంగ్లంలో అందరికీ పఠనీయాలై మౌలిక సాహిత్యస్థాయికి చెంది ఉండేవి" అని హరదాస్ అభిప్రాయపడ్డాడు.

ఆ ఉత్తరాల్లో అచర ప్రకృతికి సంబంధించిన, కళ్ళు మిరుమిట్లు గొలిపే అందం వర్ణితమైంది. విక్టోరియన్ యుగానికి చెందిన రచయితల హాస్యధోరణి ప్రతిబింబించింది. నిశితమైన విమర్శలు స్థానం సంపాదించు కున్నాయి. అయినా వాటిని గురించి ఒక్క విషయం చెప్పుకోక తప్పదు. వాటిల్లో విషయక్రమం లేదు ముందుగా ఆలోచించి ఒక పద్ధతిలో ఆలోచనల్ని అనుసంధించుకునే ధోరణి లేదు. తోరూ ఒక విషయాన్నుండి మరో విషయానికి కప్పదాట్లు వేస్తుండేది. ఈ లక్షణమే బహుశా ఆవిడ ఉత్తరాలకుండే సాహిత్యపు విలువల్ని తగ్గించిందేమో! ఉదాహరణకు, ఒకచోట తన పెంపుడు పిల్లి చచ్చిపోయిన విషయం చెప్తూ, అది ముగించకముందే ఉన్నట్లుండి, ఒక ఫ్రెంచ్ కవి కవితా సౌందర్య చర్చలోకి వెళ్ళిపోతుంది, లేదా తన అనారోగ్యాన్ని విదితం చేస్తూనే ఆనాడు సమాజాన్ని పీడించే సాంఘిక సమస్యమీద అభిప్రాయాన్ని వెల్లడి చేస్తుంది. ఈ విధంగా ఏకసూత్ర గ్రథితం కాకుండా, తోరూ వెల్లడించిన అభిప్రాయ పరంపర వివిధ విషయాలమీద ఆవిడ కున్న శ్రద్ధాసక్తుల్ని వివరిస్తున్నది. ఆ ఉత్తరాలనిండా చిన్న పిల్లలకు సహజమైన సమయస్ఫూర్తి నిండి ఉంటుంది. అందువల్లనే అవి చదివే వాళ్ళకు ఆసక్తి కుతూహలమూ చివరివరకూ ఉండడానికి వీలు కలిగింది. దీనిని బట్టి ఉత్తరాలు వ్రాయడంలో తోరూ అసాధారణమైన తెలివి తేటల్ని చూపించిందనే చెప్పవలసి వస్తుంది.

తోరూకు పుస్తకాలమీద వెర్రి వ్యామోహం. అట్లాగే వ్రాయాలనీ, ఇంకా ఇంకా వ్రాయాలనీ తీరని తృష్ణ. తన ఉత్తరాలలో, తన స్నేహితురాలికి ఏ విషయాన్ని గురించిగానీ అన్ని కోణాలనుంచీ సమగ్ర స్వరూపాన్ని అందించాలనే కోరిక తోరూకు ఉండేది.

పెషావర్ పి. ఒ. లైనర్‌లో ప్రయాణించేటప్పుడు జిబ్రాల్టర్ నుండి మేరీకి తోరూ తన మొదటి ఉత్తరం వ్రాసింది. అక్కడ నుండి ఆవిడ వ్రాసిన అన్ని ఉత్తరాలలోనూ ప్రయాణ విషయాలే ఎక్కువగా వర్ణింప

బడ్డాయి. సముద్ర ప్రయాణం వల్ల కొంత అనారోగ్యం కలిగినా ఒక మాదిరిగా తోరూ ఆరోగ్యం బాగానే ఉంది. అయినా అరూ ఆరోగ్యం బాగా క్షీణించడంవల్ల తోరూ కేమీ ఉల్లాసంగా ఉండేది కాదు. నిజానికి మరో చలికాలం అరూ ఇంగ్లండులో గడపడం కష్ట మని వైద్యులు చెప్పినందువల్లనే గోవిన్‌చందర్ స్వదేశానికి ప్రయాణం పెట్టుకోవలసి వచ్చింది. తోరూకు తన స్నేహితురాల్ని ఇంక చూడలేనేమో అన్నట్టుగా మనసులో ఒకటే దిగులు.

భారత దేశం నుండి డిసెంబర్ 1873 నుండీ తోరూ ఉత్తరాలు వ్రాయడం మొదలు పెట్టింది. దారిలో దత్తు కుటుంబం గాలెలో నాలుగు రోజులు ఆగవలసి వచ్చినా వాళ్ళంతా సింహళంలో ఒకరోజు ఆనందంగా గడిపారు. అరూ తనతో ఎన్నో పక్షుల్ని తెచ్చుకుంది. వాటిల్లో చాలా పక్షులు దారిలోనే చచ్చిపోయాయి. ఏవో కొన్ని లినెట్లూ, గోల్డు ఫించెస్, కానరీలు మాత్రం బ్రతికాయి.

ఇండియాకు రాగానే వాళ్ళకు చాలా మంది బంధువులు ఘనంగా స్వాగత మిచ్చారు. వాళ్ళు వెనక వదిలి పెట్టి వెళ్ళిన పెంపుడు జంతువులన్నీ స్వాగతం పలికాయి. వాళ్ళు వెళ్ళినప్పుడు చిన్నవిగా ఉన్న పన్నీ పెద్దవై తోరూనూ, అరూనూ వదలకుండా అంటిపెట్టుకుని తిరిగాయి.

అది డిసెంబర్ నెలే అయినా గులాబీలు, మందారాలు, బంతిపూలు వాళ్ళ తోటలో విరగబూచి ఉన్నాయి. తోరూ తల్లి, వస్తూ వస్తూ జాజి చెక్కల పెట్టెల నిండా మొక్కలూ, దుంపలూ ఇంకా గింజలూ తెచ్చింది. అందులో 'హైసింత్స్' పెరగడం మొదలు బెట్టాయి. "ఇంగ్లీషు మొక్కల్ని ఇండియాలో ప్రవేశ పెట్టే ప్రయత్నంలో మా అమ్మదే ఘన విజయం కావా లని నా ఆశ! మా తోటలో చెరువు నిండా తెల్లతామరలూ, ఎర్రతామరలూ కలగలిసి ఎంతో అందంగా ఉన్నాయి" అంటూ మేరీకి వ్రాసింది తోరూ.

అరూ గినీ పందుల్ని పెంచేది. తర్వాత తర్వాత వాటి జనాభా పెరి గితే వాటి నమ్మి మా అమ్మాయి డబ్బు గడిస్తుందని తమాషాకి నవ్వుతూ చెప్తుండే వాడు గోవిన్. అరూ బాతుల్ని కూడా పెంచేది. ఇంట్లో నాలుగైదు నీటి కుండీలు ఉండడం వల్ల వాళ్ళకు బాతుల్ని పెంచడం వీలుగా ఉండేది. తాజా పండ్లు బాగా దొరికేవి. ఇంగ్లీషు పియర్స్‌ను జ్ఞాపకం తెచ్చే జామ

పండ్లు, అరటిపండ్లు, నారింజలు దొరికేవి. బాగ్‌మేరి తోట మామిడి పండ్లకు బాగా ప్రసిద్ధి.

తాము తిరిగి వచ్చాక చల్లగా సాగే తమ గృహ జీవన విధానాన్ని నాలుగు సంవత్సరాల పాటు, మేరీకి వ్రాసిన ఉత్తరాల్లో స్పష్టం చేసింది తోరూ.

వాళ్ళ పిల్లి 'మాజా' చచ్చిపోయింది. అది పదకొండు సంవత్స రాలకు పైనే తమ యింట్లో ఎక్కడ చూచినా విషాద చ్ఛాయలే. చెరువు గట్టున రూవ్ చెట్టు మొదట్లో దాన్ని పూడ్చి పెట్టారు. సమాధి చేసే టప్పుడు అమ్మా నాన్నా కూడా దగ్గరే ఉన్నారు. కాని పిల్ల లిద్దరూ చాలా అనారోగ్యంగా ఉండడం వల్ల కిందికి దిగి రాలేకపోయారు. వాళ్ళ ఆవు ఈనింది. అంటే ఇక చిక్కటి పాలకు కొదవ లేదన్న మాట. అరూ తానే పాలు పితకాలని కుతూహలపడేది.

తోటలో ఉన్న పెద్ద రోజాపొద నిండా చాలా అందమైన పువ్వులు. ఇక్కడి పువ్వులతో పోలిస్తే ఇంగ్లీషు పువ్వులు చాలా వరకు నిర్గంధ కుసు మాలు. వాళ్ళకు కోళ్ళ పెంపకం ఉంది. కొత్తగా పొదిగిన పిల్లల్ని తోరూ చూస్తుందని అమ్మ మేడమీదికి పంపించేది. వాళ్ళకు రోజూ పొద్దున్నే తాజా గుడ్లకు కొదవ లేదు.

అరూ చెప్పుకోదగ్గంత పెద్ద చేపను పట్టడానికి ఎప్పుడూ ప్రయత్నించ లేదు. "నాకు కొంచెం బలం వచ్చేదాకా ఆగుతాను. లేకపోతే తప్పించు కునే ప్రయత్నంలో చేప నన్నే నీళ్ళల్లోకి లాగేస్తుందేమో!" అనేది. "సరిగ్గా అందుకనే నేను కూడా పెద్ద చేపలకు గాలం వెయ్యను" అని వ్రాసేది తోరూ.

ఓ పెద్ద చింతచెట్టుమీద కోతు లుండేవి. 'మాజా' పిల్లులు బాగా ఆడుకుంటుండేవి. తోరూ ఆరోగ్యం బాగుండ నందువల్ల కిందకు దిగడానికి ఓపికలేక కొన్నాళ్ళు పియానో సాధన మానేసింది. తన ఆరోగ్యం బాగు పడేదుందా అనీ, ఇంగ్లండుకు మళ్ళా వెళ్ళగలనా అనీ తోరూ నిస్పృహతో ఆలోచిస్తుండేది. "మేం మళ్ళీ అక్కడికి రాగలమో లేవో తెలీదు. నాన్న మా కిక్కడున్నదంతా అమ్మేసి ఇంగ్లండులోనే స్థిరపడదా మంటున్నారు. మే మెక్కడున్నా భగవంతుడు మా వెంట నంటే ఉండాలి."

వాళ్ళ గృహ జీవితం ప్రశాంతంగా ఒక పద్ధతిలో సాగిపోయేది. అమ్మ పాటలు పాడేది. అలా పాడుతుంటే తోరూకు తానూ, తన తోడబుట్టిన వాళ్ళిద్దరూ చుట్టూ చేరి వినడం జ్ఞాపకం వచ్చి మనస్సు వికల మయ్యేది. అబ్బూ చచ్చిపోకముందు, తాము చీకూ చింతా లేకుండా కలకత్తాలో గడిపిన బాల్యమంతా ఆవిడ కవిత 'సీత'లో పొదగబడి ఉంది.

ఒక చీకటి గది లోపల
ముగ్గురు ముత్యాల వంటి బిడ్డలు
ముగ్గురూ ఆనందపు ముద్దలు
కళ్లన్నీ పూర్తిగా విప్పుకుని
కనేదంతా ఏమిటి చివరకు !

సూర్యకిరణ లేశాన్నయినా
చొరనీయని కీకారణ్యం !
అక్కడ నిటారుగా పెరిగే
వృక్షాల్ని కౌగిలించుకునే తీగలు !

తీగల్ని హత్తుకుంటూ
పెద్ద పెద్ద పూలు విచ్చుకుంటాయి.

స్తబ్ధంగా స్వచ్ఛంగా ఉన్న
సరోవర మధ్య భాగాన
రాజహంసలు
రమ్యవిహారం చేస్తాయి !

ఎక్కడో ఝుళ్ళపొదల్ని చీల్చుకువి
చక్కని నెమలి ఎగిరి దూకుతుంది

తెలతెల్లని జింక పిల్లలు
గుంపులు గుంపులుగా పోటీలు పడి
పరుగుల్లు పెడతాయి,

అలలు అలలుగా కదలాడే
ఆకుపచ్చని పైర్ల మధ్యలో
ఎత్తు పల్లాల పొలకువలు
ఎక్కువగా కనపడతాయి.

యజ్ఞవేదిక మధ్యంగా
నీలధూమం వెలువడుతుంది.
వెలుగును వెంట పెట్టుకుని
అక్కడే శాంతితో నివసిస్తాడు
మహర్షియైన మహాకవి ?

తెల్లగా మెరిసిపోతూ
అవిరళంగా రోదించే
ఈవిడ ఎవ్వరు ?

ఈవిడ కార్చే ప్రతి కన్నీటి బిందువుకూ
తోడు తోడుగా
ముగ్గురు పిల్లలు
ఏకధారగా కురిసే
కంటి నీలాలు !

దుఃఖంతో నమ్రమా లయిన
ముగ్గురి తలలు !

అది పాత పాత కథ !
అమ్మ పాడిన పాట వల్ల
పిలిచినట్లుగా సాక్షాత్కరించిన
గతంలోని
సీత కథ !

దృష్టి పథం నుండి
దృశ్యాలు కరిగిపోయినా
అనుభవించిందంతా
అణచివేయబడినా
ఇప్పటికీ ఆ ముగ్గురూ
అవే కలలు కంటుంటారు!

మళ్ళీ ఆ ముగ్గురు పిల్లలూ
తల్లి చుట్టూ చేరేదెప్పుడు
చల్లని సాయంవేళల
మెల్లగా జతకూడేదెప్పుడు?

వాళ్ళమ్మ బెంగాలీ భాషలో పాడిన ఆ పాటలన్నీ ఎంత స్పష్టంగా ఉండేవో! అందుకే పురాతన గాథల్ని ప్రతి సాయంత్రమూ ఆవిడ పాడినప్పుడు తోరూ కళ్ళల్లో నీళ్లు నిండుతుండేవి.

ప్రతి దినమూ వాళ్ళ పఠనా కార్యక్రమం ఎక్కువ కాలాన్ని ఆక్రమించుకుంటుండేది. తండ్రి కూడా వాళ్ళకు పుస్తకాల మీద ప్రేమ పెరగడానికి బాగా దోహదం చేశారు. రామబాగత్ గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలన్నీ భాగ్‌మరీకి తరలించబడ్డాయి. అక్కడ వాటికి బాగా స్థల ముండేది. తోరూ తృప్తిగా చదువుకోడానికి కావలసినన్ని పుస్తకాలు "మా సొంత గ్రంథాలూ, కలకత్తా గ్రంథాలయంలోవీ కలసి నాకు పుస్తకాల కొరత లేకుండా చేశాయి. కలకత్తా గ్రంథాలయంలో నాన్నకు కొంత భాగం ఉంది కూడానూ!" అని వ్రాసింది తోరూ. తోరూ ఏ పుస్తకాన్నయినా చాలా తొందరగా చదివేది. "నేను అంత తొందరగా పుస్తకాలు ఎట్లా చదవగలిగేదాన్నంటే, దానికి కారణం అతి సామాన్యమైందీ, చాలా చిన్నదిన్నీ—మా జీవితాలు చాలా ప్రశాంతంగా చల్లగా సాగేవి కావడం ఒక కారణం. భోజనాలూ, ఉపాహారాలూ, టెన్నిస్ ఆటలూ, విహార యాత్రలూ వీటన్నిటికీ ఖర్చు చెయ్యాల్సిన సమయ మంతా మేము కేవలం చదువుకే వినియోగించే వాళ్ళం. అందువల్లనే నేను చిన్నప్పటినుంచీ పుస్తకాల పురుగు నయ్యాను"—

మాండేస్ రెవ్యూను తోరూ లండన్‌కుండి తెప్పించుకునేది. అక్కడనుండే హాచెట్ దంపతులు తోరూకు ఫ్రెంచ్ ఇంగ్లీషు పుస్తకాలు పంపిస్తుండేవారు. అందువల్ల సమకాలిక రచనల్ని చదవ గలగడం తోరూకు లభ్య మైంది. ఆవిడ ఎప్పుడూ కార్లైల్, బ్రాంటీ సోదరీమణులు, బైరన్, థాకరే. కాల్రిడ్జ్, టెనిసన్, బ్రౌనింగ్, జార్జ్ ఇలియట్, లిట్టన్, మొదలైన ఆంగ్ల రచయితల్ని పేర్కొంటుండేది. ఫ్రెంచ్ పుస్తకాల్నికూడా, చాలా ఎక్కువగా, లోతుగా చదివేది. మోలియర్ హాస్య నాటకాలూ, మిగెట్ విప్లవ చరిత్రా, రోసెల్ వ్యాసాలూ, విక్టర్ హ్యూగో రచనలూ హైన్ ప్రయాణ కథా, సెన్‌హైన్ రచనా, ఇవన్నీ, ఇంకా కొన్నీ ఆవిడకు అభిమాన గ్రంథాలు. ఫ్రెంచ్ కాల్పనిక సాహిత్యానికి చెందిన రచయితలూ, పెర్నాషియనులూ, ఎప్పుడూ తోరూకు తోడునీడలు.

తోరూ అంటే ఇంట్లో బంధువులకూ స్నేహితులకూ, అందరికీ ఇష్టమే. "ఆవిడ అతి నాజూకుగా సగం విచ్చిన గులాబి మొగ్గ! తనకు సంబంధించిన హైందవ గృహప్రపంచంలో సువాసనలు నింపే మనోహర ముకుళం" అని తోరూను గురించి హరిహరదాస్ వ్రాశారు. చిన్నా పెద్దా అంతా తోరూను దీదీ అని పిలిచేవాళ్ళు. చివరకు ఆవిడకు తాత వరసైన వాళ్ళకూ అత్తలకూ మామలకూ అందరికీ అదే పిలుపు. ఆవిడ హృదయం సుతిమెత్తనైనది. వినయంతో తొణికిసలాడుతూ కరుణ నింపుకొన్న తోరూ అందరికీ అబ్బురం కలిగించేది. తననూ తన కుటుంబాన్నీ పరిచయం చేసుకోవాలని డాక్టర్ హంటర్ ఎందుకు తరతరలాడేవాడో తోరూకు అర్థ మయ్యేది కాదు. "నాకు ఏదో ప్రాముఖ్య మున్నట్టే కనిపిస్తున్నదిసుమా! నాకు సిగ్గుగానూ ఉంది. ఇంతాచేసి నా పుస్తకం ఉత్త అనువాదం మాత్రమే. డాక్టర్ హంటర్ స్వయంగా ఎన్నో పుస్తకాలు వ్రాశారు కూడానూ!"

కుటుంబ జీవన మాధుర్యాన్ని చవి చూస్తూ అందువల్ల అందే ప్రతి చిన్న విషయమూ తన సరళ జీవనానికి దోహదం చెయ్యగా, లోకం రచయిత్రిగా తనపై కురిసిన గౌరవాన్ని తోరూ స్వీకరించి ఆనందించింది.

ఆవిడ కుండే అవసరాలు చాలా కొద్దివి. ఒక దోమ తెరా, పొద్దున్నే తన గుర్రాలను చూడడం, విరగబూచిన తురాయి చెట్టును అదే పనిగా చూస్తున్నందువల్ల కలిగే ఆనందం, తన తల్లి పాడే పాటా, చివరకు ఫ్రాన్సు

మృత్యు ముఖాన ఉన్నపుడు, తన చేతిలో ఇమిడిపోయిన తండ్రి చేతిస్పర్శా పీటితోటే ఆమె తన అల్పాయుష్కమైన జీవితాన్ని అనుభవించింది. బాదేర్ తోరూ చనిపోయిన తరువాత వ్రాస్తూ, కలకాలమూ ఆ వర్ణన నిలిచిపోయే విధంగా ఆవిడను వర్ణించగలిగింది.

"తోరూ ఉత్తరాలలో నిష్కాపట్యమూ. అర్థవత్త్వమూ, మనస్సును ఆకర్షించే మంచితనమూ, సారళ్యమూ అన్నీ పరిపూర్ణంగా ఉండీ, అదే ఆవిడను నా గుండెకు అతి దగ్గరగా తెచ్చి నన్ను ఆకర్షించాయి" – అని వ్రాసుకుంది బాదేర్.

# 8. అకాల మరణం

దత్తు కుటుంబమంతా ఇంటికి తిరిగి వచ్చాక అరూ తోరూలు వ్రాసిన ఫ్రెంచ్ కవితల అనువాదాలను సేకరించి బెంగాల్ పత్రికకు ప్రచురణ కివ్వడంలో కొంతకాలం గడిచిపోయింది. తోరూ అనువాదాలు అదేపనిగా రాసాగాయి. అరూ వ్రాసినవి చాలా కొద్ది. 1874 మొదట్లో ఈ అనువాదాలు బెంగాల్ పత్రికలో ప్రచురింపబడడం మొదలైంది. ఉత్సాహకరమైన కల్పనా, బుద్ధి మహితమైన శ్రమా, ఎక్కువై, తోరూను ఆరోజుల్లో కలల్లో కరిగించి ఉద్రేకంలో ఊపి వేసేది. ఈ నలభై అయిదునెలల ఏకాంతవాసంలోనూ, ఆవిడ సాధించిన ఫల మేమిటో తలుచుకుంటే అ బలహీనమైన శరీరం ఎందుకంత తొందరగా నిర్జీవమైపోయిందో మన కర్థంకాక మానదు.

1874 మొదట్లో అరూ తోరూల కిద్దరికీ జబ్బు చేసింది. తోరూకు క్షయ రోగపు చిహ్నాలు అప్పుడే మొదలైనయి. మార్చిలో మేరీకి మూడు నెలల తర్వాత తోరూ ఉత్తరం వ్రాసింది. అప్పుడే ఆవిడ కొద్దిగా కోలుకొంటున్నది. "దగ్గు కొంచెం తగ్గింది. కొంచెం ఒళ్ళు కూడా చేశాను. బెంగాల్‌లోని తీవ్రమైన వేసవి యెండలవల్ల నాకు చాలావరకూ నయంగానే ఉంది. కాని అరూ ఆరోగ్యంలో ప్రోత్సాహకరమైన మార్పేమీ లేదు."

ఉన్నట్లుండి అరూ చనిపోయింది. గుండెలు పగిలి విలపించే ఈ దత్తు కుటుంబ మంతా కేవలం నమ్మకంతో భగవంతుణ్ణి ఆశ్రయించక తప్పలేదు.

ఆ నమ్మకమే తోరూలో ఆత్మబలాన్ని కలిగించి ఉత్సాహాన్ని ప్రోది చేసింది. అందువల్లనే సాహిత్య రంగంలో రెండింతలుగా ఆవిడ శ్రమించగలిగింది. తన సోదరికి పట్టినగతే తనకూ పట్టక తప్పదన్న సత్యాన్ని తోరూ గ్రహించక పోలేదు. సెప్టెంబర్‌లో రామ్‌బాగన్ నుండి మేరీకి ఉత్తరం వ్రాస్తూ, "ఇంతకంటే ముందుగా నీకు ఉత్తరం వ్రాయలేక పోయాను. భగవంతుడు అరూను మన మధ్యనుండి తీసుకుపోయాడు. ఇది మా కొక కఠిన పరీక్ష. అయినా ఆయన ఎట్లా తలిస్తే అదే జరుగుతుంది. ఆయన ఏపని చేసినా మన మంచికే అన్న విషయం మాకు తెలుసు. అరూ మమ్మల్ని జూలై 23 న వదలి వెళ్ళి పోయింది. అప్పుడు పొద్దున్న 11 గంటలు. బాగా అన్నహితవు లేకపోవడం, నిస్సత్తువ, జ్వరం వంటి లక్షణాలతో బాధపడినా, అరూ చివరిక్షణంవరకూ ప్రశాంతంగా ఆనందంగా ఉంది. మా తోటలో వంతెన దగ్గర మా అన్న పక్కన అరు కూడా విశ్రమించింది. తను లేకుండా మాకంతా బిక్కు బిక్కు మంటూ ఒంటరితనం ఎప్పుడూ తుళ్లుతూ ఆనందంగా ఉండే ఆవిడే మా కుటుంబానికంతా జీవితమూ, ఆత్మా కూడా! అప్పుడప్పుడూ మమ్మల్ని తల్చుకుంటుండూ!"

ఆ సంవత్సరారంభంలో తోరూ అరూ లిద్దరూ అనారోగ్యంలో బాధ పడుతున్నా సాహిత్య వ్యాసంగంలో ఎప్పుడూ మునిగి తేలుతుండేవాళ్ళు. అరూ ఏడు ఖండికల్ని బెంగాల్ పత్రికకు పంపించింది. 'షీఫ్' లో కూడా ఆవిడ పద్యాలు చేర్చడం జరిగింది. అరూ అనువదించిన విక్టర్ హ్యూగో రచన మార్నింగ్ సెరెనేడ్ 1874 ఏప్రిల్‌లో ప్రచురింపబడ్డది. ఎడ్మండ్ గాస్ దీన్ని చూచి పొరపాటుగా తోరూ రచన అనే భావించాడు. తోరూ వ్రాసిన హిందూదేశ పౌరాణిక కథా గేయాలకు ఆయన ఆముఖాన్ని వ్రాస్తూ దీన్నే పూర్తిగా ఉదాహరించాడు. షీఫ్‌ను గురించి ఎక్జామినర్‌లో విమర్శ వ్రాస్తూ దీన్ని తోరూ రచనగా పేర్కొన్నాడు.

> **ఇంకా తలుపులు మూసుకునే ఉన్నావా ?**
> **దూరంగా తూర్పు వెలుగుతోంది.**
> **తాజాగా స్వేచ్ఛగా ప్రాభాత వాయువు**
> **వీస్తోంది !**

గులాబీలను మేల్కొలిపే సమయం
నిన్ను గూడా నిదుర లేపలేదా
ప్రేమా వెలుగూ పాటా
ప్రతిదీ నీకోసమే చూస్తోంది

పైన ఎర్రగా దృఢంగా
ఆకాశంలో వెలిగే కాంతి
బలంగా వియోగంతో అరిచే
ఈల పురుగుల పాట
నా గుండెల్లో గూడు గట్టుకున్న
నాశం లేని ప్రేమ
అన్నీ నీకోసమే ఎదురు చూస్తున్నాయి.

ప్రకృతి గమ్యాన్ని
అందుకోలేక పోయినా
మన అదృష్టాలను
ఎందుకు మోసగించుకోవడం!

నీ ఆత్మకోసమే కాదూ
నా ప్రేమ రూపు దాల్చింది

నీ అందమంతా
నీ కళ్ళకోసమనే కాదూ

ఊరికే నిద్రపోకు
జాగ్రత్తగా విను

అదే పనిగా ఎదురు చూస్తున్నాను.
పదే పదే రోదిస్తున్నాను
ఇంతకూ ఎక్కడున్నావు నీవు!

ఇదీ అత్యుత్తమ శ్రేణికి చెందిన కవిత అనడంలో సందేహం లేదు. చిన్న పుస్తకమైన షీఫ్‌ను తెరవగానే ఈ పాదాలు చదివి 'గాస్' విభ్రమంలో మునిగిపోయాడు. గాస్ ఏక్జామినర్‌కు తరుచూ పుస్తక సమీక్షలు వ్రాస్తూ ఉండేవాడు. ఆగస్టు 1876 లో సమీక్ష చెయ్యడానికి ఏ పుస్తకాలూ దొరక్క సంగతేమిటో కనుక్కుందామని పత్రిక ఆఫీసుకే వెళ్ళాడు గాస్. పుస్తక ప్రచురణ సంస్థలేవీ మంచి పుస్తకాలు బయటికి తీసుకురాలేక పోతున్నందుకు అందర్నీ దుయ్యబడుతున్న సమయంలో పోస్టువాడు ఒక సన్నటి పేకెట్ ఇచ్చాడు. ఇండియన్ ముద్రతో ఉండి నాసిరకంగా నారింజరంగు అట్టతో ఉన్న చిన్న పుస్తకం అది. భవానీపూర్‌లో అచ్చయింది. దానిమీద "A sheaf gleaned in French Fields"—By Toru Dutt అని ఉంది. రచనగానే పేర్కొన్నాడు.

ఎగ్జామినర్ సంపాదకుడు మింటో షీఫ్‌ను గాస్ చేతుల్లో పెడ్తూ "ఇదుగో పుస్తకం! దీన్తో ఏమన్నా చెయ్యగలవేమో చూడు" అని అరిచి నంత పని చేశాడు. చూడగానే గాస్‌కు దానిమీద సదభిప్రాయం కలగలేదు. పీఠికగానీ పరిచయంగానీ లేకుండా నాసిరకంగా కనిపిస్తున్న ఆ 200 పేజీల గ్రంథం గతి చివరకు చెత్త బుట్టను చేరుకోవడమే అనుకున్నాడు అతను. అనుకుంటూనే దాన్ని తెరిచి మార్నింగ్ సెరినేడ్ చదివి, "కవిత ఇంత బాగా ఉంటే, వాట్‌మన్ పేపరుమీద రువేర్ ముద్రించినా ఒకటే, లేదా అలుక్కు పోయిన అచ్చులో ఏ భవాన్‌పూర్ ముద్రణాలయమో అచ్చొత్తించినా ఒకటే." అనుకోకుండా ఉండలేకపోయాడు.

షీఫ్‌లో అరూ కవితలు, గెన్‌సోల్ వ్రాసిన, 'నా ఊరు', చిరా, రిజర్ వ్రాసిన మా అమ్మ పుట్టిన రోజు, Swallows, మెమ్ వైట్ వ్రాసిన "ఆనంద ప్రయాణాలు, బందీ అయిన గంధర్వ కాంత, మొదలైన వాటిల్లో ఆవిడ మార్నింగ్ సెరినేడ్ అనువాదమే అద్భుతమైంది.

తోరూ కూడా అరూ చనిపోయేముందు బెంగాల్ పత్రికకు ఏడు అను వాదాలు పంపించింది. ఇద్దరూ కలిసి ఆ పత్రికలో ప్రచురించినవి మొత్తం పధ్నాలుగు. వాటిల్లో తోరూ ఆర్నాల్డ్ వ్రాసిన The leaf కు చేసిన అనువాదం ఎంతో మందిని ఆకర్షించింది.

కొంత పీడి పండిపోయి
ఆగకుండా పడిపోవడం
ఎక్కడికని !
శుష్క పత్రమా ఎక్కడి కని ?

గర్వంగా ఎత్తుగా ఎదిగిన
ఓకుచెట్టు ఒక్కుమ్మడి
గాలివాన తాకిడి కన్నది.

గిజగిజలాడే నన్ను
మాటి మాటికీ మార్పును కోరే
మోటుగాలి పట్టి పట్టి
పర్వతాల మీదికి విసిరేసింది.

లోయల్లోంచి అరణ్యాల్లోకి
అర్ధంతరంగా తోసేసింది
అవి నన్నెటు నడిపితే
అటే వెళ్తాను.

నాకు చెయ్యడానికి ఫిర్యాదులు లేవు

రోజాలకైనా
నాజూకు రేకులు రాలక తప్పదు

పొన్న ఆకులకైనా
ఉన్న సంగతి అదే చివరకు
మరి నా కెందుకీ వంత
ఎప్పుడూ అంటిపెట్టుకునే
ఉండాలన్న
అంతులేని చింత !

# 9. ఒక్కతి!

అరూ చనిపోయాక మెలమెల్లగా రామబాగన్‌లో వెనకటి పరిస్థితులు నెలకొన నారంభించాయి. గోవిన్ ఆయన భార్య మిగిలిన ఒకే ఒక్క కూతురూ అందరూ కలిసి తమ దుఃఖాన్ని తమలోనే గుప్తంగా జీర్ణించుకుని భగవంతుడి కోసం బ్రతకాలని స్థిరంగా నిశ్చయించు కున్నారు. తమ పనేదో తాము చేసుకుంటూ విజ్ఞాన సముపార్జనలో రోజులు గడపాలను కున్నారు. తోరూ తనకు ఇదివరకు ఏ విషయాల మీద శ్రద్ధా సక్తు లున్నాయో వాటివైపే దృష్టిని మళ్ళించు కున్నది. మేరీకి ఉత్తరాలు వ్రాస్తూ, తనకు ఇంగ్లండు మీద ఉన్న ప్రేమను వ్యక్తం చేసేది. ఆమె తండ్రికి వెస్టుమోర్‌లాండ్ అంటే చాలా యిష్టం. అందుక్కారణం వర్డ్స్ వర్త్ అక్కడి విండర్ మేర్ సరస్సు దగ్గరా కెస్విక్‌లోని సాదీ దగ్గరా నివసించాడు.

ఎంత ఎక్కువగా చదువు కోవడంలో నిమగ్నురాలైన తోరూను అప్పుడప్పుడూ దిగులూ, ఒంటరితనమూ కమ్మేస్తుండేవి. ఒక్కొక్కసారి కాలం గడపడం చాలా దుర్భర మనిపించేది. అందువల్ల ఆవిడ మళ్ళీ తన కున్న గణితశాస్త్ర పరిజ్ఞానానికి మెరుగులు పెట్టాలని సంకల్పించుకున్నది.

ఆ సమయంలో బెంగాల్‌కు దిగువన ఎక్కడ చూచినా క్షామం తాండ వించడం మొదలు బెట్టింది. ఒకచోట ఆ పరిస్థితిని గుర్తుకు తెచ్చుకుంటూ,

"స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ అస్థిపంజరాల్లా ఉన్నారు. వాళ్ళ ఎముకలు బైటికి పొడుచుకుని వస్తూ కనిపిస్తున్నాయి. వాళ్ళు అన్నం కోసం ఆశతో ఒకరిమీద ఒకరు కలబడడం చూస్తూంటే కడుపులో దేవి నట్లుగా ఉంది. పిల్లల చేతుల్లో ఉన్న తినుబండారాలను తల్లులు లాక్కుం టుండేవాళ్ళు. రోజూ దొరికే ఆ కాస్త అన్నం పప్పు కోసం వాళ్ళు రోజుల తరబడీ తోటలోనే ఉంటూ ఉండేవాళ్ళు" అని వ్రాసింది తోరూ.

1874 లో కలకత్తా వచ్చి నాలుగేళ్ళపాటు అక్కడే ఉన్న బిషప్ క్లిఫర్డ్ దత్తు కుటుంబ జీవితానికి సంబంధించిన విషయాలను చాలా ఆసక్తి కరంగా వెల్లడించాడు. క్లిఫర్డ్‌కు దత్తు కుటుంబంతో కేంబ్రిడ్జ్‌లోనే పరిచయం కలిగింది. కలకత్తాలో దత్తు కుటుంబ మంతా ప్రార్థనలు చేసే మిషన్ చర్చికి ఆయనే అధికారి. ఆ కుటుంబంతో మళ్ళీ పరిచయం కొనసాగించు కోవాలని ఆయనకున్నా, అరూ చనిపోయిన నాలుగు నెలలకుగాని ఆయన వాళ్ళ యింటికి వెళ్ళడం పడలేదు. చాలా యేళ్ళ తర్వాత హరిహరదాస్‌కు ఆయన వ్రాసిన ఉత్తరాల్లో ఇట్లా ఉంది: "ఆ కుటుంబాన్ని తరుచూ నేను కలుసుకుంటుండే వాడిని. ఎప్పుడూ వాళ్ళ సాహచర్యం నాలో సంతోషం కలిగిస్తుండేది. గోవిన్ దత్తు ధనికు డయినా చాలా సంస్కార భావాలు కల వాడు. సాహిత్యానికీ, సమాజ శ్రేయస్సుకూ జీవితాన్ని అంకితం చేసిన వాడు. ప్రా క్పశ్చిమ భాషలతో సమాన పరిచయం కలిగిన భాషావేత్త. దత్తు భార్య ఎప్పుడూ బెంగాలీయే తప్ప, మరో భాష మాట్లాడుతుందని నే ననుకోను. అయినా ఆవిడకు కొంతవరకూ ఇంగ్లీషు బాగా అర్థ మయ్యేది."

కొన్ని నెలల తర్వాత దత్తు కుటుంబ మంతా బాగ్‌మరీ తోటలోని ఇంటికి మకాం మార్చింది. కాని వాళ్ళ కక్కడ ఉండడం మొదట మొదట దుర్భర మనిపించేంది. అక్కడి ప్రతి అడుగూ, ప్రతి మూలా అరూను జ్ఞాపకం తెస్తుండేవి. అరూ మొత్తం ఆ యింటి నంతటినీ మధురస్మృతులతో నింపి వేసింది.

తోరూకు అప్పుడు సంస్కృతం నేర్చుకోవాలన్న కోరిక తీవ్రంగా వేధించడం మొదలు పెట్టింది. హిందూ దేశానికి సంబంధించిన ఈ ప్రాచీన భాషను నేర్చుకోవడంలో తన కూతురికి తగిన ప్రోత్సాహ మివ్వడానికి గోవిన్ తహతహ లాడేవాడు. తనకూ, తన కూతురికీ మధ్యనున్న బంధం దీనివల్ల ఇంకా దృఢపడుతుందని ఆయన భావించేవాడు. ఇద్దరూ కలిసి సంస్కృతాన్ని అధ్యయనం చెయ్యడం వల్ల నిజంగానే ఆ తండ్రీ కూతుళ్ళ మధ్య గాఢమైన అనుబంధం పెరిగింది. తోరూ ఆ విషయాన్ని తాను వ్రాసిన రెండు కవితల్లో స్పష్టంగా వెల్లడించింది. అవి రెంతూ 'A Mon Pere' అనే తోరూ సొంత కవితా, The Tree of life" అన్న మరొక ఖండికా! జీవన వృక్షం 'కథాగేయాల్లో' చేరిన కవిత. ఇది భారతీయ సాహిత్య సంపుటంలో పూర్తిగా ఉటకింపబడ్డది.

# జీవన వృక్షం

పట్టపగలు ముసిరే అలసట
రెప్పలు వాలినా దాపుకురాని నిద్దుర
నా తండ్రి చేతుల్లో నా చేయి
ఆయన సామీప్యం అనుభవ మౌతుండగా
గంటల తరబడి
ఇద్దరమూ నిశ్శబ్దాన్ని భజిస్తూ!

ఆంతర్యంలోని ఆలోచన లన్నీ
అవశ్యం రెండోవాళ్ళకు
అవగత మే!
మాటల్తో అవసరం లేని
మే మిద్దరమూ!
ఉన్నట్లుండి అద్భుతంగా
వెలుగొక్కటి వెలిగింది.
కళ్ళముందు దృశ్యాలన్నీ
కదలసాగాయి చకచకా!

అదో పెద్ద మైదానం
అనంతంగా అన్ని వేపులా
విస్తృతంగా వ్యాపించిన
ఎంతో పెద్ద మైదానం!
అంతటా అలముకునే
వింత వెలుగుల సౌందర్యం.

నిర్మేఘ గగనం మీద
నిర్మలంగా ప్రకాశించే
నక్షత్ర కాంతిని బోలి

పొగమంచు కమ్ముకుంటున్న
చలికాలపు నిశావేళ
మంచు బయళ్ళమీదంతా
మిలమిల లాడే కాంతిని బోలి

అద్భుతంగా ప్రసరించే
అక్కజమైన వింత వెలుగు.

వెలుతురులో రాణించే
అతి చిక్కని శబ్దరాహిత్యం!

ఆ మైదానం మధ్యన
కళ్ళముందుగా చెట్టొకటి!
మేలుకునే ఉన్నందున
కల ఏమో అనలేను.

అన్నివైపులా వ్యాపించిన
కొమ్మలతో కూడిన వృక్షం
కొమ్మలనిండా కంటికింపుగా
చిత్రవర్ణ పత్రాల సందడి!

మిలమిలా వెండిలా మెరిసే ఆకులు
మిరుమిట్లు కొలిపే బంగారపు రేకులు
అద్భుతమైన కాంతుల్ని
అభివర్ణించడానికి
చాలని మాటలు!

చెట్టుపక్క నిలబడిన దేవత
చిన్నచిన్న రెమ్మల్ని చేర్చాడు

అలవోకగా అన్నిటినీ కూర్చి
తల చుట్టూ అలంకరించాడు

మృదువైన చిగుళ్ళ స్పర్శకు
అదిరే కణతలు ప్రశమించాయి
అవయవాల్లో జ్వరప్రకోపం
మెలమెల్లగా నశించింది.

"మా నాన్న తలకు కూడా
మరికొన్ని ఆకులు చుట్టు"
ఆత్రంగా అరుస్తూ నేను!
చిన్న ఆకుతో దేవత
నాన్న నుదుటిని స్పృశించాడు.

ఆ దేవత ముఖంకంటే
అందమైన ముఖాన్ని
అంతకుముందు చూడలేదు నేను.
అంత పవిత్రమైన ముఖాన్ని
అనంతమైన జాలి నింపుకుని
అమర ప్రేమతో తొణికిసలాడే
అటువంటి ముఖాన్ని
అంతకు ముం దెప్పుడూ చూడలేదు నేను.

విస్మయాన్ని నింపుకుంటూ
వీక్షిస్తున్న నేను!
విడివడిన రెప్పలమాటున
నిండుగా కన్నీళ్ళ సందడి
నీటి తెరల మసకల్లోపల

లీలగా కదలాడే లోకం
మంచు దట్టంగా పరచుకున్న వేళ

మాయమయ్యే నక్షత్ర కాంతిలా
వడివడిగా కరుగుతున్న
వెలుగు రేకల విన్యాసం
ఆ దేవత ముఖం మరుగుపరుస్తూ
తరిగిపోయే మందకాంతి.

అక్కడ దేవతకు మారుగా
మంచం పక్కనే కూచుని
ఎంతో ఓరిమిని కూర్చుకుని
నన్నే పరికిస్తున్న మా నాన్న !
పొందికగా
నా చేతుల్ని
తన చేతుల్లో పొదువుకున్న
మా నాన్నే
కనిపించాడు నాకు !

తాత్త్విక చింతన వైపుకు మొగ్గుతున్న ఈ కవితే తోరూ కవితల్లో కెల్లా గొప్పదని నా ఉద్దేశం. ఇందులో ఆవిడ స్పష్టం చేసిన తాత్త్విక దర్శనం, బ్లేక్ కించిత్తుగా స్పృశించిన ఆధ్యాత్మిక ప్రపంచంతో సరిపోలు తున్నది. ఆనంద ప్రపంచపు అంచుల్ని చూస్తున్న క్షణంలో. తన తండ్రికి కూడా అటువంటి దశ కలగాలని ప్రార్థించడం చూసే, ఆవిడ తాను తన తండ్రికి దూరమౌతాననీ అతడు ఒక్కడే విచార నిమగ్నుడై నిలిచిపోతాడనీ ఎంతగా అహర్నిశలూ విచారించిందో తెలుస్తుంది. ఆయనకా 'తాత్త్విక దర్శనం లేదు. అంతా కలగలేదు.

తోరూ కవితల్ని, ఆవిడ ఫ్రెంచ్ నవలల్ని, చదువుతూ ఉంటే ఆవిడ ఉండి ఉండీ మరో ప్రపంచ పథంలోకి జారిపోతున్నట్లుగా అనిపిస్తుంది.

రోజు రోజుకూ చిక్కి శల్యమై గంభీరంగా మారిపోయిన తోరూ, సోదరిని పోగొట్టుకున్న తర్వాత భగవదిచ్ఛకే తన్ను మరింత విధేయురాలినిగా చేసుకుంది, అప్పుడే తనకూ భగవంతుడికీ మధ్యనున్న కదేకతను గుర్తించసాగింది. అందుకనే ఆవిడ కవిత్వం మిక్కిలి హృదయ స్పర్శిగానూ, తీవ్రంగానూ ఉండి, అప్పటికప్పుడు హృదయాన్ని చీల్చుకుని వచ్చినట్లుగా కనిపిస్తుంది. అందుకు, ఆవిడకూ, అజ్ఞాత తత్త్వానికీ మధ్య నెలకొన్న మార్మికమైన సంబంధమే కారణ మని చెప్పవచ్చు. మనిషికీ దైవానికీ మధ్యనున్న ఈ సంబంధం పదే పదే మనకు కనిపిస్తుంటుంది. అభౌమమైన బలంతో ఆవిడ కవిత సరళంగా సాగిపోతూ పరిపూర్ణ వికాసంతో అలరిస్తుంది. ఆవిడ, తన 'కథా గేయాల'లో -ఈ ప్రపంచంలోని కూతుళ్ళూ కొడుకులూ భగవంతుడితో ఎటువంటి సంబంధం కలిగి ఉంటారో తెలుసుకునేందుకు పూర్తిగా ప్రయత్నించిందని చెప్పవచ్చు. సావిత్రి మృత్యుర్యధిపతి యముణ్ణి అనుసరించి తన భర్త ఆత్మను తిరిగి తెచ్చుకోవాలని ప్రయత్నించింది. అవిడకు ఎదురుగా భయంకరంగా సాక్షాత్కరించిన యమధర్మరాజంటే భయం లేదు. పై పెచ్చు

"మంచితనాని కున్న బలం
చాలా గొప్పది
దాని ప్రభావం ఎప్పుడూ
మా మీద ప్రసరించాలనే
మా ప్రార్థన"

అని ఎలుగెత్తి చాటింది. చివరకు మృత్యువు కూడా మంచితనం పోతపోసిన రూపమే.

"భయానికక్కడ తావులేదు
విసుగే లేదక్కడ
నా అంచనా
ఓ మృత్యూ!
అదే ఎప్పుడూ!"

అంటూ రాజర్షి తన ఆత్మమీద స్పష్టమైన అధికారాన్ని సంపాదించడానికి ప్రయత్నించాడు.

తోరూ కథా గేయాలలో ఈ తాత్త్వికచింతన నిండి ఉంది. మృత్యువు ప్రాణత్యాగ భయాన్ని కొనిరాదు. జీవనకాంతి సందోహంతో పునర్జన్మను ప్రసాదిస్తుంది. సెంట్ జాన్ చెప్పినట్లుగా మృత్యువు చీకట్లో మెరుస్తుంది. తనంతట తానే వస్తుంది. దానికి స్వాగతం పలికినవారంతా భగవంతుని బిడ్డలుగా గుర్తింపబడ్డవారు.

తోరూ కవిత లెన్నో బెంగాల్ పత్రికలో ప్రచురింపబడ్డాయి. అరూ మరణించిన తర్వాత కూడా Poets corner లో తరుచూ ఆవిడ కవితలు T. D. అనే పొడి అక్షరాలతో కనిపిస్తుండేవి. ఆ సమయంలోనే రెండు మూడు లఘుకావ్యాలు ప్రచురింపబడ్డాయి. అందులో గంభీరతా, హాస్య స్ఫోరకతా తక్కువ కావడం మూలాన అవి ఆవిడకు చెందిన శ్రేష్ఠమైన రచనలుగా చెప్పడానికి వీలు లేదు. ఆవిడ పూర్తిగా కాల్పనిక రచయిత. అందువల్ల వాటిల్లో తోరూ ప్రతిభ ప్రకాశించలేదు.

తోరూకు లి. కాంటే డిలైల్ అంటే ప్రత్యేకాభిమానం. 1874 చివర్లో బెంగాల్ పత్రికలో అతని మీద ఒక వ్యాసం ప్రచురించింది. ఆ వ్యాసంతో పాటు ఆయన కవితల్ని కూడా కొన్నిటిని అనువాదం చేసింది. ఆయన కవిత "లామార్టే డి వాల్మీకి" ఏ భారతీయుణ్ణైనా ఆకర్షించడం సహజం.

ఎడ్మండ్ గాస్ ఇలా వ్రాశాడు – ఈ ఆంగ్లానువాదాలతో కూడిన పరిశీలన తర్వాత జోసిఫిన్ సోలెరీ మీద పరిశీలన కూడా వచ్చింది. అందులో తోరూ పరిశీలన పరిపక్వమైన విచక్షణా దృష్టితో కనిపిస్తుంది. వాటినిండా, మిక్కిలి బలమై చికిలీ చేసినట్లున్న పనితనంతో, ఆసక్తికరమూ, కరుణాత్మకమూ అయిన తత్త్వం నిండిన వ్యాసాలే. 20 ఏళ్ళ అరూ జూలై 1874 లో చనిపోయిన తర్వాత తోరూ రచనా వ్యాసంగమంతా ఏకాంతతతో నిండి కనిపిస్తుంది.—"

1874 డిసెంబర్ 15 న మేరీ మార్టిన్‌కు వ్రాసిన ఉత్తరంలో తోరూ, "నాన్నగారు ఫ్రెంచ్ కవుల అనువాదాల నన్నిటినీ ప్రచురిస్తా మన్నారు. కాని ఆ పనికి రెండు వందల ఖండికలైనా జమ కావాలి. మిస్టర్ డే సంపాదకత్వం వహించిన బెంగాల్ పత్రికకే నే నిప్పుడు నా అనువాదాల నన్నిటినీ పంపిస్తున్నాను. అనుకున్న సంఖ్య పూర్తయిం తర్వాత నాన్న వాటిని సంకలనంగా ముద్రించా లనుకుంటున్నారు.—"

బెంగాల్ పత్రికలోనే తోరూ హెన్రీలూయీ వివియన్ డిరోజియో మీద తాను వ్రాసిన వ్యాసాన్ని ప్రచురించింది.

ఆ పత్రికను విమర్శిస్తూ తోరూ ఒకసారి 1875 లో మేరీ మార్టిన్‌కు ఇట్లా వ్రాసింది. "ఈ విచిత్రం చూశావా! బెంగాల్ పత్రిక డిసెంబర్ సంచిక ఇంకా రానేలేదు. కలకత్తాలో ముద్రాపకులు చూడు ఎంత నచ్చుగా ఉన్నారో!"—

1874 చివర తోరూకు మళ్ళీ చాలా జబ్బు చేసింది. ఎప్పుడూ వదల కుండా జ్వరం కళ్ళలో రక్తం పడడం, వీటితో ఆవిడ మంచం పట్టింది. అయినా ఆవిడకు విదేశ ప్రయాణం చెయ్యగలననే ఆశ వదలలేదు. డాక్టరు కూడా వచ్చే వసంతకాలానికి, వెళ్ళడానికి వీలవుతుంది లెమ్మని చెప్తుండే వాడు!

# 10. 1875 వ సంవత్సరం

జనవరి ఒకటో తేదీన నూతన సంవత్సర శుభాకాంక్షలను తోరూ తన నెచ్చెలి మేరీకి అందించింది. కాని ఫిబ్రవరిలో మళ్ళీ బాగా జబ్బుపడ్డది. వసంతకాలానికి ఆవిడ విదేశయానానికి అవసరమైన ఏర్పాట్లేవీ మొదలు కాలేదు. తోరూ ఆరోగ్యం సరిగా లేకపోవడంచేత ఆ సంవత్సరానికి ఆ ఆలోచనే మానుకోవలసి వచ్చింది. ఆ రోజుల్లో తోరూ ఎలిజబెత్ బారెట్ బ్రౌనింగ్ కవిత చదవడంలో మునిగిపోయింది. వాళ్ళమ్మగారు ఆ కవితా సంకలనాన్ని తోరూ కిచ్చింది. బ్లీక్ హౌస్ కూడా చదువుతుండేది. బెంగాలు పత్రికకు అనువాదాలు పంపుతుండేది. అప్పుడే ఆమెకు ఇంగ్లండునుండి కొత్త పుస్తకాలు వచ్చి చేరాయి.

వేల్సు యువరాజు 7 వ ఎడ్వర్డు నవంబర్‌లో భారతదేశానికి రాబో తున్నాడు. ఆ రాకకోసం ఎదురుచూస్తూనే తోరూ, ఆయన వస్తున్నందుకు కలిగే సంచలనాన్ని గురించి వ్యాఖ్యానిస్తుండేది. జులైలో తోరూ నాయనమ్మ చనిపోయింది. తోరూ ఎక్కడికీ కాలైనా కదపడానికి వీలు కాకుండా ఆవిడ ఛాతీమీద ప్లాస్టర్ పట్టీ వేశారు. ఆ రోజుల్లో ఛాతీకి సంబంధించిన జబ్బులన్ని

టికి అదే సంజీవనిలా పని చేస్తుందని నమ్మేవాళ్ళు. అయితే ఆ చికిత్స చాలా బాధాకరమైనది.

సెప్టెంబర్ నాటికి కలకత్తా అంతా ఎక్కడ చూచినా ఒకటే కోలాహలం. వేల్సు యువరాజు రాకను గురించే ఆ సంభ్రమమంతా. గోవిన్ చందర్‌ను స్వాగత సంఘంలో సభ్యుడుగా ఉండమని కోరారు. అవలా ఉంచితే మిగతా జీవిత మంతా చాలా ప్రశాంతంగా మామూలుగా ఉండేది. రోజూ చేయవలసిన పనుల్ని తోరూ ఒక క్రమంలో రూపొందించుకున్నది.

"ఇక్కడ మాకు రోజులు మామూలుగా సాగుతున్నయ్. నాకు ప్రత్యేకించి రాయడానికి ఏ విషయాలూ కనిపించడం లేదు. నేను రోజూ తెల్లవారు ఝామున 4–30 కు లేస్తాను. రెండు కప్పుల చాకొలెట్ తయారు చేస్తాను. అందులో ఒకటి మా నాన్నకూ, ఇంకొకటి నాకూ. తర్వాత నేను బట్టలు మార్చుకుని బయటికి వచ్చేసరికి అమ్మా నాన్నా కనబడతారు. నాన్న చుట్ట కాలుస్తుంటారు. అక్కడనుండి డాబాపైకి వెళ్తాను. ఆ ప్రాతర్వేళ అక్కడ చాలా చల్లగా ఉంటుంది. తర్వాత మా 'బాగెట్టీకి' 'పినూ' కూ వేయించిన చేపల గ్రాసం ఇచ్చేస్తాను. తిరిగి కిందికొచ్చి పొందిగ్గా నా గదిలో ఉన్న కిటికీలో కూచుంటాను. ఆ కిటికీ కిందే మా గుర్రాలు 'జంటిల్' 'జానెట్లు' దాణా తింటూ ఉంటాయి. వాటికి దాణాతోపాటు పెట్టే ఓటు ధాన్యపుపిండి చాలా రుచిగా ఉంటుంది. ఈ దేశంలో గుర్రాలకు వేసవిలో ఎండ దెబ్బ తగలకుండా ఉండడానికి దాన్ని పెడుతుంటారు. గుర్రాల దాణా కార్యక్రమం తర్వాత మా ఫలహార కార్యక్రమం, దాంతోపాటు అమ్మ వంటింటి కార్యక్రమమున్నూ! తర్వాత నేనో పుస్తకం పట్టుకుని కూచుంటాను. లేదా కాసేపు మా పిల్లి పిల్లల్తో ఆడుకుంటాను. నాన్న వ్రాసుకుంటుంటారు. లేదా వార్తాపత్రిక చదువుతూ అదే పనిగా వార్తలు ప్రసారం చేస్తుంటారు. 12 గంటల కల్లా మా భోజనం తయారు. దాం తర్వాత మూడు గంటలదాకా నా చదువూ లేదా వ్రాత కార్యక్రమం సాగుతుంది. అప్పుడే నేను ఒక సీతాఫలమో ఒక బత్తాయి పండో తింటాను. 5 గంటలకు ముస్తాబై బయటికి వెళ్తాము. సాధారణంగా నే నట్లా కొంతదూరం తిరిగి రావడానికీ, మా అమ్మా నాన్నా, మా చిన్నాన్న తోటకి వెళ్తారు. 7 గంటల కల్లా మా భోజనం అయిపోతుంది. 8–30 కి మళ్లీ ఒక కప్పు టీ తాగుతాము. 10 గంటలకు ఇక పడుకోవడమే!"—

యూజినీ మాన్యుల్ వ్రాసిన ఆత్మ చరిత్రను తోరూ అనువదించింది. అందులో భగవంతుడి అదృశ్య హస్తం పనిచేసే పద్ధతి ఆత్మకూ పరమాత్మకూ ఉండే అనుబంధం వెల్లడించడంలో తోరూ తనకుండే ఆసక్తిని చక్కగా వ్యక్తం చేయగలిగింది.

గోప్యంగా గుంపులో నుండి
ఆత్మ నొకదాన్ని
పరమాత్ముడు పరిగ్రహిస్తాడు.
విచారాన్నుండి లోపాలనుండి
మెల్లగా ముందుకు నడిపించి
నిబ్బరంగా గమ్యాన్ని చేరుస్తాడు.
అనంత గంభీర గమ్యస్థలాన
మహోన్నత స్తంభానికి గుచ్చబడిన
చిరుసూదిలాంటి ఆత్మను చూచి
చిరునవ్వు నవ్వుకుంటాడు దేవుడు
తన పనికి మురుసుకుంటాడు
ఆత్మను అతి వేగంగా ముందుకు నడిపే
పరమాత్ముడు!

యువరాజు గౌరవార్థం కలకత్తా మైదానంలో పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగాయి. బాణా సంచా కాల్చి సంబరం చేయాలని నిర్ణయమైంది. "1869 లో డు డ్యూక్ ఆఫ్ ఎడింబరో ఇక్కడికి వచ్చినప్పుడు దాదాపు తొమ్మిది వేల ప్రేక్షకులు బాణాసంచా కాల్చారట. "డబ్బును బూడిద చెయ్యడ మంటే ఇదేగా!" అన్నది తోరూ.

తోరూను వాళ్ళనాన్నగారు గుర్రపు పందేలకు తీసుకు వెళ్తానన్నారు. నాకు వెళ్ళాలని ఎంతో ఉబలాటంగా ఉంది సుమా అనుకుంది ఒకసారి తోరూ.

తోరూ పుస్తకం పూర్తయింది. దాని పేరు "ఫ్రెంచ్ క్షేత్రంలో మెరిసే కంకులు" ఈ కింది గేయం దేనికీ అనువాదం కాదు. తోరూ సొంత రచన.

చాలా చక్కని రచన. చాలా మంది విమర్శకులు దీన్ని ఎంతో మెచ్చుకున్నారు.

తాము పుట్టిన గడ్డమీదే
గోముగా విరిసే కుసుమాలు
తమకు చెందిన కొమ్మల మధ్యన
తళతళా మెరిసే సుమాలు
కోసీకోయక ముందే
వసివాళ్ళు వాడే కోమల తనువులు

ఎంతెంతో కష్టాని కోర్చి
దండల్లో అందంగా బంధించినా
ప్రకృతి అద్దిన రంగుల్ని జార్చి
వికృతంగా వాడుముఖం పడతాయి

కానేపు సూర్యకాంతీ
కానేపు మేఘచ్ఛాయా
ఆవరించే లోయల్లోపల
కలకలా విరిసే స్వర్గం లోపల
కలతకు దూరంగా తిరగడం
అందిన పువ్వుల్ని ఏరుకుంటూ
పొందిగ్గా దాచుకోవడం
ఎంత ఆనందాన్ని
కలిగిస్తుంది!

కుసుమాపచయాన్ని
విసు వెరుగక చేసేవేళ
మృదువైన రంగులన్నీ
కదలాడి చెదిరే వైనం

మిరుమిట్లు గొలిపే మెరుగులు
మందంగా మారే చందం
నాకంటే వివరంగా
ఏ కంటికీ అంతుపట్టదు.

చిత్రవర్ణ శబలితంగా
పుష్ప పత్రాలు విచ్చుకోవడం
స్పష్టంగా ఎరిగినదానివి
కొత్త ఊపిరి వాటినిండా
నింపగలవా మళ్ళీ నీవని
ప్రశ్నించుకో జ్ఞాపకాలను !
తడబడుతున్న ఈ కలానికి
తోడుగా నిలిచేదే అది !

ఆ పుస్తకం పూర్తయిపోయింది కాబట్టి తోరూకు చెయ్యవలసిన పనేమీ కనపడలేదు. ఎప్పటినుండో అనుకుంటున్న సంస్కృతాధ్యయనాన్ని ప్రారంభించింది. తండ్రీ కూతుళ్ళు సంస్కృతం చదవడంలో మునిగిపోయారు. డిసెంబరు నాలుగున పాఠాలు ఆరంభమయ్యాయి. తోరూ కోరికల్లా, రామాయణ మహా భారతాలను సంస్కృతంలోనే చదవాలని !

మామూలుగా తోరూను చూడడానికి ఎంతోమంది వస్తుండేవాళ్లు. ఇంగ్లండునుండి మిస్. అడాస్మిత్ అనే ఆవిడ కలకత్తాకు వచ్చింది. దత్తు ఆమెను బాగ్‌మరీకు తీసుకొచ్చారు. తోరూ మేనత్త ఆవిడకు Casket of Gems ను చూపించింది. మిస్ స్మిత్‌ను ఆ తోటా ఆ యిల్లూ పారవశ్యంలో ముంచివేశాయి. ఇటువంటి భూలోకస్వర్గంలో నివసిస్తూ ఆనందం అనుభవించక, ఈ కుటుంబం ఇంగ్లండు వెళ్లాలని ఎందుకు తహతహలాడుతున్నదో అని ఆవిడ ఆశ్చర్యంలో మునిగిపోయింది.

యువరాజు ఆగమనానికై అన్ని ఏర్పాట్లూ పెద్ద ఎత్తున జరుగసాగాయి. డిసెంబరుకల్లా రాజులూ మహారాజులూ కలకత్తా చేరుకున్నారు. కోటకూ, సిపాయిల సాలకూ రంగులు వేసి అలంకరించారు. ఎక్కడ చూచినా

అందంగా కనపడేటట్లు పెద్ద పెద్ద ఆర్చీలు కట్టారు. ఇంత సంరంభమూ ఆ యువరాజు ఒక్క వారం రోజు లుండడానికి మాత్రమే. అందులో ఒక రాజు ముత్యాలూ రత్నాలూ పొదిగిన నిలువు టంగీని తయారు చేయించు కున్నాడు. దాని ఖరీదు పదిహేను లక్షలు. యువరాజు తన సంస్థానంలో ఉన్నప్పుడు మరో ముప్పై లక్షలు ఖర్చుపెట్టడానికి ఆయన సర్వసన్నాహాలూ చేసుకున్నాడు.

గోవిన్‌చందర్ తోరూ ఫ్రెంచ్ అనువాదాలను ఒక ప్రచురణకర్తకు చూపించాడు. కాని కలకత్తా ప్రచురణ కర్తలకు జంకు జాస్తి. తొందరగా చొరవ తీసుకోలేరు. ఆ ప్రచురణకర్త గోవిన్‌కు మరొకర్ని చూపించాడు. అట్లా పుస్తకం ప్రచురిత మయ్యే ఆశ తీరకుండానే మరో సంవత్సరం గడిచి పోయింది. తోరూ మనసంతా సంస్కృతాధ్యయనం మీదనే ఉంది. భాషలు నేర్చుకోవడంలో ఆవిడ కున్న చాతుర్యంవలన, చాలా తొందరగానే సంస్కృతం నట్టుపోకుండా చదవడం వచ్చేసింది. కాని ఇంతా చేసి ఒక పది నెలలపాటు మాత్రమే ఆవిడకు సంస్కృతం చదవడానికి వీలు కుదిరింది. రోజు రోజుకూ క్షీణించిపోతున్న ఆరోగ్యంవలన వైద్యులావిడను పై సంవ త్సరం సెప్టెంబరు వరకూ ఎక్కువగా చదవకూడదని ఆంక్ష పెట్టారు. అందువల్ల సంస్కృత పఠనంమీద తనకున్న అభిలాషను తోరూ అణచి పెట్టుకోవలసి వచ్చింది.

సంస్కృతం చాలా కష్టమైన భాష అనీ ఎంత కష్టమైనాసరే తాను దానిమీద ఆరేడు సంవత్సరాలలో అధికారం సంపాదించ దలచాననీ తోరూ తన స్నేహితురాలికి వ్రాసుకున్నది. సంస్కృతం చెప్పే పండితుడు తనకా భాష నేర్చుకోవడంలో ఉన్న పట్టుదలను మెచ్చుకున్నాడనీ, తాను తప్ప కుండా ఈ విషయంలో ఘనవిజయం సాధించగలననే అభిప్రాయం ఆయన కున్నదనీ కూడా వ్రాసింది. సమయం లేదు కాని, ఉంటే తోరూ సంస్కృ తంలో ఎంత గొప్ప పండితురాలై ఉండేదో! ఆవిడ మళ్ళీ July 1976 లో ఇట్లా వ్రాసింది: "నేను సంస్కృతం మానేయదలచుకున్నాను. వ్యాకరణం చాలా కష్టంగా ఉంది. ఋజుపథంలో మూడు భాగాలు పూర్తి చేశాను. కాళిదాసు శాకుంతలం మొదలుపెట్టాలి"—

కాని అతి త్వరలోనే ఆవిడ చదువు మూల పడిపోయింది.

# 11. ఇరవై ఏళ్ళప్పుడు

యువరాజు రావడం పోవడం రెండూ జరిగాయి. కలకత్తా అంతా స్తబ్ధంగా నిద్రపోతున్నట్లుగా అయిపోయింది, ఆయన వెళ్ళిపోయిన తర్వాత. తోరూ జనవరి 13 న 1876 లో ఉత్తరం వ్రాస్తూ "యువరాజు కిందటి సోమవారం వెళ్ళిపోయారు. ఆయన్ని నేను దగ్గరగా చూచాను. చాలా సౌమ్యంగా అందంగా ఉండే ముఖం. ఆయన కళ్ళు నీలంగా ఆనందంతో తొణికిసలాడుతూ ఉన్నాయి" అని వ్రాసింది. యువరాజు చాలా తెలుపు. కానీ బట్టతల. బెల్గాషియాలో ఓ సమావేశానికి తోరూ తన తండ్రితో వెళ్ళి యువరాజును మళ్ళీ చూచింది. భారతీయులు కుడీ ఎడమా అనకుండా ఖర్చు చేసే పద్ధతినిగూర్చి, అప్పుడే ఆయనకు చాలా వివరంగా చెప్పింది. కాశ్మీర మహారాజు ఆ సందర్భంలో 40 లక్షలు విలువచేసే తలపాగా ధరించి వచ్చాడు. ఆయన యువరాజు కిచ్చిన బహుమతుల్లో 101 కాశ్మీరు శాలువలు, నవరత్నాలు పొదిగిన బంగారు హుక్కా, టీ, భోజనం అందించడానికి అవసరమైన బంగారపు సామాను, ఇంకా ఇటువంటివే ఊహించలేనన్ని విలువైన వస్తువు లెన్నో ఉన్నాయి.

బాబూ జగదానంద ముఖర్జీ యువరాజును తన యింటికి ఆహ్వానించి తన ఆడవాళ్ళను పరిచయం చేశాడు. అది జనంలో పెద్ద సంచలనాన్ని కలిగించింది. ఘోషా పద్ధతిని కూడా కాదని ఆయన అట్లా చేయడంవల్ల అందరూ చెవులు కొరుక్కున్నారు. ఆ రోజుల్లో బెంగాలీ సమాజంలో పరదా పద్ధతి చాలా గట్టిగా అమలులో ఉండేది. ఈ చర్య ఆ పద్ధతిని సడలించిందనవచ్చు. దీనివల్ల బెంగాలీ లందరూ, మొత్తం హైందవ సమాజమంతా అవమానానికీ అత్యాచారానికీ గురియైందని భావించారు. అసలు యువరాజు ఎవరింటికీ వ్యక్తిగతమైన ఆహ్వానాన్ని పురస్కరించుకుని వెళ్ళలేదు. జగదానందుని యింటికి వెళ్ళడంలో ఓ కారణం ఉంది. జగదానందుడు తన స్త్రీలను పరిచయం చేస్తా ననడం వల్లనే ఆయన వారింటికి వెళ్ళడం

జరిగింది. జగదానందు డిట్లా చెయ్యడం క్షమించరాని నేర మని ఒక బెంగాలీ పత్రిక ఘోషించింది. తర్వాత ఈ సంఘటనమీద ఒక నాటకం ప్రదర్శింపబడ్డది. ఇది చూచి, లార్డ్ నార్త్ బ్రూక్, బ్రిటిష్ పరిపాలన పట్ల ద్వేషాన్ని రెచ్చగొట్టే ఏ నాటకమైనా ప్రదర్శనార్హం కాదని చట్టం బద్ధం చేయవలసి వచ్చింది. తోరూ ఇదంతా వ్రాస్తూ తనకు సహజమైన హాస్య ధోరణిలో అక్కడ జరిగిన సంఘటనల్ని వివరించింది. యువరాజు అక్కడుండే దిక్సూచిని చూచి, ఇదేమిటని చిన్నపిల్లవాణ్ణి అడిగాడట. ఆ పిల్లవాడు యువరాజు తన్ను ప్రశ్నించాడన్న సంబరంతో తత్తరపడిపోయి, జవాబు చెప్తూ అయనకు వేయవలసిన విశేషణాన్ని దిక్సూచికీ, దిక్సూచికి సంబంధించిన విశేషణాన్ని ఆయనకూ వాడాడట! **(A royal com-com-pass you Prismatic Highness !)**

తోరూ పుస్తకం ప్రచురణకు సిద్ధమైంది. ప్రూఫులు దిద్దడంలో ఆవిడకు చేతినిండా పనే. ఆ పని చేసేటప్పుడు ఆవిడ గమనించే ముద్రారాక్షసాలు ఆవిడకు ఎంతో నవ్వు తెప్పించేవిగా ఉండేవి. మచ్చుకు **'honour's throne'** అనే సమాసం **horror's throne** అయి కూర్చుంది. ఫిబ్రవరి కల్లా ఆవిడ పుస్తకం అచ్చు చాలావరకూ పూర్తయిపోయింది.

తర్వాత తోరూ దృష్టిని విశేషంగా ఒక ఫ్రెంచ్ పుస్తకం ఆకర్షించింది. భారతీయ వీరవనితల చరిత్రను కూర్చిన ఈవిణ్ణి ముగ్ధురాల్ని చేసింది. 'మిలేక్లారిస్ బాదర్' అనే రచయిత్రి వ్రాసిన ఈ పుస్తకాన్ని అనువదించడానికి తోరూ అంగీకారాన్ని కూడా తెప్పించుకుంది. మెల్లగా ఆవిడతో స్నేహం పెరిగింది. ఆ స్నేహం చివరకు తోరూ జీవితంలోనూ, ఆవిడ జ్ఞాపకాలలోనూ విడవరాని భాగంగా మిగిలిపోయింది. ఒకసారి తోరూ, బాదర్‌కు ఉత్తరం వ్రాస్తూ "మీరు గమనించారో లేదో, మా పురాణ కథలు ఎంత గొప్పవి, ఎంత హృదయ విదారకమైనవి, ఎంత పవిత్రమైనవి! భారతీయ వనిత భార్యగా భర్తపట్ల చూపించే భక్తి, తన్ను తాను పూర్తిగా సమర్పించుకోవడం, లొంగి ఉండడం, ఆ భర్త అసమర్థుడూ స్వార్థపరుడూ అయినా సరే! ఎంత ఉదాత్తంగా ఉంటా యా కథలు! అవిడ అతణ్ణి తన జీవన సర్వస్వంగా, దేవుడుగా నమ్మి ఆరాధిస్తుంది కదా!" అని వెల్లడించింది.

మార్చి 4 వ తేదీ తోరూ పుట్టినరోజు. అప్పటికి ఆవిడకు ఇరవైయ్యేళ్ళ వయస్సు. అయినా ఆనాడు తోరూ మేరీకి ఉత్తరం వ్రాస్తూ "నా వయస్సు

పెరిగిపోతున్నది. ఒక పార్శీ బాలిక నాకు పిల్ల లున్నారా అని అడిగింది. నాకు పెళ్ళే కాలేదు. ఈ పెళ్ళి ఉన్నదే ఇది హైందవుల కెంతో ముఖ్య మైంది. పదిహేనేళ్లు వచ్చి పెళ్ళికాని పిల్లలు సాధారణంగా ఈ దేశంలో ఉండరు. హైందవ కుటుంబాలలో ఇరవైనాలుగేళ్ళకే ఆడది అవ్వ అయి పోతుంది. నాన్నగారు పెద్దవాళ్ళైపోతున్నారు. అట్లాగే నేనున్నూ. ఒక్కో సారి నా వయస్సు మళ్ళిపోయిందనే భావన నన్ను చుట్టుముట్టుతున్నది''— అని వివరించింది. బాదర్ పుస్తకం ఫ్రాన్స్‌నుండి తోరూ పుట్టిన రోజు నాటికి అందింది. మార్చి 24 న షీఫ్ కూడా బయటకు వచ్చింది. తోరూ ఒక కాపీని మేరీకి పంపుతూ ''దీన్ని గురించి అన్ని పత్రికలూ ఏమంటాయో ఏమో అయినా కొన్ని బాగున్నట్లూ, కొన్ని బాగా లేనట్లూ వ్రాస్తా యనుకుంటాను. ఏది ఏమయినా ఓ రకమైన నిర్లిప్తతవల్ల నన్ను నేను కాపాడుకుంటానులే!'' అని వ్రాసింది.

తోరూ ఒక్కొక్కసారి తన బంధువర్గాన్ని ఘాటుగా విమర్శించేది. ''మా నాయనమ్మ కూడా క్రైస్తవ మతాన్ని అవలంబించి ఉంటే బాగుండేది. అయినా ఏం! క్రైస్తవ మతం పుచ్చుకున్న ఎంతోమందికంటే ఆవిడే చాలా నయం!''—కలకత్తాను గురించీ, అక్కడుండే హైందవ క్రైస్తవులనుగురించీ తోరూకు ఖచ్చితమైన అభిప్రాయాలుండేవి. ''ఆ రోజుల్లో ఎక్కడ చూచినా కలకత్తా అంతా కల్లోలంగా ఉండేది. హిందువుల్లోనే కాదు బెంగాలీ క్రైస్తవుల్లో కూడా ఉన్నతమైన నైతిక విధానం ఉండేది కాదు. అన్నిటికంటే విచారించ వలసిందేమంటే క్రైస్తవ మతమంటే హిందువుల కందరికీ చులకన. మను ష్యులు తమ చిత్తం వచ్చినట్లుగా పాపాలు చేసి తప్పించుకోడానికి కప్పుకుం టున్న ముసుగే ఈ మతమన్న భావన చాలామందికి ఉంది. సరే అదలా ఉండనీ, బెంగాలీ క్రైస్తవ సమాజం అవలంబించే పద్ధతులు కూడా సంతో షంగా ఉండేవాళ్ళను విచారంలోనూ, ఆశాజీవుల్ని నిరుత్సాహంలోనూ ముంచుతున్నాయి.''

దిన పత్రికల్ని విడవకుండా చదివే తోరూ ఒకసారి మేరీ కిలా వ్రాసింది. ఒక బ్రిటిష్ సైనికుడు గ్రామస్థులకు చెందిన నెమలిని కాల్చాడు. అందుకని గ్రామస్థులంతా అతని మీదికి ఎగబడ్డారు. కోర్టులో కేసు నడిచింది. ఇంతకూ కేసు ఎవరిమీదో తెలుసా! నెమలిగల ఆసామీ మీద! ఎందుకో

తెలుసా! బ్రిటిష్ ప్రభుత్వం దృష్టిలో బ్రిటిష్ సైనికుడి జీవితం చాలా విలువైంది గనుక!'' కొంతమంది బ్రిటిష్ సైనికులు తొమ్మిదిమంది బెంగాలీలను చంపారు. ఏడుగురిని గాయపరిచారు. అలాగే ఆ సైనికులు ఎన్నో అత్యాచారాలు చేశారు. బ్రిటిష్‌వాళ్ళకు వ్యతిరేకంగా దేశీయులలో తల ఎత్తుతున్న భావాలను తోరూ గ్రహించసాగింది. ఒక పిల్లవాడు తనమీదికి వస్తున్న కుక్కల్ని ప్రతిఘటించాడని న్యాయస్థానం వాడికి మూడు వారాల కఠిన శ్రమను విధించింది. ఇంతకూ ఆ కుక్క బ్రిటిష్‌వాడిది.

''పేపర్లన్నీ ఈ సిగ్గుమాలిన వ్యవహారాన్ని నెత్తిమీద నోరుపెట్టుకుని ప్రచారం చేస్తున్నాయి. న్యాయాన్ని తమ యిష్టం వచ్చినట్లుగా వాడుకుని ఆ రకంగా తీర్పు చెప్పినందుకు మేజస్ట్రేటునూ, సెషన్స్ జడ్జినీ పదవుల్లో నుండి పీకి పారవేయవలసిన మాట. ఇదే గనుక ఇంగ్లండులో జరిగి, ఒక మేజస్ట్రేటు పిల్లవాణ్ణి ఇదే పరిస్థితిలో పిండి మరలో పనికి పంపిస్తే ఎంత గందరగోళం జరిగేదో నువ్వే ఆలోచించు? ఒక ఇంగ్లీషువాడు తన సైసును చంపితే లార్డ్ లిటన్ ఎంత సులువుగా అతణ్ణి వదిలేశాడని! ఇంగ్లీషు న్యాయాధికారి దృష్టిలో హైందవుడి ప్రాణాలకున్న విలువ ఎంతో దీనివల్ల గ్రహించు! చివరకు లిటన్ ఆ బ్రిటిష్ నేరస్థుడికి దెబ్బలు తినే శిక్షనయినా అనుమతించలేదు'' అని వ్రాసింది. కాని తోరూకు లార్డ్ లిటన్ అంటే విపరీతమైన అభిమానం. ఆవిడ తాను వ్రాసిన ఫ్రెంచ్ నవలను ఆయనకు అంకితం ఇచ్చింది.

తోరూ తన ఉత్తరాల్లో హైందర శబ్దానికి బదులు 'దేశీయ' అనే విశేషణాన్నే వాడింది. భారతీయ క్రైస్తవుల్లో తమ్మె తాము బ్రిటిష్ క్రైస్తవులనుండీ, ఆంగ్లో ఇండియన్లనుండీ విడిగా చూపించుకోవడానికి ఈ పదం వాడుకలో ఉండేది. కాని బ్రిటిష్ వాళ్ళ దృష్టిలో ఆ పదానికి ఉండే అర్థం వేరు. వాళ్ళు తమనుండి నల్లజాతిని వేరుగా చూపించడానికి ఈ పదాన్ని వాడుతున్నట్లు బెంగాలీలకు కూడా విదితమే.వాళ్ళు హైందవుల్ని నిగ్గర్లని పిలిచేవాళ్ళు. అదే అర్థం వచ్చేట్లుగా 'దేశీయ' పదం వాడేవాళ్ళు. ఇది దృష్టిలో ఉంచుకునే మిస్ మార్టిన్ ఆ పదాన్ని విరివిగా వాడవద్దని తోరూకు సలహా ఇచ్చింది. దానికి తోరూ తన కృతజ్ఞతను చూపించి అక్కడనుండి ఆపదాన్ని వాడడంలో ఎంతో జాగ్రత్త వహించింది.

బ్రిటిష్‌వాళ్ళు బెంగాలీల పట్ల ఎలా వర్తిస్తున్నారో గమనించడం తోరూ కొక ఆసక్తిదాయక విషయంగా మారింది. యువరాజు గౌరవార్థం ఏర్పడిన బహిరంగసభలో వేదికమీదనున్న బంగాళీయుణ్ణి ఇంగ్లీషువాడు దురుసుగా కిందికి నెట్టడం, వెంటనే యువరాజు తన అంగరక్షకుణ్ణి పిలిచి అటువంటి అసభ్య వర్తనను ఆపించి మందలించడం తోరూ గమనించింది.

హైందవ స్త్రీల సాంఘికస్థితి భద్రతలమీద తోరూకు మరీ ఎక్కువ కాకపోయినా కొంతవరకైనా ఆసక్తి ఉంది. తనకున్న స్వల్పజీవన పరిమితిలో చదువుకూ వ్రాతకూ కాలం మినహాయిస్తే సాంఘిక సంస్కరణలకూ సంఘ సేవకూ తోరూకు కొంచెం కూడా సమయం మిగలలేదన్న మాట నిజం. ఒక సారి ఆనందమోహన్ బోస్ కలకత్తా లో తోరూను చూడడానికి వెళ్ళాడు. ఈయన్ని కేంబ్రిడ్జ్‌లో ఉండగా తోరూ ఎన్నోసార్లు కలుసుకుంది. ఆయన వెళ్ళినప్పుడు దత్తు కుటుంబం, తాను తిరిగీ యూరప్ వెళ్ళగలననే ఆశ లోనే ఉంది.

"ఆయన నన్ను యుక్త వయస్కులైన కన్యలకోసం తాను నడిపే పాఠశాలను చూడమని కోరాడు. ఆ పిల్లలంతా ఆచార నిష్ఠమైన కుటుంబా లకు సంబంధించిన వారు కాదు. బ్రహ్మసమాజానికో కేశవ చంద్రసేన్ మతానికో సంబంధించిన వారు. మేము తిరిగే యూరప్ వెళ్ళిపోతున్నామని విని ఆయన చాలా విచారించారు. నే నిక్కడే ఉంటే నాదేశ స్త్రీల విద్యా వ్యాప్తికి తోడ్పడగలనని ఆయన అనుకోవడమే అందుకు కారణం" అంటూ ఉత్తరాలు వ్రాసింది తోరూ.

ఆచారయుతమైన సంఘం విధించే ఆంక్షల బారి పడకుండా తోరూ తప్పించుకోవడానికి, ఆవిడ పుట్టిన కులమే కారణం. అందువల్ల తనతోటి స్త్రీలు ఏ సమస్యల్ని ఎదుర్కొంటున్నారో ఆలోచించడానికి ఆవిడకు ఆస్కారం లేదు. కాని తాను యూరప్‌లో పుట్టి ఉంటే ఇంకా ఎక్కువ స్వాతంత్ర్యం అనుభవించడానికి వీలయ్యేదని మాత్రం ఆవిడ అనుకుంటుం డేది. తోరూకు బెంగాలీ సంఘంతో కలిసి తిరగడానికి అవకాశం ఉండేది కాదు. కారణం అప్పుడుండే సభలూ సమావేశాలూ కేవలం పురుషులకు మాత్రమే. సాధారణంగా స్త్రీలంతా ఇళ్ళల్లోనే ఉంటూ ఉండేవాళ్ళు.

తోరూ అవసాన దినాలు దగ్గరపడసాగాయి. ఆవిడను పాడనిచ్చే వారు కారు. "నాన్న : చాలా జాగ్రత్త తీసుకుంటున్నారు. నన్నో గాజు

పెట్టెలో పెట్టండి అని విసుక్కుంటాను నేను. ఆయన అనుకుంటున్నదాంట్లో సగమైనా శక్తిహీనంగా లేను మరి!'' అంటూ వ్రాసింది తోరూ. తోరూ తండ్రి విక్టర్ హ్యూగో నవలలు తెచ్చి యిచ్చారు. తోరూ ఎన్నో ఫ్రెంచ్ పద్యాలు అనువదిస్తూ ఉండేది. అప్పటికి షీఫ్ బాగా అమ్ముడుపోసాగింది. అది ద్వితీయ ముద్రణ కొచ్చేస్తుందని ఆశ పడసాగింది తోరూ. ఆవిడ పద్యాలు కొన్నిటిని కలకత్తా రెవ్యూలో ప్రచురించడానికి ఎన్నుకున్నారు. అందుకు వాళ్ళ నాన్నగారెంతో ఆనందించారు. "నేను కూడానూ! ఎందుకంటే ఇండియాలో ఉన్న పత్రికల్లో దానికదే సాటి గనుక!'' అన్నది తోరూ.

బెంగాల్ పత్రిక తోరూను రచనలు పంపించమని అడిగేది. సోలరీ, సెంట్ చాన్, కామెటీ ది గ్రామంట్. అగస్ట్ వాక్వెరి, థియొషెల్ గెటె, వాల్టెర్, మార్నెర్, హ్యూగో రచనల్ని అనువదించి పంపుతూ ఉండేది. గోవిన్ చందర్ బెంగాల్ పత్రికలో వ్రాస్తూ, షీఫ్‌లో కేవలం సోలరీ అనువాదాలే కనిపిస్తున్నా యన్నాడు.

1876 డిసెంబర్ నాటికి తోరూ బాగా జబ్బుపడిపోయింది. ఆవిడకు వైద్యం చేసే వైద్యుడు దగ్గర లేకపోవడంవల్ల వైద్యకళాశాలనుండి స్మిత్ అనే ఆయన వచ్చి మందులిస్తుండేవాడు. ఆవిడ కళ్ళలో రక్తం పడడం ఏ మందులవల్లా తగ్గలేదు. డిజిటాలిస్ కూడా తన ప్రభావం చూపించడం మానేసింది. నరాల్లోకి ఇంజక్షన్లు ఇస్తూ ఉండేవాళ్ళు. తోరూ మేరీకి ఉత్తరం వ్రాస్తూ, "డాక్టర్ స్మిత్ మొదటిసారి నన్ను చూడడానికి వచ్చినప్పుడు అచ్చం ఒక డాక్టరు లాగానే నన్ను రోగం వివరాలు మాత్రమే అడిగాడు. ఇంతలో ఉన్నట్టుండి ఆయన కళ్ళు పక్కన బల్లమీదున్న షీఫ్ మీద పడ్డాయి. అది నారింజరంగు అట్టతో బ్రహ్మాండంగా మెరుస్తోంది. అప్పటికి ఆయన బుర్రలో ఒక్క వెలుగు వెలిగింది కాబోలు! "నువ్వేనా ఈ పుస్తకం వ్రాసింది?'' అని అడిగాడు. ఇక చూడాలి ఆయనకు నామీదా, నా రోగం మీదా రెండింతలైన శ్రద్ధ. "ఈ రచయితా ఈ పుస్తకం వ్రాసింది!'' అంటూ ఆయన బోలెడంత ఆశ్చర్యపడిపోయాడు. అంతేకాదు. ఆయన సంతోషం శ్రద్ధా చెప్పనలవి కానివి. అంటే చివరికి షీఫ్ నాకేమాత్రం చేసి పెట్టిందని గమనించగలిగావు గదా నువ్వు!'' – అంటూ ముగించింది.

# 12. ముగింపు

తోరూ జీవితంలో చెప్పుకోదగిన అంశాలలో ఆవిడకూ క్లారిసే బాదర్‌కూ మధ్య నున్న గాఢమైన స్నేహం ఒకటి. 1877 ఫిబ్రవరి 2 వ తేదీన తోరూ, క్లారిసే పుస్తకాన్ని అనువదించడానికి అనుమతి కోరుతూ ఉత్తరం వ్రాసింది. దాంతో పాటు షీఫ్‌ను కూడా పంపించింది. దానికి క్లారిసే, "నేను వ్రాసి, గాంగతీర ప్రాచీనార్యులకు అంకిత మిచ్చిన గ్రంథాన్ని అనువదించ గోరుతున్నది నేను మెచ్చే హైందవ నాయికల వారసురాలు కాబోలు!" అంటూ జవాబు వ్రాసింది. అనువాదానికి అనుమతి వచ్చేసింది. క్లారిసే వ్రాసినవి నాలుగు సంపుటాలు. హిందూ, హీబ్రూ, గ్రీక్, రోమన్ నాయికలను గురించి వ్రాసినవి. అందరిలోకీ బైబిల్లోని స్త్రీలను మినహాయిస్తే ప్రాచీన హైందవ వనితల్లోనే పవిత్రతా, భక్తి ఎక్కువగా కనిపిస్తాయని ఆవిడ అభిప్రాయపడ్డది.

"మా ఇతిహాసాలలో చిత్రింపబడ్డ నాయికలు సర్వగౌరవాలకూ, ప్రేమకూ అర్హులని చెప్పడానికి నే నెంతో గర్వపడుతున్నాను. సీత లాగా మనస్సును కదిలించి మన ప్రేమానురాగాలను ఆకట్టుకునే నాయిక ఇంకెవరైనా ఉంటారా! ఉంటారని నే ననుకోను!' అంటూ వ్రాసింది తోరూ క్లారిసేకు.

క్లారిసేను చూడాలన్న తోరూ కోరిక ఫలించ లేదు. 1877 ఏప్రెల్ 13 న తాను పూర్తిగా మంచం పట్టినట్లుగా తోరూ తన ఫ్రెంచ్ స్నేహితురాలికి తెలియ జేసింది. "నీ చిత్రాన్ని పంపుతూ నువ్వు ఉత్తరం వ్రాస్తే నాకు కొంచెం ఉపశమనంగా ఉంటుంది. మేం వేసుకున్న పథకాలన్నీ పాడైపోయాయి. ఈ ఏప్రెల్‌లో మేము యూరప్‌కు రాలేము. మనిషి ఒకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుంది కదా!" అని వ్రాసింది తోరూ. ఈ వార్త వల్ల చాలా కల్లోలం చెంది, "నువ్వు రావన్న వార్త తెలిసి నేను నిజంగా నిరుత్సాహ పడిపోయాను. నీ రచనలూ, ఉత్తరాలూ నువ్వు చాలా

సంస్కారంతో కూడినదానివనీ, ఆత్మసౌందర్యం కలదానివనీ చెపుతున్నాయి'' అంటూ వ్రాసింది. జూలై 30 వ తేదీన ఏవో రెండు మూడు పంక్తులు తప్ప తోరూ ఎక్కువ వ్రాయలేకపోయింది. అప్పటికి సరిగా ఆవిడ అంతిమ ప్రయాణానికి ఒక్క నెల రోజులు మాత్రమే మిగిలి ఉంది. అక్కడ తోరూ అవసాన దశ సమీపించి అంతా ముగిసిపోయిన విషయం తెలీని క్లారిసే సెప్టెంబరులో తోరూకు వ్రాస్తూ జవాబు ''ఇంకా ముందుగా వ్రాయలేక పోయాను. నువ్వు జబ్బుగా ఉన్నా నన్నావు. ఆ జబ్బు నువ్వు పంపించిన నీ ఫోటోలో ఉన్న జీవకళను ఏ విధంగానూ తగ్గించ లేదు సుమా! కాంతి మంతంగా మెరిసే నీ కళ్ళు నిజంగా జబ్బుతో తీసుకుంటున్నాయా? ఒకవేళ అదే నిజమైతే ఆ జబ్బు తొందరగా నయమైపోతుందిలే!'' అంటూ వ్రాసింది.

తోరూ ఆగస్టు 30 న మరణించినట్లుగా గోవిన్ సెప్టెంబర్ 30 న క్లారిసేకు వ్రాసిన ఉత్తరం ఆవిడకు అశనిపాతంలా తాకింది. తోరూను చూడనైనా చూడకుండా ఆవిడను అమితంగా ప్రేమించింది క్లారిసే. ఆవిడ దృష్టిలో తోరూకు ఉత్కృష్టమైన స్థానం ఉంది. ఆ బెంగాలీ కవయిత్రి అతి ఉత్కృష్టమైన హైందవ సంస్కృతిని జీర్ణించుకుని, దాన్ని ఐరోపీయ విజ్ఞానంతో మిళితం చేసి ప్రపంచానికో అద్భుత కవితా చిత్రాన్ని అందించిన హైందవ క్రైస్తవ వనిత. హిందూ క్రైస్తవ లోకానికే ఆవిడ మిలమిల మెరిసే అద్భుతమైన ప్రతినిధి.

తోరూ జీవిత చరమ దశలో ఎందరో పేరుగన్న స్నేహితులు ఆవిడను చూడడానికి వచ్చేవారు. అటువంటి వాళ్ళల్లో సర్ విలియమ్ హంటర్, ఆనందదాస్ బోస్‌లు కూడా ఉన్నారు. చివరి రోజుల్లో తోరూ ఎక్కువగా చదువుతుండేది. సెయింట్ బావే, విక్టర్ హ్యూగోల రచనల్ని వదలకుండా చదివేది. హాచెట్స్ కొన్ని కొత్త పుస్తకాలు పంపించారు. జూన్ నెలలో తోరూ మరీ అశక్తురాలైపోయింది. అప్పుడే, మేరీకి ''నాకు మెడ ఎముక కింద మూడు పట్టీలు వేశారు. అదీ 15 రోజుల వ్యవధిలోనే. అవి నన్ను చాలా బాధిస్తున్నాయి'' అని వ్రాసింది. ''ఈ నొప్పి భరించ లేకుండా ఉన్నాను. నాకు పిచ్చెత్తిపోయేటట్లుగా ఉంది. అందులో ఒకటి కొంచెం మానుముఖం పట్టినట్లుగా ఉంది'' అంటూ వ్రాసింది. ఆగస్టులో మళ్ళీ వ్రాస్తూ ''మేం చేసుకున్న కర్మల్ని నిశ్చింతగా అనుభవించ గలిగేట్లు

దేవుడే మాకు సహాయం కావాలి" అనే న్యూమెన్ వ్రాసిన పంక్తి నొకదాన్ని ఉదాహరిస్తూ, కళ్ళు నీళ్ళయినా, నిట్టూర్పులయినా సరే వాటిని నేను తప్పించుకుని పోను!" అంటూ ఉటంకించింది. 1873 లో తోరూ ఇండియాకు వచ్చేశాక మేరీకి వ్రాసిన ఉత్తరాలలో ఇది 53 వదీ, చివరిదిన్నీ !

ప్రాణ ప్రదంగా పెంచుకున్న ముగ్గురు పిల్లల్ని పోగొట్టుకొని చావు కోసం ఎదురు చూస్తూ చచ్చిపోయిన పిల్లల జ్ఞాపకాలతో బ్రతుకుతున్న ముసలి తలిదండ్రుల్ని గురించి ఏమని ఊహించడం! ప్రతి చెట్టూ, ప్రతి పువ్వూ లెక్కలేనంత మంది సేవక జనం, పెంపుడు గుర్రాలూ, పిల్లులూ అన్నీ అరూ తోరూల చేత ప్రేమతో లాలింపబడ్డవే. అవన్నీ అక్కడే ఉన్నాయ్. కాని వాళ్ళేరీ! అంత అందమైన పిల్లలు, అంత ప్రతిభా సమన్వితులు, ఏరీ వాళ్ళు! తోరూ నవ్వు, పాట, ఆవిడ చదువు, అమాయకత్వం అన్నీ ఏవీ? ఎక్కడ? కానీ క్రైస్తవ విశ్వాసం ప్రకారం తోరూ తన అన్న అబ్జూతోనూ, అక్క అరూతోనూ, తలిదండ్రుల్ని తిరిగీ కలుసుకుంటుంది. వాళ్ళ చేతుల్లోకి తిరిగీ చేరుకుంటుంది. ఈ నమ్మకంతో జీవిస్తున్న ఆ ముసలి తండ్రి తన వణికే చేతుల్తో తన బిడ్డ వ్రాసి పడేసిన వ్రాత ప్రతుల నన్నిటినీ వెదికి జాగ్రత్త పెట్టేవాడు. తోరూ చనిపోయిన తర్వాత, కొన్ని సంవత్సరాలయినా గోవిన్‌చందర్ బ్రతకగలగడాని కిదొకటే కారణం. తన ముగ్గురు బిడ్డల్ని ముఖ్యంగా తోరూను ప్రతిక్షణమూ తన జ్ఞాపకాల్లో బ్రతికించుకుంటుండే వాడు.

తోరూ చనిపోయే క్షణాన పుస్తకాలన్నీ ఆవిడ చుట్టూ చెల్లా చెదరుగా పడి ఉన్నాయి. గోవిన్ మేరీకి ఉత్తరం వ్రాస్తూ, "జూలై వరకూ నీవు వ్రాసిన ఉత్తరాలన్నీ మా తోరూ చదివింది. అవి దాని కెంతో ఉపశమనాన్ని కలిగించాయి" అని వివరించాడు.

రామబాగన్‌లోనే తోరూ తన అంతిమశ్వాసను విడిచింది. అప్పటికి ఆవిడకు ఇరవైఒక్క సంవత్సరం మీద అయిదు నెలల వయస్సు.

"తోరూ ఈ లోకాన్ని విడిచి పెట్టి వెళ్ళిపోయింది. తనను సంరక్షించే ఏసుక్రీస్తు మీద అచంచలమైన నమ్మకంతో నిర్వికారమైన శాంతిని అనుభవిస్తూ ఈ లోకాన్ని విడిచి పెట్టింది. రాత్రి 8 గంటలకు ఆవిడ

మమ్మల్ని వదిలేసి వెళ్ళిపోయింది'' – గోవిన్ తోరూ చనిపోయిన మర్నాడు మేరీకి ఉత్తరం వ్రాస్తూ అలా తెలియజేశాడు.

సి.యమ్.యస్. శ్మశాన వాటికలో ఆవిడ భౌతిక దేహం విశ్రమించింది. సమాధి మీద ఇలా చెక్కించారు.

తోరూ దత్తు

గోవిన్ చందర్ చిన్న కూతురు

పుట్టుక : 4 మార్చి 1856

మరణం : 30 ఆగష్టు 1877

నీవు నీ విశ్వాసాన్ని ఆమరణం ప్రకటించు.

నేను నీ జీవితాన్ని సర్వోత్కృష్టం చేస్తాను.

**Rev. 11-10.**

కాలం పరిపక్వం కాకముందే అతి చిన్న వయస్సులో జీవితాలెలా ముగిసిపోయాయో అందుకు తార్కాణంగా ఈనాటికీ ఆ ముగ్గురు బిడ్డల సమాధులు మనకు కనిపిస్తుంటాయి. గోవిన్ క్లారిసేకు వ్రాస్తూ, ''తోరూ మనల్ని విడిచి మరో లోకానికి వెళ్ళిపోయింది. ఎడబాటూ, విచారమూ అనేవి తెలీని లోకానికి తన రక్షకుడిమీద తోరూ కుండే విశ్వాసానికి హద్దులు లేవు. ఆవిడ ఆత్మ స్వచ్ఛమైన శాంతిని అనుభవిస్తుంది. మనం ఎంచి చెప్పడానికి వీలులేని శాంతిని అనుభవిస్తుంది. తోరూ నా కడసారపు బిడ్డ. అటువంటి ముద్దు బిడ్డ మరొకటి ఉంటుందా? నేనూ, నా భార్యా ఈ ప్రపంచంలో ఒక్కళ్ళమే మిగిలిపోయాము. ఈ ముసలి తనంలో ఒంటరిగా ఎవరూ లేని శూన్య గృహంలో ఏకాకులంగా మేమిద్దరమే మిగిలాము. ఈ యిల్లు ఒకప్పుడు మా ముగ్గురు ముద్దు బిడ్డల కంఠ ధ్వనులచేత కలకలలాడుతుండేది. కాని ఇవ్వాళ మా కెవ్వరూ లేరు. అయినా మమ్మల్ని ఓదార్చే భగవంతుడు మాతోనే ఉన్నాడు. మేమిద్దరం మా పిల్లల్ని ఆ భగవంతుని సమక్షంలో ఎప్పటికీ విడిపోని విధంగా కలుసుకునే ఘడియ తప్పకుండా వస్తుంది!'' అంటూ విలపించాడు గోవిన్ చందర్.

# 13. షిఫ్

"ఫ్రెంచ్ క్షేత్రంలో ఏరి కూర్చిన ధాన్యపు పన" అన్న పేరుతో తోరూ ముగించిన పుస్తకాన్ని తన తల్లికి అంకితంగా ఇస్తూ తోరూ, షిల్లర్ పద్యా న్నొకదాన్ని ఉటంకించింది.

"మరో సూర్య రశ్మిని సంతరించుకున్న వాటిని
ఎంతో సంతోషాన్ని పంచే వాతావరణంలో పెరిగినవాటిని
ఇంకో దేశంలో ఏరిన పూలనూ పళ్ళనూ
పట్టుకొస్తున్నాను నేను!"

1876 మార్చిలోనే వచ్చిన "షిఫ్" మొదటి ముద్రణకు పీఠిక గానీ పరిచయం గానీ లేదు. అయినా అది అనామకమైన పుస్తకం మాత్రం కాదు. అది 252 పేజీల పెద్ద పుస్తకం. అందులో తోరూకు ఫ్రెంచ్‌లో ఉన్న పరిశీలనా దృష్టిని విశదం చేసే నోట్సు నలభై పేజీలదాకా ఉంది. అందులో ఉన్న 165 పద్యాలలో ఎనిమిది అరూవి. మిగిలినవి తోరూవి. ఇందులో ఫ్రెంచ్ కవులు డెబ్భైమంది రచనలకు అనువాదా లున్నాయి. వాళ్ళల్లో కొందరు డుబెలీ, డుబర్తాస్, స్కారన్, డిష్టోరియన్, డివినే, చెనియర్, ముస్సే, బెరాంజర్, సెయింట్‌బావే, బ్రిజో, డ్యుపాంట్, వి. డి. లెపార్ట్, ఎమ్. ఎవర్‌మాన్, విక్టర్ హ్యూగో, లామార్టిన్, బాడెలేర్, లాకాంటె డిలెస్లీ, డిబార్డై, వాల్మోర్, మొదలైనవారు. మొదటి ముద్రణ త్వరగా అమ్మకమై పోయింది. రెండవ ముద్రణకోసం ఆమె సర్వ సన్నాహాలూ చేయసాగింది. కాని అది ముద్రితమై వచ్చేసరికి తోరూ లేదు. మొదటి ముద్రణ పుస్తకం లేత నీలంరంగు అట్టతో, దానిమీద గిల్టు అక్షరాలతో చూడ ముచ్చటగా ఉండేది. తోరూ మేరీ కొక ఉత్తరంలో తన పుస్తకాన్ని గురించి ఇట్లా వ్రాసింది. "ఎగ్జామినర్‌కు నా పుస్తకం అతి మామూలు నారింజ రంగులో నిరాకర్షణీయంగా పంపించడానికి కారణం ఉంది. అది పేపర్

బాకీ పుస్తకం చొగ్గా తేలిగ్గా ఉండేట్లుగా తయారుచేస్తే విదేశాలకు బంగీ కట్టి పంపడానికి వీలుగా ఉంటుందని మా అంచనా. అందుకని అదట్లా తయారయింది.”

అంత నిరాకర్షంగా ఉన్న పుస్తకం అంత ఘనంగా సమ్మానింపబడడానికి కారణం అందులో ఉన్న రచనల గొప్పతనమే. దానికి విమర్శ వ్రాసిన వాళ్ళల్లో ప్రముఖులు ఫ్రాన్స్ నుండి ఆంద్రేట్యూరేట్ ఇంగ్లాండ్‌నుండి ఎడ్మండ్ గాసే.

మొదటి ముద్రణ వేసిన వాళ్లే రెండో ముద్రణ కూడా వేశారు. భవానీపూర్‌లో ఉన్న సప్తాహిక సంబంధ ముద్రాలయంలోనే 1878 లో అది ముద్రించబడింది. దానికి, పుత్రికా మరణ దుఃఖం చేత గుండె లవిసిపోయిన గోవిన్ చందర్ 1877 లో వ్రాసుకున్న జ్ఞాపిక చేర్చబడ్డది. ఆయన బాగ్‌మరీ తోటలోనే ఈ జ్ఞాపికను వ్రాశాడు.

ప్రసిద్ధులైన వైద్యుల సహాయం ఉన్నా తాను తోరూను రక్షించుకోలేక పోయానని ఆయన విలపించారు. రెండవ ముద్రణలో మరి ముప్పై అనువాదాలు జత కూర్చబడ్డాయి. అందులో ఉన్న పద్యాలన్నీ ఒక క్రమంలో అమర్చడం జరిగింది. పుస్తకం మొదటి పేజీలో ఇద్దరక్క చెల్లెండ్ర ఛాయా చిత్రాలు చేర్చారు. దీనికి మూడో ముద్రణ మెస్సర్ కేగన్‌పాల్ అనే ప్రకటన కర్తలు లండన్‌లో ముద్రించారు. ఇందులో ఉండే రెండు అనువాదాలను సర్ రాపోర్ లెత్‌బ్రిడ్జ్ అనే ఆయన ఇండియన్ మాగజైన్ రివ్యూలో ప్రకటించాడు. ఆయన “తోరూదత్తు కవిత” అనే పేరుతో ఒక విమర్శనాత్మక వ్యాసం కూడా వ్రాశాడు.

షీఫ్ మొదట ప్రచురితం కాగానే తోరూ విమర్శలకోసం ఆత్రంగా ఎదురుచూచేది. 1876 మే లో బెంగాల్ పత్రికలో మొదట ఒక విమర్శ ఇలా ఉంది. “బెంగాల్ పత్రికను చదివే వారంతా ఈ అద్భుతమైన కవితా ఖండాలను అమేయానందంతో చదివి పారవశ్యం చెంది ఉంటారు. ఇవన్నీ ముఖ్యంగా ఫ్రెంచ్ కవితలకు అనువాదాలు. అన్నీ గత రెండు సంవత్సరాల నుండీ మన పత్రికల్లో T. D. అనే సంతకంతో వెలువడినవే. ఇవీ మరి కొన్నీ కలిసి 234 పేజీల అద్భుత గ్రంథంగా మారింది. ఆ T. D. యే అమేయ ప్రతిభాశక్తి గల తోరూదత్. దత్తు కుటుంబ గ్రంథాన్ని సంకలనం

చేసిన గోవిన్‌చందర్ దత్తుగారి పుత్రిక. రామ్‌బాగన్‌లో నివసించే దత్తు కుటుంబం బెంగాల్‌కు చెందిన ప్రసిద్ధ కుటుంబాలలో ఒకటి. ఇందులో ఉండే చాలా మంది సభ్యులు వాళ్ల శక్తిసామర్థ్యాలవల్ల కీర్తి ప్రతిష్ఠల్ని సంపాదించుకున్నవారు. ఈ కుటుంబంలో పూర్వికుడైన బాబూ రాసమయీ దత్ చాలా గొప్పవాడు. ఆయన అనామకమైన దశలోనుండి పెరిగి స్వయం శక్తిచేత ఆనాటి న్యాయస్థానంలో ఉన్నతస్థితిని సంపాదించుకున్నాడు. ఆయనకున్న బిడ్డలలో ఇద్దరు కొడుకులు నడివయస్సులోనే చనిపోయారు. ముగ్గురు బ్రతికారు. వారే గోవిన్, హర, గిరీశులు – తోరూదత్తు అక్కగారు అరూదత్ రెండేళ్ళ క్రిందట మరణించింది. ఈ కవితా ఖండాలను సృష్టించిన తోరూవలె ఆమె కూడా చేయితిరిగిన రచనాశక్తికల స్త్రీ. ఆమె కూడా మన పత్రికకు **A. D.** అన్న సంతకంతో రచనలు పంపిస్తుండేది. ఆమె క్రైస్తవ వనిత''—

దీనివెంట వెనువెంటనే అనేక విమర్శలు రా నారంభించాయి. "ది ఇంగ్లీష్ మాన్'' అనే పత్రిక షీఫ్‌లో ఉన్న పద్యాల కూర్పులో అక్కడక్కడా స్ఖాలిత్యాలను ఎత్తి చూపినా, దాన్ని గురించి మంచి విమర్శనే అందించింది. ఆ పుస్తకంలో ఉన్న చివరి కవిత "**A mon pere**'' ను నిర్దుష్టమైన రచనగా పొగిడింది. ది మద్రాస్ స్టాండర్డ్ అనే పత్రిక తోరూను మగవాడుగా భ్రమించింది. అది చదువుకుని తోరూ తెగ మురిసిపోయింది. గర్వించింది కూడానూ. అందరికీ సులభంగా అందుబాటులో ఉండని చాతుర్యం తోరూకు ఉన్నట్లుగా ఆ పత్రిక అభిప్రాయపడ్డది. దానివల్ల రచయిత్రికి ముందు ముందు గొప్ప భవిష్యత్తు ఉన్నదని అంచనా కట్టింది. "ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా'' అనే పత్రిక ఇలా వ్రాసింది. "ఈ బెంగాలీ యువతి ఫ్రెంచ్ రచనలకు చాలా చక్కని అనువాద గ్రంథాన్ని మనకు అందించింది. ఇందులో వాడిన ఆంగ్ల భాష మెచ్చుకో దగ్గది.'' "ది ఇండియన్ చారి వారి'' అనే పత్రిక "హిందూ దేశంలో జనించిన వ్యక్తి ఇంత చక్కటి పుస్తకం వెలువరించగలదని మేము కలలోనైనా అనుకోలేదు. ఇందులోని కవితలన్నీ ఎంతో రమ్యంగా ఉండి రచయిత్రికి ఇంగ్లీషులోనూ, ఫ్రెంచ్‌లోనూ అమోఘమైన పాండిత్యం ఉన్న విషయాన్ని వెల్లడి చేస్తున్నాయి.'' అని వ్రాసింది. అట్లాగే హిందూదేశంలో వెలువడిన ఎన్నో పత్రికలు షీఫ్‌ను శ్లాఘించాయి.

ఆ సంవత్సరాంతంలో ఎక్జామినర్‌లో రెండువరసల ప్రకటన ఒకటి వెలువడింది. దాన్ని వ్రాసిన ఎడ్మండ్ గాసె మూలానికి చాలా దగ్గరగా ఒక హైందవ కన్య చేసిన ఆ అనువాదాలు చూచి ఆశ్చర్య చకితుడయ్యాడు. "అనువాదకుడే ఒక ఆంగ్లేయుడైతే క్లిష్టంగా ఉన్నచోట మూలాన్ని ధిక్క రించి అయినా, కవితాత్మ చెడకుండా ఉండే ప్రయత్నం చేసేవాడు. కాని తోరూ, అటువంటి చోట్లకూడా కవితా సౌందర్యం లోపించినట్లు తనకు తోచినా సరే మూలవిధేయంగా ఉండాలనే పట్టుదలనే చూపించింది"—అన్న విమర్శను చూచి తోరూ ఎంతో సంతోషించింది. "ఆట్లా చెప్పడం కుండ బద్ధలు కొట్టినట్లుగా హుందాగా తమాషాగా ఉంది. నిజంగా ఈ విమర్శ నా షీఫ్ మీద వచ్చిన విమర్శల్లోకల్లా ఉత్తమమైంది. అందుకు విమర్శకుణ్ణి, అత డెవరైనా కానీ నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను." అని మెచ్చు కుంది. తోరూకు ఎడ్మండ్ గాసెతో పరిచయం కలగకపోవడం విచారకర మైన విషయం. ఆవిడ చివరకు అతని కో ఉత్తరమైనా వ్రాయలేదు. కాని తర్వాత ఇరవై సంవత్సరాలకు శ్రీమతి సరోజనీ నాయుడికి అతణ్ణి కలుసు కునే అవకాశం కలిగింది. తోరూకే అతని పరిచయం లభించి ఉంటే అతని సలహాలూ, సహాయమూ తోరూ రచనలకు మరింత మెరుగుపెట్టి వాటిల్లో అక్కడక్కడా కనిపించే ఎగుడు దిగుడుల్ని సరిదిద్ది ఉండేది.

**E. H.** థామస్ అనే విమర్శకుడు మరీ చక్కని విమర్శ వ్రాశాడు. అది లండన్ క్వార్టర్లీ రివ్యూలో ప్రచరింప బడ్డది. అంతేకాక "తోరూ జీవి తమూ – సాహిత్యము" అనే పుస్తకంలో పూర్తిగా ఉటంకింపబడ్డది. ఆయన ఉద్దేశ్యం ప్రకారం అందులోని కవితలన్నీ జ్ఞాపక ముంచుకోదగ్గవి. అందులో తోరూ వ్రాసిన వివరణ ఆవిడకు ఫ్రెంచ్ సాహిత్యం మీద ఎంత అధికారం ఉందో తెలియజేసేదిగా ఉంది. అది తోరూ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేదీ మనో హరమూ అయిన పుస్తకం. డాకర్ బ్రజేంద్రనాథ్ సీల్ అనే అయన, ఆ విమర్శకుడితో సమానంగా ఆలోచిస్తూ తాను కూడా తోరూ వ్రాసిన వివరణ వల్ల ఆకట్టుకోబడ్డాననీ, పద్యాల మాట అట్లా ఉంచి ఆ వివరణకోసమైనా అది మరీ ముద్రించ దగ్గదనీ అభిప్రాయపడ్డాడు. "ఒక హైందవబాలిక ఇంత చిన్నవయస్సులో ఫ్రెంచ్ సాహిత్యంలో అంత పరిజ్ఞానాన్ని సాధిం చడం అసాధ్యమైన విషయం. వివరణ వ్రాసేటప్పుడు తోరూ సాహసం

చూపించిందేమో కానీ ఎక్కడా వెకిలిగా దొరికిపోలేదు. ఫ్రెంచ్ సాహిత్యంలో కొమ్ములు తిరిగిన వాళ్ళను సైతం తనతో సమానమైన వాళ్ళను చూచినట్లే చూచి వివరించింది. ఇదంతా చూస్తుంటే ఆవిడ చదివిన ఆ ఫ్రెంచ్ సాహిత్యం హద్దు లెంతా, అని ఆశ్చర్య పోవాలా, లేక విమర్శించేటప్పుడు ఆవిడ చూపించే విమర్శలోని నిబ్బరాన్ని అభినందించాలా ! ఏం చెయ్యాలో చెప్పడమే కష్టం. ఈ హైందవ బాలిక లిద్దరూ ఇతరుల అభిమాన పూర్ణమైన శ్రద్ధను అకట్టుకోగఅ తమ బుద్ధిని తాము క్షుణ్ణంగా ఎరుగుదురు''—ఈ విమర్శకుడు షీఫ్‌తో అరూ వ్రాసిన కొన్ని పద్యాలు చాలా ఉత్తమమైనవని అభిప్రాయపడ్డాడు.

ఎడ్మండ్ గాసె ఇలా వ్రాశాడు—''వివరణ చాలా చిత్రంగానూ మెచ్చుకో దగ్గదిగానూ ఉంది. ఒక్కొక్కచోట రచయిత్రి తెలియని తనం కొట్టి వచ్చినట్లు కనిపించినా మరికొన్నిచోట్ల ఆవిడ సంపాదించిన జ్ఞానం మరీ బాగా వెల్లడై మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. మొత్తంమీద ఈ పుస్తకం సాధించిన ఫలితం అద్భుతమైంది.''

తోరూ ఎక్కువగా ఫ్రెంచ్ భాషలో అధునిక కవుల్నే చదివేది. ప్రాచీన కవులు ఆవిడను ఆకర్షించలేక పోయారు. తోరూకు సంబంధించి నంతవరకూ ప్రాచీన కవులంటూ ఎవరూ లేరు. దుబర్తాస్ తర్వాత అంద్రే చెనైర్‌ను పేర్కొన్నది. ఉన్నట్లుండి సెయింట్స్‌బరీని గురించిగానీ, లెడో ఎస్పెలినోను గురించిగానీ, అద్భుతమైన పరిశోధన చేసినట్లు మాట్లాడుతుంది. ఈ పరిశోధన వాళ్ళిద్దరిపట్లా న్యాయం చేసినట్లుగానే ఉంటుంది గానీ మరోలా ఉండదు. బోదేర్ కవితతో సంబంధం సూచించడానికి నేపోల్ లె పైరెనెస్ మీద తన ఖచ్చితమైన అభిప్రాయాలను వెల్లడిస్తుంది. ఇంతా చేస్తుంది కానీ అలెగ్జాండర్ స్మిత్ ఇంకా బ్రతికి ఉన్నాడనుకుంటుంది. సెంట్ బావే జీవితం గురించి తన కేమీ తెలియదనీ తెలుసుకోవాలన్న కుతూహల మున్న దనీ అన్నట్లుగా ప్రవర్తిస్తుంది.

షీఫ్‌లో మొదటి కవిత లి కాంటి డి లిస్‌లె కవిత. బెంగాల్ పత్రికలో మొదట ఆ కవిమీద తోరూ ఒక వ్యాసం వ్రాసింది. ఆమె పరిధి చిన్నదయినా డి లెస్‌లె కవితకూ ఆమె కవిత్వానికీ చాలా పోలికలు కనిపిస్తాయి. భగవ దన్వేషణ, ఆయన్ను చేరుకోవాలనే తహతహ ఇద్దరిలోనూ ఒక్కలాగే కనిపి

స్తుంది. భగవంతునికి ఆత్మార్పణ చేసుకోవడమూ చివరకు మృత్యువులో కూడా ఆనందాన్నే వెతుక్కోవడమూ ఇద్దరిలో ఒక్కలాగే కనిపిస్తుంది. లిస్లే సూర్యదేవుణ్ణి ఉద్దేశిస్తూ వ్రాసిన కవిత ఇది :

గాయాలనుండి స్రవించే
పునీత రక్తపాతం లాగా
ప్రసరిస్తుంది నీ కీర్తి
అస్తమయంలో నైనా
ఆనందాన్ని విడువని కీర్తి

నీవు నిజంగానే
పునరుజ్జీవిస్తావు
నీ ఆశ నికరమైనది!

తోరూ మృత్యువుకు విముఖం కాకుండా తన్ను తాను అర్పించుకోవడం తనకు భగవంతుని సమక్షంలో పునర్జన్మమీద నమ్మకం వల్లనే ననిపిస్తుంది. ఈ నమ్మకం విక్టోరియన్ రచయిత లందరిలోనూ కనిపిస్తుంది. ఛార్లెట్ బ్రాంటె, భగవంతుని ఇచ్ఛకు మనం తల వంచడం చాలా అవసరమనే వాళ్ళల్లో ఒకతి. ఆ రోజుల్లో అతి సరళంగా సాగే కథల్లోనూ కల్పనల్లోనూ విషాదాంత సంఘటనలన్నీ విషాద మధురాలై కలల్లో తేలిపోయేటట్లుగా నిరాసక్తతతో కూడుకుని ఉండేవి. ఈ నిరాసక్తత ఎప్పుడూ భగవంతుని ఇచ్ఛకు లొంగిపోవడం వల్లనే కలుగుతుండేది.

కాంటే డి గ్రామంట్ పద్యాలు అనువదిస్తూ తోరూ అతడు ఫ్రెంచ్ నవ కవుల్లో ప్రథమ గణ్యుడనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. ఆయన ఇటాలియన్ భాషలో కూడా చాలా పద్యాలు వ్రాశాడు. తోరూ చనిపోయిన తర్వాత ఆవిడ వ్రాత ప్రతులు వెతుకుతుండగా ఈ కవి పద్యాలకు ఎన్నో అనువాదాలు లభించాయి. వాటిని ఆమె ఎక్కడా ప్రచురించ లేదు. 'అప్పటికి బ్రతికి ఉన్న వాళ్ళల్లో' (నిజానికి విక్టర్ హ్యూగో అప్పటికి బ్రతికి లేడు) విక్టర్ హ్యూగో చాలా గొప్పవాడు అని తోరూ అభిప్రాయ పడేది. ఆయన తోరూకు అభిమాన కవి. ఒకసారి మేరీకి వ్రాసిన ఉత్తరంలో

"అప్పుడప్పుడూ హ్యూగో అర్థం కాకుండా పోతుంటాడు. ఆయన వాడిన సాంకేతిక పదాలు కొన్ని లిట్టర్ కోశం చూడందే అర్థం కావు. కాని ఆయన ఫ్రెంచ్ అద్భుతం సుమా!" అని వ్రాసింది.

సోలరీని గురించి వ్రాస్తూ ఆయన ఎంతో జాగ్రత్తతో తన కవితలో దృశ్య చిత్రాల్ని మలుస్తాడనీ, ఆయన కవిత్వంలో ఏ భాగంలో చూచినా ప్రకృతి చిత్రంలో మలిచినట్లుగా కనిపించడమో, అద్భుతమైన అందం నాటకంలో మలిచినట్లుగా సాక్షాత్కరించడమో జరుగుతుందనీ అభిప్రాయ పడ్డది. అందుకే ఆయన్ని ఫ్రెంచ్ దేశాభిమాని అని గౌరవించి, జనం సార్థక బిరుదాన్ని ఇచ్చారని సంతోషించింది. ఆవిడ పుస్తకంలో తాను అనువదించిన ఫ్రెంచ్ కవుల నందరిని గురించీ చిన్న చిన్న వివరణల్ని ఎంతో పరిచయమున్న వ్యక్తి చిత్రాలు వేసి చూపించినట్లుగా స్పష్టం చేసింది. ఒక్కోచోట ఆ యా కవుల్ని గురించి ఇన్ని వివరాలు ఈవిడకు ఎలా తెలిశాయా అనే ఆశ్చర్యం కలుగుతుంది. బిరెంజర్ వ్రాసిన 'ఒకేషన్' అంటే థాకరే పడి చస్తాడనీ, ఛార్లెస్ నోదెర్ కవిత్వం కంటే వచనం బాగా వ్రాస్తాడనీ, ఆయన కథలు మనోహరంగా వాషింగ్టన్ ఇర్వింగ్‌ను జ్ఞాపకం తెస్తుంటాయనీ, అలెగ్జాండర్ డూమా ఆయనకు ప్రాణమిత్రుడు కాబట్టి ఆయన జీవిత చిత్రణను చాలా వివరణాత్మకంగా చేశాడనీ, నోదెర్ ఇంగ్లండుకూ, స్కాట్లండుకూ పదేపదే తిరుగుతుండేవాడనీ ఆయన సర్ వాల్టర్ స్కాట్ మీద వ్రాసిన పద్యాలు బ్లాక్‌వుడ్ పత్రికలో ప్రచురింప బడ్డాయనీ – ఇలాగే ఎన్నో ఉదంతాలను తోరూ తన నోట్సులో వ్రాసింది. ఆంద్రే లైమాన్ ఎక్కువ వ్రాయలేదు. కాని వ్రాసి ప్రచురించిన ఆ కొంచెమే అందరి మన్ననల్ని అందుకుంది. పెత్రీ డ్యూపాంట్ పేదవాళ్ళ కష్టాలనూ, కన్నీళ్ళనూ, సుఖాలనూ వివరించే కవి. నికలస్ మార్టిన్ జర్మనీ దేశపు ప్రాచీన కవితా మార్గాన్ని పుణికి పుచ్చుకున్న కవి. ఆయన జన్మస్థానం బాన్. తల్లి జర్మన్ వనిత. ఆవిడ కారల్ సిమ్‌రోక్ సోదరి. జర్మన్ ప్రాచీన కావ్యం నెబెలంజన్‌ను అధునిక భాషలోనికి అనువదించిన మహ నీయుడు సిమ్‌రోక్. విక్టర్ హ్యూగో ప్రపంచంలోని గొప్ప ఇతిహాసాలు మూడేననీ, అందులో నెబెలంజన్ ఒకటనీ పేర్కొన్నాడు. ఆయన పేర్కొన్న మరి రెండు గొప్ప ఇతిహాసాలు మన రామాయణ మహాభారతాలే నని తోరూ సగర్వంగా చాటుకుంది.

తోరూ అనువదించిన వాటిల్లో ఒక అందమైన అనువాదం డి పెర్నీ వ్రాసిన "పడుచు పిల్ల మృత్యువు" అనే కవితకు చేసిన అనువాదం. బహుశా ఆ కవిత తన సోదరి మరణంవల్ల తనకు కలిగిన అనుభూతినే వెల్లడించి ఉండడం, అంత అందంగా రావడానికి కారణం అయి ఉండవచ్చు.

చిన్ననాటి పోకడలన్నీ
చల్లగా వెనక్కు జారిపోయాయి
నీ అంత అమాయకంగా
ఏ బాలికా కనపడదుకదా!

అణువణువునా
అందం తొణికినా
ఆ పడుచు గుండెలో
పగటి కలలకు స్థానం లేదు.

కొన్ని నెలలో
మరిన్ని రోజులో
మధురంగా గడిచిపోతే
వసంత కిరణం మెత్తగా
స్పృశించగానే

గులాబీ
గుత్తులు గుత్తులుగా
విరబూచినట్లు
ప్రేమ పరిమళిస్తుందన్న
ఊహలు ఊపిరి పోసుకున్నాయి.
దైవం మరోలా నిర్ణయించగా
ఆవిడ మెల్లగా నిద్రలోకి జారిపోయింది.

ఆకాశంలో ఉండాల్సిన
అనిమిష కన్య అందాన్ని
అట్లాగే నిలుపుకోగల శక్తి
అవని కెంతమాత్రమూ లేదు.
పడుచుదనంలో
పాదం పెడుతూనే
చనిపోయిన ఆవిడ
స్మృతి చిహ్నంగా
చివర కేమీ మిగిల్చిపోలేదు.

దట్టంగా
ఆకులు పరచుకున్న అడవిలో
పిట్ట పాడిన పాటలాగా
కరిగి పోయింది.

సుందరమైన వదనం మీద
మందహాసం కరిగినట్లే
అంతరించి పోయింది!

తోరూ లామార్టిన్‌ను గురించి వ్రాసింది. "ఓ చదువరీ! ఆయన వ్యక్తిగత జీవితాన్నీ, పర్యటన విశేషాలనూ చదువు. ఇంతవరకూ ఆ పని చేసి ఉండకపోతే ఇప్పుడైనా మేము చెప్పి నందుకు మాకు ధన్యవాదాలు చెప్పు. కల్పనలో, ఊహలో, చాకచక్యంలో, గొప్పతనంలో, శైలిలో ఈయన విక్టర్ హ్యూగో ముందు తలవంచవలసిందే. విక్టర్ హ్యూగోలో అంత శ్నక్తి ఉన్నది. ఆయన చాలా గొప్ప కవి అనడంలో ఏమీ సందేహం లేదు. కాని ఆయన చెప్పిందంతా అపరిణత బుద్ధులైన పిల్లవాళ్ళచేత చదివించడం మాత్రం తెలివైన పని కాదు. ఆ మాటకొస్తే లా మార్టిన్ పుస్తకాలను ఎటువంటి సంకోచమూ లేకుండా అందరి చేతుల్లోనూ ఉంచవచ్చు."

ఏది ఎటువంటి పుస్తకమో అంచనా వెయ్యడంలో తోరూలో విక్టోరియన్ యుగపు పోకడలు కనిపిస్తాయి. తన రచనల్లో కానీ, తను చేసే విమర్శల్లో కానీ, పూర్తిగా చాదస్తమైన ఈ పద్ధతి అబ్బడం ఒక రకంగా అవిడ దురదుష్టమే అనవచ్చు. కాని ఆ పద్ధతిలోనే అవిడ జీన్ ఆస్టిన్‌నో షార్లెట్ బ్రాంటీనో విమర్శించినప్పుడు, ఆ విమర్శ చాలా ఒప్పిదంగా ఉందని అందరూ మెచ్చుకోవడానికి కారణభూత మయ్యేది. విక్టోరియన్ యుగపు పోకడలు లేని ఏ రచనా పద్ధతి నైనా తోరూ చేపట్టి ఉంటే, జనాన్ని మెప్పించలేకపోయి ఉండేది. అందుకే లేమిరబ్లేని గురించి వ్రాస్తూ తోరూ, "అన్ని ఫ్రెంచ్ పుస్తకాల్లోనూ ఉన్నట్లు ఇందులోనూ దౌష్ట్యం గూడు కట్టుకున్న భాగా లున్నాయ్" అని వివరించినా అవిడ సాంప్రదాయికమైన చాదస్తపు విమర్శను జనం క్షమించ గలిగారు.

సెంట్‌బావే తోరూ దృష్టిలో, "ఫ్రాన్స్‌లోని సాహిత్యకుల్లో మంచి అధికారం కలిగిన వాళ్ళల్లో ఒకరు. అద్భుతమైన విమర్శనా శక్తి కలవాడు. కాని ప్రథమశ్రేణి రచయితల్లో గణించదగ్గవాడు కాడు. ఇట్లా అన్నానని అతడు నాసిరకం రచయిత కూడా కాడు. హ్యూగోలతోనూ, లామారిటన్లతోనూ సరసన చేరడానికి అతనికి అధికారం లేదు గాని, రెండవ తరగతి కవులలో ప్రథమ గణ్యత్వం అతనిదే. ఆల్ఫ్రెడ్‌జి ముసెట్ ప్రకృతి ఇచ్చే ఉత్తేజాన్నీ, శక్తినీ, చాకచక్యాన్నీ, ఆదరాన్నీ పుణికి పుచ్చుకున్న కవి. కాని ఆయన రచనల్లో చిత్రితమైన ప్రకృతి కొన్ని చోట్ల సహజ సుందరంగానూ, మరికొన్నిచోట్ల కృత్రిమంగానూ ప్రత్యక్షమౌతుంది. బైరన్ లాగా ఆయన ఒక్కొసారి మరీ ఉద్రిక్తుడై విచ్చలవిడిగా ఉన్నట్లు కనిపిస్తాడు. జూల్స్ లెఫెవర్ డుమైర్ 19 వ శతాబ్దం గుర్తు పెట్టుకోదగిన చేవ గల రచయితల్లో ఒకడు. అతడు మిలిటరీ మనిషి. డివినే, లామార్టిన్, హ్యూగోలతో కూడిన సంఘంతో స్నేహ సంబంధాలు కలవాడు. వీరోత్సాహాలతో కూడిన ఎన్నో యుద్ధాలు జరిగాక కవిత్వంలో కొత్త పోకడ నొకదాన్ని ఈ సంఘం స్థాపించింది. ఫ్రెంచ్ దేశంలో ఈనాటికీ అది సర్వశ్రేష్ఠ మైనదిగా భావింపబడుతూనే ఉంది.

తోరూ లండన్‌లో ఉన్నప్పుడు బ్రిటిష్ ప్రదర్శనశాలలో నెలకొల్పబడిన ఫ్రెంచ్ విప్లవ కవుల నందరిని గురించీ నిశితంగా అధ్యయనం చేసింది.

ఆవిడకు కాల్పనిక కవులమీద పక్షపాతం ఎక్కువ. వాళ్ళకు వ్యక్తిత్వపు విలువలూ ఆలోచనా స్వాతంత్ర్యమూ బాగా ఉన్నాయని నమ్ముతుంది. 17, 18 శతాబ్దాలలో కవిత్వానికున్న నియమాలూ కట్టుబాట్లూ 19 వ శతాబ్దిలో లేవు. 17 వ శతాబ్దపు ప్రాచీన కవితా ధోరణి గ్రీస్, రోమ్ దేశాలకు బానిసతనం నెరిపిందని తోరూ నమ్మకం. కాల్పనిక కవులు సూటిగా, విప్పులంగా, మామూలుగా ఉండేవారు. అయినా తోరూ ఫ్రెంచ్ రినైజాన్స్ కవులను నిరసించలేదు. షెనైర్, కొరియర్, బిరాంజర్, లా మార్టిన్ ల కంటె బాగా వెనక కాలం వరకూ దృష్టిని సారించి 18 వ శతాబ్దానికి చెందిన కార్నెయిల్, స్కారన్‌లను, పరిశీలిస్తూ, ఇంకా 16 వ శతాబ్దంలోకి కూడా ఆమె చొచ్చుకుని వెళ్ళిపోయింది. షీఫ్‌లో విశిష్టమైన స్థానం హ్యూగోది. ఆయన అనువాదాలు 30 వరకూ అందులో చోటు చేసుకున్నాయి. తర్వాత, ముస్సెట్, కాంటెజిగ్రామంట్ జోసెఫెన్ సోలరీల అనువాదాలు ఎక్కువగా కనిపిస్తాయి.

ఈ రకంగా షీఫ్‌లో నలభై పేజీల వివరణను చేర్చింది తోరూ. ఆ వివరణంలో నిర్మోహమాటమైందిగానూ, నిశితమైందిగానూ, విమర్శనాత్మకంగానూ ఉంది. పుస్తకం పట్టుకున్న ఏ పాఠకుడైనా చివరి పేజీకి వచ్చేదాకా వదిలిపెట్టడన్నది మాత్రం నిజం.

ఇన్నేళ్ళు వెనక్కు చూచుకుంటూ, షీఫ్‌లోని కాగితాలు తిరగవేస్తుంటే ఒక ప్రశ్న వేసుకోక తప్పదనిపిస్తుంది. వందయేళ్ళ క్రిందట తోరూ అనువాదాలు అభిమానింపబడ్డట్లుగా ఈనాడు కూడా అంత జనప్రియంగా అభిమానింపబడేవేనా అన్నదే ప్రశ్న. హిందూ సాంఘిక వాతావరణం సమకూర్చి పెట్టిన నియమాలుకల ఈ చాదస్తపు విక్టోరియన్ యుగానికి చెందిన పడతి తప్పకుండా తన కాలానికి అనుగుణమైన అన్ని ఆంక్షలనూ అడ్డంకులనూ అధిగమించింది. ఇలియట్ తర్వాత వచ్చిన ఆడంబర యుతమైన కవితకు అలవాటుపడని ఈనాటి జనం కూడా, ఎంతో సంతోషంతో తోరూ కవితను చదువుతారని ఎవరైనా నమ్ముతారు. మరి పాతబడ్డ ఛందస్సూ, ఈనాటికి ఎవరూ అక్కరలేదనుకున్న నియమాలపట్ల పట్టుదలా, ప్రాచీన ప్రపంచానికి చెందిన ఆవిడ నీతి సూత్రాలూ. ఆత్మ పరమాత్మ అనే నమ్మకాలను నిక్కచ్చిగా చేపట్టాలని చెప్పే ఆవిడ కవితావస్తువూ, - ఇటువంటి వాటిని కొన్ని

టిని మినహాయిస్తే, ఈనాటికీ కవితా ప్రపంచంలో తోరూ తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటుంది. కారణం ఏ యుగానికి చెందిన కవి అయినా చేసినట్లే ఆవిడ కూడా సత్యాన్ని అంటిపెట్టుకుని ఉండేది. అందుకే ఆవిడ చిరంజీవిని. కేవలం భావగీతాలూ, పద్యాలూ వ్రాసి ఊరుకోవడంతో తోరూ తృప్తిపడ లేదు. ఆంగ్లంలో కవిత్వం చెప్పిన మరొక భారతీయ కవయిత్రి సరోజినీ నాయుడు లాగా కేవలం శాబ్దిక సౌందర్యాన్ని రమ్యంగా ప్రకటించడంతో మాత్రమే తృప్తి చెందలేదు. తోరూ కవితలు చిన్నవయినా, అప్పుడప్పుడూ ఛందోనియమాలను అతిక్రమించినా శైలిలో అవి ప్రాచీన పద్ధతిని చాటు తుంటాయి. హుందాగా ఆపాత మధురంగా ఉంటాయి. ఈ నాటికీ తోరూ బ్రతికే ఉంటే ఆవిడ కవిత్వం వ్రాస్తూనే ఉండేది అనిపిస్తుంటుంది మనకు. కవిత వ్రాయకుండా, పర్నేసియన్ కవితా ధోరణికి చెందిన బోధెలేర్, సెంట్ బావే, ఇతరులూ, ఆవిణ్ణి ఎలా కదిలించ గలిగేవారు? తోరూ అంత ర్యంలో విప్లవ ధోరణి కల పడతి. వాళ్ళ ధోరణిలో సరిపోలే అంశమే ఆమెలోనూ ఉన్నది. అదేవిధంగా టి. యస్. ఇలియట్ కవితా ప్రపంచంలో ఒక భాగంగా కూడా ఆవిడ మారి ఉండేది. కాని ఆవిడ ఈనాటి స్వేచ్ఛా యుతమైన హద్దులు లేని సంఘంతో ఎప్పుడూ రాజీపడి ఉండేది కాదు.

షీఫ్‌లో మనస్సును కదలించివేసే వివరణ అరూను గురించి. "తానే బ్రతికి ఉంటే తన సహాయంలో ఈ పుస్తకం ఇంకా బాగా తయారయ్యేది. ఈ పుస్తక రచయిత దీన్ని చూచి సిగ్గుపడాల్సిన అవసరం కానీ పాఠకులను క్షమాపణ అడిగే సందర్భంకానీ ఉండేది కాదు కదా!"—అని వ్రాసుకుంది తోరూ!

# 14 నవలలు

తోరూ చనిపోయిన తర్వాత ఆవిడ వ్రాత ప్రతుల్లో గోవిన్‌చందర్‌కు తోరూ వ్రాసిన ఫ్రెంచ్ నవల ఒకటి కనిపించింది. దాన్ని ఆయన 1878 ఆగస్టులో క్లారిసే బాదేర్‌కు పంపించారు. "ముదుసలి తండ్రి తన చేతుల్తో కాపీచేసి పంపిన ఆ వ్రాతప్రతిని అందుకుంటూ ఎంతో భావావేగంతో చలిం చాను. 'నా చేతులు నిలకడగా లేవు. అందుకని చాలా తాపీగా కాపీ

చేశాను అని ఆయన వ్రాశారు. అంత పొంకంగా ఉన్న ఆ దస్తూరిలో వణుకు కనపడుతూనే ఉంది. విషాద మధురమైన ఆపని చేయడానికి ఆయన నిజంగానే మనోబలాన్ని చేకూర్చుకోవలసి వచ్చింది. 'నేనిది కాపీ చేస్తుంటే నా బిడ్డతో మాట్లాడుతున్న అనుభూతి కలుగుతోంది' అని చెప్పుకున్నారు. ఆ ఆనందానుభూతి కోసమే ఈ పనికి పూనుకున్నారాయన'' అని వ్రాసింది క్లారిసే.

ఆ నవలకు క్లారిసే పరిచయ వాక్యం వ్రాసింది. అది ఫ్రెంచ్‌లో ప్రకటితం కావడానికి అవసరమైన చర్యలు తీసుకుంది. అందులో ఆవిడ వ్రాసిన స్మృతి వాక్యాలను తోరూ చూడకపోయినా, అవన్నీ తోరూపట్ల క్లారిసేకు కల ఆరాధననూ, ఆవిడ మరణంవల్ల పేరుకున్న విషాదాన్నీ నింపుకుని ఉన్నాయి. "తోరూ అనువాదాలతో ఆగలేదు. తను నిజంగా ఫ్రెంచ్ రచయిత్రిగా మారాలని ఆశించింది. ఆ ఆశతోనే ఫ్రెంచ్ భాషలో ఈ నవలను వ్రాసింది. తోరూకు కేవలం ఫ్రెంచ్ భాషమీదా సాహిత్యంమీదా మాత్రమే కాక ఫ్రాన్సుదేశం మీదా అమితమైన అభిమానం ఉండేది. ఫ్రాన్సుదేశం ఆపదల్లో చిక్కుకున్న సమయంలో ఆవిడ "ఆ ప్రేమను ప్రకటించింది'' అని వ్రాసింది క్లారిసే.

19 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఉన్న ఫ్రెంచ్ సంఘాన్ని తన నవలలో చిత్రించడానికి తోరూ చాలా శ్రమ చెందింది. రచయిత్రి ఆలోచనా పద్ధతినీ, రచనా విధానాన్నీ అద్భుతా పాదకంగా వెలువరించే ఆ నవల చాలా ఆకర్షణీయమైనది. "ఈ పుస్తకం చదువుతుంటే ఇదొక విదేశీయ వనిత రచించిందన్న సత్యాన్ని దాచే ప్రయత్నా లేమీ ఇందులో జరగలేదని తెలుస్తుంది'' అని ఒక డచ్ విమర్శ వివరించింది. తోరూ జీవిత చరిత్ర వ్రాసిన హరిహరదాస్ ఆ విషయాన్నే సున్నితంగా చెప్పారు. "ఏ సాహిత్య చరిత్రలో నైనా ఇటువంటి ఉదాహరణ ఇంకొకటి చూపించగలమా! ఒక విదేశ భాషమీద అల్పవ్యవధిలో ఇంత అధికారాన్ని సంపాదించి, అందులో ఒక 'నవల వ్రాయడమంటే మాటలా? అందునా ఈ పుస్తకంలో ఉన్న ముచ్చటైన శైలిలాంటి శైలిలో!''

ఈ నవల, కాథలిక్ మతానికి చెందిన ఒక ఫ్రెంచ్ కన్య వ్రాసుకున్న డైరీల రూపంలో మలచబడ్డది. ఇది రమారమి ఒకటిన్నర సంవత్స

రాల కాలానికి సంబంధించిన కథావస్తువు. ఒక అమ్మాయి మార్గరెట్ తానున్న కాన్వెంటును వదలి అకాల మరణం పాలైనంతవరకూ ఈ కథ సాగుతుంది. ఆవిడ అనారోగ్య దశా మృత్యువూ రెండూ నవల ఉపసంహారంలో చేర్చబడ్డాయి. విచారపు ఛాయలైనా ఎరుగని, స్వచ్ఛమైన ఆనందంతో గుండెల్ని నింపుకున్న ఓ పడుచుపిల్ల ఉల్లాసంగా ఇష్టం వచ్చినట్లు మాట్లాడే మాటలతో నవల ఆరంభ మవుతుంది. ఆ పిల్ల బ్రిటనీలో నివసిస్తున్న ఒక మాజీ జనరల్ కూతురు. అమె కాన్వెంట్ నుండి తన 15 వ సంవత్సరపు పుట్టిన రోజు చేసుకోడానికి ఇంటికొచ్చింది. అక్కడ ఒక కౌంటెస్ తోనూ, ఆవిడ కొడుకు లిద్దరితోనూ మార్గరెట్‌కు పరిచయం కలుగుతుంది.

తర్వాత మూడు రోజులకు లూయీ లెఫెవర్ అనే ఆఫీసరు వాళ్ళ యింటికి వచ్చాడు. తలిదండ్రు లిద్దరికీ తమ కూతుర్ని అతనికి ఇచ్చి చెయ్యాలని ఆలోచన. కాని మార్గరెట్ అందుకు ఒప్పుకోదు. కారణం కౌంటెస్ కొడుకుల్లో ఒకరైన కౌంట్ డూనాయిస్ మీద ఆవిడ మనసు లగ్న మయింది. కౌంటెస్‌కు కూడా మార్గరెట్‌ను కోడలుగా తెచ్చుకోవాలనే ఉంది. కాని డూనాయిస్‌కూ అతని తమ్ముడు గాస్టన్‌కూ వాళ్ళ యింట్లో పనిచేసే జేనెట్ మీద ప్రేమ. జేనెట్ ఓ గ్రామీణ బాలిక. ఈవిణ్ణి మార్గరెట్ కౌంటెస్ దగ్గరికి పంపించింది. డూనాయిస్ అసూయావేశాలతో కోపం పట్టలేక తమ్ముణ్ణి చంపేశాడు. అతనికి న్యాయస్థానం యావజ్జీవ శిక్ష విధించగా అతడు ఆత్మహత్య చేసుకుంటాడు. కౌంటెస్ పిచ్చిదైపోతుంది. మార్గరెట్ ఈ సంఘటనల వల్ల మంచం పట్టి క్రమంగా కోలుకుంటుంది. తర్వాత తలిదండ్రుల మాట కాదనలేక లూయీని వివాహం చేసుకుంటుంది. ఆవిడకు ఎందుకో తాను త్వరగా చనిపోతానని ఒక తలపు. ఏది ఎట్లా జరగాలనుందో అంతా కర్మ అనుకుని సరిపెట్టుకుంటుంది. భార్యా భర్త లిద్దరి మధ్యా గాఢమైన ప్రేమ చిక్కగా అల్లుకుంటుంది. ఇద్దరూ నైస్‌లో కొన్నాళ్లు ఆనందంగా గడుపుతారు. ఇంటికి తిరిగి వచ్చాక మార్గరెట్ ఒక కొడుకుని కని కన్ను మూసింది.

ఈ కథ భయాందోళనల్ని కలిగించేదే కానీ, అసహ్యాన్ని కలిగించేదిగా లేదు. ఇందులో నైచ్యాన్ని సూచించే వివరాలు లేవు. కాని కథంతా పాత్రల అక్లిబిల్లి ఊహలతో నిండి ఉంది. నవలలో ఎక్కడ చూచినా మానవాతీత శక్తి ఒకటి అగ్గించబడినట్లుగా కనిపిస్తుంది. ఇందులో కొన్ని

పాత్రల రూపకల్పన చాలా చక్కగా జరిగింది. మార్గరెట్ తన వయస్సును మించిన అరిందలాగా అసహజంగా కనిపిస్తుంది. భగవంతుడిలో ఆవిడకున్న నమ్మకం, అవిడ ఉండే తీరు, ఆవిడ జీవించిన వాతావరణం అన్నీ తోరూకు సంబంధించినవేమో ననిపిస్తాయి. మార్గరెట్ సోదరి వెరోనికా మూడు మూర్తులా అరూ ప్రతిబింబమే. ఈ కారణంవల్లనే ఈ నవల పాఠకుణ్ణి నిల వేసి చదివిస్తుంది. ఈ నవలమీద మంచి విమర్శలే వచ్చాయి. ఎడ్రిన్ డెస్ పర్ట్ అనే విమర్శకుడు "ప్రేమాస్పదురాలైన కన్య వివరించవలసిన అందా లన్నీ ఇందులో కలబోసింది రచయిత్రి" అని వ్రాశాడు. క్లారిసే వలన తోరూను గూర్చి విని ఆవిడపట్ల అభిమానం పెంచుకున్న గార్సిన్ డి తాస్ ఈ నవలను గురించి చాలా గొప్పగా వ్రాశాడు. దీనికి బెంగాలీ భాషలో రాజకుమార ముఖర్జీ అనే ఆయన ఒకటీ, పృథ్వీంద్రనాథ్ చటోపాధ్యాయ మరొకటీ రెండనువాదాలు వెలువరించారు. రాజకుమార్ వెలువరించిన కవి తోరూదత్ అనే గ్రంథంలో ఈ నవలను గురించీ, తోరూను గురించీ ఆయన వ్రాసిన వివరణ చాలా ఆకర్షణీయంగా ఉంది" తోరూ రచనా పద్ధతిలో హైందవ వాతావరణమే కనిపిస్తుంది. తన సహజ ప్రవృత్తిని ఇంత చక్కగా వెలికి తీసుకురావడం వల్లనే ఆవిడకు ఇంగ్లాండులోనూ భారత దేశంలోనూ మెప్పు లభించింది. చాలా మంది హైందవులు ఆంగ్లంలో రచనలు చెయ్యడం ప్రారంభించారు. కాని ఈ నవల ఫ్రెంచ్ భాషలో ఉంధి. అందునా ఒక బెంగాలీ కన్య దీన్ని వ్రాసింది" అని వ్రాశాడు. ఈ నవలలో ఉండే కథ అసాధారణమైన కథ. కాని తోరూ తన జీవితంలో ఎవరో అటువంటి మనుషుల్ని చూచి వాళ్ళను ఆధారంగా ఈ కథ అల్లి ఉంటుందని ముఖర్జీ అభిప్రాయం. జేమ్సు డార్మెస్టేటర్ అభిప్రాయం ప్రకారం ఈ కథ ఇంగ్లాండులో నిజంగా జరిగిన కథే. ఇద్దరు సోదరులు ఒకే పిల్లను ప్రేమించి, అందులో ఒకరు అసూయాపరుడై రెండోవాణ్ణి చంపడం జరిగింది. కాని ముఖర్జీ ఈ విషయం ఒప్పుకోలేదు. అ సంఘటన జరిగిన నాటికి తోరూ ఇంగ్లండులో ఉండ లేదు అన్న విషయం తేలలేదు. అంతేకాక ఆ నవలను తోరూ ఇంగ్లండులోనే ప్రారంభించిందన్న విషయం స్పష్టం కాలేదు. ఆ నవలను తోరూ వ్రాసేటట్లూ దానికి అరూ బొమ్మలు వేసేటట్లూ అనుకున్నారే కానీ, అందులో బొమ్మలు లేవు కాబట్టి బహుశా తోరూ దాన్ని అరూ చనిపోయాకే వ్రాసిందేమో అనుకోవాల్సి వస్తుంది. అదీకాక కేవలం

ఇంగ్లండులో ఉన్నప్పుడే ఈ నవలను తోరూ వ్రాసి ఉంటే అందులో భాష అంత నిర్దుష్టంగా ఉత్తమంగా ఉండేది కాదేమో! కారణం తోరూ అప్పు డప్పుడే ఫ్రెంచ్ నేర్చుకోవడానికి కంకణం కట్టుకున్నది. మేరీకి వ్రాసిన ఉత్తరాల్లో ఒక్కసారికూడా తను వ్రాసిన ఈ నవలను గురించి వ్రాయక పోవడమే చిత్రం. డార్మెస్టేటర్ అభిప్రాయం ప్రకారం తోరూ తనకు 18 ఏళ్ళప్పుడు 1874 లో అరూ చనిపోయిన తర్వాత వ్రాసిం దీ నవల.

బహుశా ఇందులో కథ, తనకు తల్లి చెప్పే కథల్లో సుందోపసుందుల కథ విన్నాక, తోరూకు తట్టి ఉంటుందని ముఖర్జీ అభిప్రాయం.

తన సోదరి అకాల మరణం తోరూను బాగా కుంగదీసింది. కాని ఆమె నలుగురి ముందు, విచారాన్ని వెలిగక్కే స్వభావం కలది కాదు. అందుకే బయటికి రాకుండా తనలో కరడుగట్టుకుపోయిన భావాలకు జీవం పోసి మార్గరెట్ పాత్ర ద్వారా వ్యక్తం చేసింది. ఆ నవల లందువల్ల పాఠ కుల్ని బాగా ఆకర్షించ గలిగాయి. మార్గరెట్ పాత్ర చిత్రణా, ఆవిడ అకాల మృత్యువూ మరీ ఎక్కువగా పాఠకుల్ని కదిలించ గలిగింది. తోరూ చని పోయాకే ఈ నవల ప్రచురింప బడడం వల్ల, తోరూ అకాలమరణం కూడా ఈ నవలలోని మార్గరెట్ జీవితంపట్ల ఆకర్షణను పెంచింది.

తను తల్లి కావాలని మార్గరెట్ పడ్డ తపన వెనక తోరూ హృదయ వాంఛకూడా ఉన్నదనిపిస్తుంది. బాగా బలంగా ఎక్కువకాలం బ్రతికి, పెళ్ళి చేసుకుని పిల్లల్ని కనాలనే స్త్రీ సహజమైన వాంఛ తోరూకు కూడా ఉండి ఉండవచ్చు. ఆవిడ తన జీవితంలో ఎవరినైనా ప్రేమించినట్లూ, ఎవరినో పెళ్ళి చేసుకోవాలనుకున్నట్లూ మనకు తెలియక పోయినా, తనకే అవ్య క్తంగా గుప్తంగా ఉండిపోయిన ఈ వాంఛ ఆవిణ్ని కదిలించి ఉండవచ్చు.

జేమ్స్ డార్మెస్టేటర్, ఎడ్మండ్ గాసె, ఈ ఇద్దరూ తోరూను. ఆనాటి ప్రఖ్యాత నవలా రచయిత్రులతో పోల్చి విమర్శించారు. మిసెస్ గాస్కెల్ లనే ఆవిడ చార్లెట్ బ్రాంటీ జీవిత కథ వ్రాసింది. దాన్ని చదివి అందులో హృదయాన్ని కదిలించేటట్లుగా చిత్రితమైన బ్రాంటీ సోదరీమణుల జీవితాల చేత బాగా ప్రభావితురాలైంది తోరూ. "చుట్టూ దట్టమైన బురద ప్రాంతానికి మధ్యగా, ఆ మారుమూల కుగ్రామంలో ముగ్గురప్పచెల్లెళ్ళూ ఎలా జీవితం గడిపారో తలుచుకుంటుంటేనే భయంగా ఉంది. అమేయ ప్రతిభావంతులైన

తాము తమ ప్రపంచంలోనే నివసించడం అంటే మాటలా?'' అంటూ మేరీ కొకసారి ఉత్తరం వ్రాసింది తోరూ.

చార్లెట్ అక్కలిద్దరూ క్షయ వాతపడి మరణించారు. తోరూ మలచిన మార్గరెట్ పాత్ర బ్రాంటీ సోదరీ మణులతో ఎంత చక్కగా సరిపోతుంది? విక్టోరియన్ యుగానికి చెందిన నాయికల కుండే సాధు ప్రవర్తనా, విషాద భరితమైన దృక్పథం రెండూ తోరూ నవల నిండా ఎక్కడ పడితే అక్కడ కనిపించగలవు. విల్లెట్‌లోని 'లూసీ' పాత్రగానీ, జేన్‌ఐర్ పాత్రగానీ తోరూ తీర్చిదిద్దవలసిన పాత్రలు. జేన్ ఆస్టిన్, జార్జి ఇలియట్ రచనా పద్ధతిలో తోరూ రచనా పద్ధతి ఎంతో పోలికలతో కనిపిస్తుంది. బ్రాంటీలను గురించి వ్రాస్తున్నప్పుడు, తనను గురించి కూడా లీలగా తోరూకు స్ఫురించిందేమో!

"ఆ తండ్రికి ఎట్లా ఉంటుంది? ఒక్కడే యార్క్‌షైర్ కుగ్రామంలో తన పిల్లలందరూ తన కళ్ళముందే ఒకరి తర్వాత ఒకరు మరణిస్తుంటే, ఒంటరిగా బ్రతికీ ఉండడంలో ఎంత విసుగు! నిజానికి మన జీవితాల్లో జరిగే విషాదకర ఘటనలకంటే ఎక్కువైనవి కథల్లో ఏం కల్పించగల మని!'' అని చార్లెట్ బ్రాంటీని గురించి వ్రాసింది తోరూ.

తోరూ రెండో నవల 'బినాకా'. దీనికే మరో పేరు 'స్పానిష్ కన్య'. ఈ నవల పూర్తి కాలేదు. అందులో ఎనిమిది ప్రకరణాలు మాత్రమే గోవిన్ చందర్‌కు లభించాయి. తోరూ మరణం తర్వాత అది బెంగాల్ పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడ్డది. 1878 జనవరి నుండి ఏప్రెల్ వరకూ ఈ ప్రచురణ సాగింది. దానికి చిన్న జ్ఞాపికగా గోవిన్ చందర్ ఇలా వ్రాశాడు: ఇంతవరకూ ఈ కథను మలిచిన మృదుహస్తం తోరూ దత్తుది. ఇది ఇక్కడితో ఆగిపోయింది. ఆవిడ చేతుల్లో నుండి కలం జారిపోవడానికి అనారోగ్యమా కారణం? అని నే ననుకోను. బహుశా ఈ నవల తోరూ తొలి ప్రయత్నమై ఉంటుంది. అందువల్లనే ఆవిడ అసంపూరిగా విడిచిపెట్టేసింది. ఇట్లా ఎందుకంటున్నానంటే, తోరూ పూర్తిచేసిన ఫ్రెంచ్ నవలలో భాష ఇంతకంటే బాగుంది. ఇదేకాక ఇలాగే అసంపూర్తిగా మిగిలిన పద్యభాగాలు కొన్నీ, వచనాలు కొన్నీ అసంస్కృతంగా, అల్లిబిల్లిగా ఉన్నాయి.

బినాకా కథ కూడా విషాద భరితమైందే. అలాగే 'జర్నల్' కథ కూడాను. జర్నల్ ఇంగ్లీషులో వ్రాయబడ్డది. ఒక ఇంగ్లీషు గ్రామంలో

నివాసం ఏర్పరచుకున్న స్పానిష్ స్త్రీ కుమార్తె బినాకా గ్రేషియా. ఆవిడ మర్యాదస్థుల కుటుంబానికి చెందిందే. చలి విపరీతంగా తోచే ఫిబ్రవరి నెలలో బినాకా అక్క ఇనెజ్ అంత్యక్రియల సన్నాహంతో కథ ప్రారంభ మవుతుంది. ఆ విచారంలో పూర్తిగా బినాకా మునిగి ఉండగా ఆవిడ పరిచారిక మార్తా ఆవిణ్ణి దుఃఖాన్ని దిగమింగే ప్రయత్నం చెయ్యమని బతిమాలు కుంటుంది. ఒక సంవత్సరం గడిచాక ఇనెజ్‌ను ప్రేమించిన ఇంగ్రామ్ అనే యువకుడు బినాకాను వివాహం చేసుకోవాలనుకుంటాడు. ఈలోగా బినాకా తండ్రి మరణిస్తాడు. బినాకా లేడీ మూర్‌నూ ఆవిడ కుమారుణ్ణీ కలుసు కుంటుంది. లార్డ్ మూర్‌ను ప్రేమిస్తుంది. కాని రెండు కుటుంబాలవాళ్ళకూ ఈ పెళ్ళి యిష్టం లేదు. అందువల్ల లార్డ్ మూర్ క్రిమియన్ యుద్ధంలో చేరిపోతాడు. ఇక్కడితో కథ ఆగిపోయింది. కథంతా ఎక్కడ చూచినా విపరీతంగా ఊహా లోకంలో ఉన్నట్లూ, విషాదభరితంగా ఉన్నట్లూ కని పిస్తుంది. చకచకా ఈ కథ నిట్లా పొడిగించడంవల్ల మరింత విషాదాన్ని చిత్రించవలసి ఉంటుందని తోరూ కూడా భావించి ఉండవచ్చు. అందుకే ఆవిడ దీన్ని వదిలేసి తన ఫ్రెంచ్ నవలను అందుకుని ఉండవచ్చు. ఇందులో కొంత కాకపోతే కొంతైనా ఆనందానికీ, సుఖానికీ చోటు కనిపి స్తుంది. బినాకా తన అక్క చనిపోయిం తర్వాత పూర్తిగా దుఃఖంలో మునిగి మిగతా ప్రపంచాన్నంతటినీ మర్చిపోవడ మన్నది తోరూ మానసిక స్థితికి అనుగుణంగా లేదు. అరూ చనిపోయిన తర్వాత తోరూ ప్రవర్తన ఆ విధంగా లేదు.

# 15. కథలూ - గాథలూ

ప్రాచీన గేయ గాథలూ, హైందవ పౌరాణిక గాథలూ అనే పుస్తకం తోరూ వ్రాయడంవల్ల అంతవరకూ అరవిచ్చిన పద్మ ముకుళం ప్రాచ్య సూర్యుని కిరణాల వల్ల పూర్తిగా వికసించినట్లు తోచింది. తోరూ ఇంగ్లం డునూ, ఫ్రాన్సునూ ఎంత ప్రేమించినా, ఆదేశాలను గురించి వ్రాసిన వ్రాతల్లోగానీ, చేసిన అనువాదాలలోగానీ అంతర్గతమైన సుప్తచేతన స్థితిలో వాటితో తాదాత్మ్యాన్ని పొందలేక పోయిం దనుకోవచ్చును. కేవలం

సంస్కృత క్షేత్రం నుంచి ధాన్యపు పనల్ని సేకరించి నప్పుడే ఆవిడలో నిక్షిప్తమైన కవితా సామర్థ్యం కన్ను విప్పిందని చెప్పవచ్చు. తోరూ రచనల్లో షీఫ్, ఎడ్మండ్ గాసే చెప్పినట్లు అపరిపక్వ రచన. కానీ అది అందరి కుతూహలాన్నీ రేకెత్తించిన రచన. ఆయనే తోరూ ఇంగ్లీషులో వ్రాసిన పద్యాలను గురించి ప్రస్తావిస్తూ, అవి తోరూకు సంబంధించిన వారసత్వంగా భావించాడు. ఆవిడ రచనల్లో చివరిపీ, మిక్కిలి పరిపక్వతను చెందినవీ ఈ గేయగాథ లే.

ఈ గ్రంథం తొలి ముద్రణ 1882 లో లండన్‌లో జరిగింది. కేగన్ పాల్, ట్రెంచ్ కంపెనీవాళ్ళు గాసే పరిచయపూర్వకంగా వ్రాసిన స్మృత్యంకంతో పాటు దాన్ని అచ్చు వేశారు. అప్పటినుంచీ అది అయిదు ముద్రణల్ని పొందింది. అందులో చివరి ముద్రణను, ఆ ప్రకటన కర్తలే 1927 లో ప్రకటించారు. దీన్లో గాసే పరిచయం లేదు. దాని స్థానంలో ఏ మాత్రమూ ఒక స్థాయికి చెందని ప్రకటన కర్త వేసిన క్లుప్త వివరణం మాత్రం ఉంది.

"తోరూ బ్రతికే ఉంటే, అప్పటికి పేరు సంపాదించుకున్న ఏ ఐరోపీయ రచయిత కన్నా ఆవిడ తక్కువ వయసులోనే ఉండేది. ఆవిడ కీర్తి బ్రతికి ఉన్నప్పుడు చెప్పుకోదగ్గదే అయినా దానికి ఎక్కువ ప్రచారం ఆవిడ మరణం తర్వాతనే లభించింది" అని గాసే తన పీఠికలో వివరించాడు. ఈ గేయ గాథలు తోరూకు, ఆమెకు ఎక్కువగా పరిచయమైన ఆమె ప్రపంచంలోనే శాంతి లభించేట్లుగా చేయగలిగాయి.

ఇ. జె. థామస్, తోరూను గురించి విమర్శనాత్మకంగా వ్రాస్తూ, "కీట్సును ప్రబోధించినట్లుగా ఒక కంఠధ్వని పట్టుదలగా, అదే పనిగా ఆవిడ చెవుల్లో ఆదేశాలు ప్రసరించింది. "నువ్వేం చెయ్యదలచుకున్నావో త్వరగా చెయ్యి" అని ఆజ్ఞాపించింది. అరూ మరణం తర్వాత ఆ విషయంలో తోరూ మరీ తొందరపడిపోయింది. ఆ తొందరా, అపరిపక్వత కనిపించే చోట్లు, ఆవిడ రచనలో చాలానే ఉన్నా ఛందో బందోబస్తుల్ని అధిగమించి ఉన్నతంగా భాసించిన పట్టులు కూడా ఎన్నో కనిపిస్తాయి. అనుభవం వల్ల ఆవిడ రచనల్లో కనిపించే లోపాలన్నీ సమసిపోయేవే. అవేవీ బలంగా వేళ్ళు తన్నుకుని పాతుకుపోయే లోపాలు మాత్రం కావు.

"ఆవిడ రచనల్లో ఈ గేయ గాథలు వాటి కవిగా, నిత్యంగా నిలబడీ పోయేంత శక్తిమంతమైనవి. అక్కడక్కడా వాటిల్లో నిర్లక్ష్యం కనిపిస్తుంది. ఏకసూత్రత ఉన్నట్లుగా అనిపించదు. అయినా వాటిల్లో అంతర్గతంగా గ్రథనశక్తి కనిపిస్తూనే ఉంటుంది". ఈ మాటలు విమర్శకుడికి రచయిత మీద సానుభూతి లేకపోవడాన్ని సూచిస్తాయి. "తోరూ తను చేపట్టిన ఇతి వృత్తానికి వెలిగా నిల్చున్నదే గాని, అందులోకి చొచ్చుకుపోయే ప్రయత్నం చేయలేదు" అనే అభిప్రాయం కూడా విమర్శకుడిదే. ఇక్కడ థామస్ బహుశా ఒక విదేశీయుని కుండవలసిన దృష్టితో మాత్రమే చూచి, తోరూ పట్ల ఇటువంటి విమర్శను వెలిబుచ్చడం జరిగి ఉంటుంది. తోరూ క్రైస్తవి అయినా హైందవేతి వృత్తాలను చేపట్టిన చోట వానితో తాదాత్మ్య వహించే శక్తి ఆవిడకు ఉన్నదన్న విషయాన్ని థామస్ సరిగా అర్థం చేసుకోలేక పోయాడనవచ్చును. అదే విధంగా ప్రాచీన హైందవ పురా గాథలు కేవలం ఉన్నతమైన ఏ విలువలూ లేని పాతకాలపు కథలని ఆయన భావించడం తప్పు. గ్రీకు పురా గాథలకు వలెనే ఇవి కూడా అందరికీ తెలిసినవీ. ప్రాచీన సంస్కృతినీ, జాతి వారసత్వాన్నీ తెలియజేసేవి. తోరూ చెప్పినట్టు సంస్కృతం గ్రీకు భాషకు మల్లే అతి ప్రాచీనమైనదీ, ఉత్కృష్టమైనదీ. సంస్కృతేతి వృత్తాలను విదేశీ ప్రపంచానికి అందించిన ఘనత తొలుదొల్తగా తోరూకే చెందుతుంది. థామస్ చెప్పినట్లుగా "తోరూ అద్భుతమైన వ్యక్తుల్లో ఒకతి. ఆమె స్థానం ఓటు మెరుగని ఉద్రేకపూరిత వ్యక్తిత్వం కల ఎమిలీ బ్రాంటీ శాఫోల పక్కన."

హైందవ పురా గాథల పట్ల తోరూ దృష్టి సానుభూతి పూర్ణమైనది. సమన్వయ లక్షణం కలది కూడాను. కాని రాజర్షి అనే ఒక ఖండికలో మాత్రం, ఆ రాజర్షి తన ప్రేమను ప్రాపంచిక విషయాల కోసం త్యాగం చేసి ఉండకూడదని ఆవిడ భావించింది.

భగవంతుని రక్షణ కింద
భద్రంగా బ్రతుకుతున్న మాకు
దేవుడంటే రూపు కట్టిన
ప్రేమేనని తెలుసు.

ఆయన అర్చనకోసం
వైరాగ్యం అక్కర లేదనీ
జపతపాలూ గాఢ చర్చలూ
పరమాత్ముని పట్టివ్వవనీ
పూర్ణంగా తెలుసు మాకు!

స్వార్థ మంటే తెలియకుండా
సర్వత్రా స్వచ్ఛంగా
ఆయన ప్రేమను అన్ని విధాలా
సరిపోలే ప్రేమతోటే
అర్చించడం తెలుసు మాకు.

రాజర్షి అయిన భరతుడు తన పెంపుడు లేడి పట్ల అంత ప్రేమను చూపించడం పాపం చేయడం వంటిదే అన్న బ్రాహ్మణుణ్ణి తోరూ సహించ లేకపోయింది. ఈ ఒక్కచోట తప్ప మరెక్కడా ప్రాచీన హిందూ ప్రపంచం పట్ల తోరూకు సానుభూతి రహితమైన దృష్టి ఉన్నట్లుగా తోచదు.

తోరూ వాడే విశేషణాలూ, ఒక్కొక్కచోట ఆవిడ ఆలోచించిన పద్ధతీ, మధ్యరకానికి చెందినవని థామస్ ఒకచోట విమర్శించడం జరిగింది. నిజం గానే తోరూకు కేవలం లయకోసం, విశేషణాలను పదేపదే పునరుక్తం చేసే అలవాటు ఉంది. కాని ఆవిడ నడక చాలా సరళంగా ఉంటుంది. ముఖ్యంగా ఆవిడ ఫ్రెంచ్ అనువాదాలు చేసినప్పుడు అక్కడక్కడా కనిపించిన కుంటి నడక, ఈ కథాగేయాలలో ఎక్కడా కనిపించదు. పైగా ఇక్కడి నడక చాలా ఉద్రేకభరితంగా ఉంటుంది. తోరూ పుష్కలమైన సంస్కృత సాహిత్య సాగరం వేపు, కీట్స్ కవితలోని కార్తెజ్ చూచినట్లే, నిర్నిమేష దృక్కులతో చూడడం మనకు కనిపిస్తుంది.

"పసిఫిక్ మహా సముద్రం వేపు
పరీక్షగా చూచాడు కార్తెజ్
చుట్టూ ఉన్న పరివారమంతా

చకితులై ఊహల్ని మథిస్తుండగా
అక్కడే డెరియన్ శిఖరం మీద
అచంచలమై నిలిచింది
అతని చూపు!"—

తోరూ తన జాతికి సంబంధించిన ప్రాచీన సాహిత్యాన్ని మథించలేక పోయింది. అట్లా చేయడానికి పరిపూర్ణ జీవితం ఆవిడకు లేదు. అందువల్లనే ఇటువంటి లోపాలు ఆవిడ రచనలలో తలలెత్తడం జరిగి ఉండవచ్చు. అపరిపక్వతవల్ల వాటిల్లిన లోపాలు ఆవిడ రచనల్లో ఎన్ని ఉన్నా, ఆవిడ పద్యాలు శక్తివంతమైనవి. ఆవిడ గేయ గాథల నుండి అందుకు ఉదాహరణంగా చక్కని ఈ రెండు పద్యాలనూ పరిశీలించ వచ్చును.

(1) ఉష స్సంధ్యలో
అడవి మొత్తం
అందంగా మెరుస్తున్నది.

ఉక్కలో ముంచి
ఉక్కిరిబిక్కిరి చేసే
నడి మధ్యాహ్నాన
మరీ సుందరంగా మెరుస్తున్నది.

అస్తమిత సూర్యుని
అనుసరిస్తూ
తను మరుగౌతున్న
కపటు సంధ్య!

ఆ వెంట అనుసరించే
అమృతాంశు రేఖ
అన్ని ఆకారాలకూ

సున్నదనం నేర్పి
ఎత్తు పల్లాలను
మెత్తగా సవరిస్తున్నది.

అన్ని రంగుల్లోనూ
కసటుదనం మాన్పి
మృదుత్వాన్ని సంతరిస్తున్నది,

నీల సౌందర్యం విరిసిన
వెండి జలతారు మేలిముసుగును
సమకూరుస్తున్నది.

అల్లంత దూరాన
కొండపక్కన పోకచెట్లు
కిరీటం విప్పుకున్నచోట
మంచు తడుపుకు విచ్చుకుంటూ

మధుర గంధాన్ని
ముకుళసహస్రం వెదజల్లే చోట
చేయీ చేయీ కలుపుకుని
వనమార్గాన్ని అనుగమిస్తూ
ఆలూ మగలు రహిస్తున్నారు.

అతి చిక్కని
అడవి లోపలికి
తోడు తోడుగా పయనిస్తున్నారు.

(2) ఈ జగత్తులో ఎవరూ
నిజహృదయ గత కాంక్షల్ని
నెరవేర్చుకోలేరు

బ్రతుకంతా పండుగగా
పరవశాన్ని భజించలేరు
బంగారానికి మల్లే మన
బ్రతుకంతా ఒకటే ఒరిపిడి
నిప్పులో కాగే నిరంతర కష్టం

ఎవరు చేసుకున్న కర్మ
వా రనుభవించక తప్పదు
స్నేహితు లెవరూ
చేయూత నివ్వలేరు.
ఏదీ నిత్యమై
పరిపూర్ణంగా పరిఢవిల్లదు.

ఎవరి పాపాలు వారికి
చివరివరకూ నిలచిపోగా
ఆ పాపాల ఫలితాలను
అనుభవించక తప్పదు వారికి.

నా భర్తను
నా వ్రతాచార దీక్షవలన
నేను రక్షించగలనా!
ఓ, కాదు -
అది నిష్ఫలమైన
నటన మాత్రమే
చిరంతనమైన న్యాయం
ఫలాన్ని నిర్ణయిస్తుంది!

అయితే పై రెండు కవితల ప్రారంభం చాలా చక్కగా ఉన్నా, ఆ అందాన్ని తోరూ చివరి వరకూ పట్టి ఉంచలేకపోయింది. పద్యాల చివర పాదాలు కుంటడం (మూలంలో) మనం చూడవచ్చు. కథ చెప్పడం లోనే ఆవిడ పూర్తిగా లగ్నం కావడంవల్ల ఈ లోపం జరిగి ఉండవచ్చు.

తోరూ ప్రాచీన హైందవ దేవతల్ని గౌరవించింది. యముడూ, ఇతర దేవతలూ ఆవిడ పొగడ్తల నందుకున్న వాళ్ళుగా కనిపిస్తుంటారు. ప్రాచీన విశ్వాసాల మీద వేళ్ళు తన్నుకున్న, ఆవిడలోని గౌరవాభిమానాలకు, ఆవిడ అవలంబించిన క్రైస్తవం ఏ విధంగానూ ప్రతిఘాతం కలిగించలేదు. ఇతర మతాలను సంకుచిత దృష్టితో చూడలేదు తోరూ. ఆ విధంగా ఆవిడ నిజమైన క్రైస్తవి. ఇంకా నూటికి నూరు పాళ్ళూ హైందవ కన్య. విశాల దృక్పథం కలిగి పరమత సహనం కల తోరూ ఏ సిద్ధాంతాన్నీ మూఢ విశ్వాసంతో పట్టుకు పాకులాడ లేదు.

తోరూ గేయాల నిండా హైందవ భావ గాఢతా, సంప్రదాయమూ కనిపిస్తున్నా, తన జాతినీ దేశాన్నీ ఆవిడ కవిత్వం ప్రతిబింబిస్తూనే ఉన్నా, కొంత మంది విమర్శకుల అభిప్రాయం ప్రకారం తోరూ, సంస్కృత సాహిత్యంలో ఉన్న గొప్పతనాన్ని తన గేయాలలో ప్రతిబింబించ లేకపోయింది. ఆవిడ గేయ గాథల్లో సంస్కృతంలో కనిపించే విషాద స్వర మూర్ఛనలు లేవు. సంస్కృత భాషవల్ల చెవికి వినిపించే గానమాధుర్యం ఇందులో లేదు. చివరికి ఆవిడ మాతృభాష అయిన బెంగాలీలో వినిపించే స్వర మాధుర్యమైనా ఇక్కడ లేదు.

ఉపమా వైభవం, ప్రకృతి చిత్రణ,తమ కుండవలసిన అలంకారాలు- అన్నీ ఇక్కడ రంగుల్ని పోగొట్టుకుని కనిపిస్తాయి. భావ ప్రకటనలో ఉండే అందం, భావగాఢతా ఆంగ్లభాష వాడుక వల్ల అణచివేయబడ్డాయి. తోరూకు ఆ భాషలో ఎంత ప్రావీణ్యం ఉన్నా, ఫ్రెంచ్ భాషలో ఆవిడకు కనిపించిన మార్దవమూ, వర్ణసమృద్ధీ ఇక్కడ లేదు.

కాళిదాసునూ, బాణునీ, లేదా మరే సంస్కృత కవినైనా చదివితే అక్కడ కనిపించే మధుర సమాస బంధురతా, మనస్సును అలరించే నాయికా నాయకుల వర్ణనా, రాజుల్నీ దేవతల్నీ చిత్రించే పట్ల చూపించే వర్ణనా వైభవమ్మూ, ప్రకృతి రామణీయకమూ - వీటి నన్నిటినీ తోరూ

సరిగ్గా అలాగే ఆంగ్లంలోకి తీసుకురాలేకపోయింది. అందుకు విదేశీయులకు అర్థమయ్యేటట్లు తన అనువాదాన్ని ఆమె చాలా సరళంగా చేసి క్లుప్తం చెయ్యడమే. కాని ఆవిడ చేపట్టిన ఇతివృత్తం ప్రాచీనం కావడంవల్ల ఆవిడను ప్రాచీన రచయితల కోవలోనికి చేర్చవలసి వచ్చింది. కానీ తోరూను సాహిత్య ప్రపంచంలో నాయకు లనదగ్గవారిలో ఒకతెగా పరిగణించక తప్పదు. కారణం యూరపు ఖండంలో బెంగాలీని గురించి నాసిరకమైన అంచనా ప్రచారంలో ఉన్న కాలంలో పాశ్చాత్యుల దృష్టిలో దాన్ని ఉన్నత స్థితికి తెచ్చింది ఆవిడే! బెంగాలీలు తమను గురించీ, తమ దేశాన్ని గురించీ చాలా నిరుత్సాహంలో మునిగిపోతున్న రోజుల్లో, ఆమె ఇచ్ఛాపూర్వకంగానే తన్ను తాను విదేశీ కవిత్వ రచనా మార్గం నుండి మళ్ళించుకుని తన మాతృదేశపు కథల్ని వ్రాయడానికి పూనుకున్నది.

"ప్రాచీన హిందూదేశ గేయ గాథలూ, పౌరాణిక కథలూ" – అనే ఆవిడ గ్రంథంలో మిక్కిలి ప్రసిద్ధి కెక్కినదీ, నిడివైనదీ సావిత్రి కథ. అందులో పద్యాలన్నీ హుందాగా ఉండి సూటిగా విషయాన్ని వెల్లడిస్తుంటాయి. ఇక్కడ ప్రకృతి చాలా రమణీయంగా వర్ణింప బడ్డది. ఇక్కడ రచయిత్రి వాడిన ఛందం కూడా ఏ మాత్రమూ విసుగు కలిగించకుండా సరళంగా సాగింది. ప్రాచీన ఇతిహాసానికుండే హుందాతనమూ, ఔన్నత్యమూ దానికి ఉండడమే కాక అందులో పద్యాలన్నీ భావావేగాన్ని కలిగి కాల్పనిక లక్షణంతో శోభించడం కనిపిస్తుంది.

పురాణాల నుండీ, ఇతిహాసాల నుండీ గ్రహించిన ఇతర కథల ఎంపిక కూడా చక్కగానే ఉంది. డాబు దర్పాలు లేని వినయభరితమైన ఆ కథావృత్తం తోరూను బాగా ఆకర్షించింది. అటువంటి కథ ఏరుకోవడం వల్ల, నీతి ప్రాధాన్యాన్ని వడకట్టి చూపడానికి తోరూకు వీలు కలిగింది. హైందవ పత్ని పట్లా, వీరవనిత మీదా తోరూ మనస్సులో గూడుకట్టుకున్న ఆరాధనా భావాన్నంతటినీ ఆమె సావిత్రిలో చక్కగా చిత్రించ గలిగింది. 'సీత'లోనూ అదే పరిణత చిత్రణ కనిపిస్తుంది. వాళ్ళ కుండే చంచల రహితమైన స్థిరప్రవృత్తి తోరూను ఎంతగానో కదిల్చి వేసింది.

మరో ఖండిక 'లక్ష్మణుడు'. సావిత్రి వలె ఇది నిడివైంది కాదు. సీతకూ, ఆవిడ మరిదికీ మధ్య జరిగిన సంభాషణ అందులో చక్కగా

చిత్రింపబడ్డది. తన్ను రక్షించడానికి తదేకంగా నిలచి ఉన్న లక్ష్మణుని గాఢశీలమూ, ఆ శీలాన్ని సీత చులకన చేయడమూ అక్కడ కనిపిస్తుంది.

'యోగాఢ్య ఉమ' అనే ఖండిక తోరూ, తల్లి దగ్గర నుండి తాను విన్న జానపద కథ నుండి గ్రహించింది. అందుకే దాని చివర,

నేను చెప్పే కథ
అసంబద్ధమే కావచ్చు
ముందు నడిచే కాలానికి
ఎందుకూ పనికిరానిది కావచ్చు
ఆ కథ చెప్పిన పెదాలంటే
అమితమైన ఇష్టం నాకు
నేను పాడే పాటల మధ్య
నిశ్చయంగా అది ఉండాలనేది
అందుకే!

—అని చెప్పుకున్నది తోరూ.

"ఆ కథ రమణీయమైన జానపద కథ. అందులో భావం పరమ రమణీయ మైనది. అటువంటి భావాలు మా భారతదేశంలో వేలకొద్దీ ఉన్నాయి. అతి సామాన్య బాలిక రూపంలో దేవీ సాక్షాత్కారాన్ని చిత్రించడంపట్ల తోరూ ఎంతో చాకచక్యాన్ని చూపించింది."

'రాజర్షి-హరిణి; ధ్రువుడు' అనే రెండు ఖండికలు మొదట బెంగాల్ పత్రికలలో వెలువడ్డాయి. ఈ రెండూ ముక్త ఛ్ఛందంలో రచించినవి. ఈ ముక్తచ్ఛందం తోరూ చేతుల్లో, ఆవిడ చెప్పినట్లు రూపం తాల్చింది. ఈ రెండు కథలూ విష్ణుపురాణం లోనివి. రాజర్షి అయిన భరతుడు ఒక లేడిపిల్ల నీటిలో మునిగిపోతూ ఉండగా రక్షించడం మొదటి కథ. అతని ఏకాంత వనవాసంలో ఆ లేడి అతనికి తోడూ నీడా! అతనిలో ఉండే మానవ సహజమైన బలహీనతవల్ల అతడు తాను నిర్వహించవలసిన ఆశ్రమ విధులను లేడిమీది ప్రేమవల్ల విస్మరించడం సంభవిస్తుంది. కానీ తోరూ మానవునకు కల ప్రేమించే గుణాన్ని సమర్థిస్తూ, ఋషు లనుసరించే సర్వ

సంగ పరిత్యాగ లక్షణాన్నీ, దాన్ని బోధించే మత విధానాన్నీ ప్రశ్నిస్తుంది.

ధ్రువుని కథ అందరికీ తెలిసిన కథే. దాన్ని పూర్తిగా చెప్పి, చివర తోరూ—

ప్రార్థనా తపస్సూ
ధ్రువుణ్ణి గెలిపించాయి
ఎత్తుగా ఆకాశ మధ్యాన
నక్షత్రంలా వెలిగే వాడిని
నక్తంచర జీవు లందరూ
తిలకిస్తూనే ఉంటారు''—

అని ముగించింది.

తరువాత ఖండిక 'బుట్టో'. అతడు ఒక సామాన్యమైన వేటగాని కొడుకు. జగత్ప్రసిద్ధుడైన ద్రోణాచార్యుని దగ్గర విలువిద్య అభ్యసించాలన్నది అతని తీవ్రకాంక్ష. ద్రోణుడూ, ఆయన శిష్యులైన రాజకుమారులూ అతణ్ణి హేళనచేయగా, అరణ్యంలోకి ప్రవేశించి, ద్రోణాచార్యుని ప్రతిమను తయారుచేసి, అతనిమీద తనకు గల భక్తివల్లనే ఆ విద్యను స్వయంగా నేర్చుకున్నాడు. కాని ద్రోణుడు గురుదక్షిణ అడగగానే, తాను నేర్చుకున్న విద్య కంతటికీ ఏది ఆధారమో, దాన్నే గురువుకు సాహసంతో ఇచ్చివేశాడు. ద్రోణుడు తాను అర్జునునకు ఇచ్చిన మాటను చెల్లించుకోవడానికి ఆ కోరిక కోరక తప్పలేదు. అందుకే ద్రోణుడు,

''పయోధుల మధ్య నీ ప్రతిష్ఠ
ప్రతిధ్వనిస్తుంది.
స్వయంశక్తీ, సత్యమూ, నమ్రతా
ఉదాహరించే
అదను కలుగగా
నమ్మకంగా జనమంతా
నీ పేరే చెప్పుకుంటారు.''

అని అతణ్ణి ఆశీర్వదించాడు.

అదే రకంగా తోరూ కూడా తనకు తాను వంద సంవత్సరాలపాటు పచ్చగా నిలిచే కీర్తిని సంపాదించుకుంది. అది యింకా భవిష్యత్తులో ఎన్నో సంవత్సరాలు నిలిచి తీరుతుంది. దేశానికి వారసురాలనని ఆవిడ పొందే గర్వంలో, ప్రతి కణంలోనూ తాను భారతీయురాలనన్న విషయం స్పష్ట మవుతున్నది. ఆవిడ తనంతట తానే, భారతదేశానికి వారసత్వంగా మారి కాల పరీక్షకు నిలిచి, అందరి జ్ఞాపకాలలో జీవిస్తూ, తన దేశానికి కీర్తి ప్రతిష్ఠలు కొని రా గలిగింది.

ఎంతో నాజూకుగా, ఉద్రేకభరితంగా, ముగ్ధ ముకుళంలాగా కనిపించే తోరూ కొంచెంసేపే అయినా, నిండుగా వికసించి, మరుగుపడని పరిమళా లను వెదజల్లి వెళ్లిపోయింది.

పుస్తకం చివర ఆవిడ పేర్చిన గేయాలలో సరుగుడు చెట్టు అనే ఖండిక చివర ఒక పాదం ఉంది.

"నిన్ను, విస్మృతి కొని తెచ్చే
శాపాలనుండి కాపాడుతుంది!"—అన్నదే ఆ పాదం.

ఆ పద్యం ఎప్పుడూ జనం యొక్క స్మృతిపథంలో మెదులుతూనే ఉంటుంది. దాన్నే అందరూ సాధారణంగా ఉదాహరిస్తుంటారు. ఈ పద్యాన్ని చూచి E. J. Thomas "ఒక విదేశీయురాలిచేత ఆంగ్లంలో వ్రాయబడ్డ ఈ పద్యం ప్రశస్తమైనద"ని ప్రశంసించాడు.

గతకాలం మీద తోరూ కుండే మమతనీ, ఆధిభౌతికమైన సౌంద ర్యాన్ని వీక్షించే ఆవిడ అంతర దర్శనాన్నీ ఈ పద్యం చాలా చక్కగా ప్రదర్శిస్తుంది. ఆవిణ్ణి లబ్ధప్రతిష్ఠులై, కీర్తి శరీరులైన సమకాలి కాంగ్ల కవుల వరుసలో నిలువబెట్టడానికి ఈ ఒక్క పద్యం చాలు!

## మా సరుగుడు చెట్టు

చుక్కల్ని అందుకుంటూ
చక్కగా పెరిగిన చివళ్ళతో
మోటు దేలిన మానుచుట్టూ
లోతు నొక్కుల చిహ్నాలతో

అజగరాన్ని అనుకరించే
అద్భుతమైన సరుగుడు చెట్టు!

చిక్కగా అల్లుకుపోయిన
తీగె కౌగిలి వాగురలో
మరో చెట్టేదైనా అయితే
మరణించే మాటే నిజం!

ఈ అద్భుత వృక్షం
ఠీవిగా చేలం కప్పుకుని
కొమ్మ కొమ్మకూ
సిందూర వర్ణ కుసుమ గుచ్ఛాలు
విప్పుకుని
పగలంతా తేనె టీగల్నీ పక్షుల్నీ
జత కూర్చుకుని ఉంటుంది.

అంధకారంలో మా చెట్టు పాడే
అపూర్వ మధుర గానంతో మునిగి
అఖిల జగతి విశ్రమించిన
అపరాత్రి వేళ
తోట తోటంతా
పరవళ్ళు తొక్కుతుంటుంది.

తెలతెలవారే చల్లని వేళ
తలుపులు తెరిచిన తొలి క్షణాన
ఆనందాన్ని ఆస్వాదిస్తూ
నా నయనాలు ఆ చెట్టును చూస్తూ
వేద తీరుతాయి!

చలికాలంలో అప్పుడప్పుడూ
చిటారు కొమ్మన బొమ్మలాగా
బూడిద రంగు పండు కో తొకటి
బాల భానూదయాన్ని పరికిస్తూ
పరవశిస్తుంటుంది !

కింది కొమ్మల్లో గెంతుతూ ఆడుతూ
సందడిగా దాని పిల్లల మూక !

కలకల విరిసే దిన ప్రాముఖ్యాన్ని
కలకంఠ కంఠనాదం
నలు దిక్కులకూ
ప్రసరిస్తుంటుంది.

గడ్డి బీళ్ళ వైపుకు
అయిష్టంగా కదిలే
అలసత్వం జారని
అలమందలు !

మంచు కప్పుతున్న ముసలి చెట్టు...
నీడల్ని విసిరి ఆక్రమించిన చోట
విశాల సరోవర శరీర భాగాన
మంచు ముద్దల్లాగా, తెల్లగా
మొలిచిన తామర పూలు !

ఇంత అద్భుతంగా ఉందని కాదు
ఈ చెట్టంటే ఇష్టం నాకు !

ఓ నా ప్రియమైన నెచ్చెలులారా !
ఈ చెట్టుకిందనే మనమంతా చేరి

క్రీడించిన జ్ఞాపకాలు
ఏళ్ళు ఎన్ని గడిచినా వీడవు నన్ను !

మీ రూపాలను రంగరించుకున్న భూజం
నా జ్ఞాపకాల రంగంలో మెరిసి
నా కళ్లల్లో వెచ్చని బాష్పాల తెరల్ని లాగి
లోకాన్ని మసక మసకగా నిలబెడుతుంది !

అందుకనే ఈ చెట్టంటే
అమితమైన ఇష్టం నాకు !

తీరస్థ శిలామధ్యాన విరిగే
నీరధి తరంగ నినాదం లాగా
మృత్యు శీతల మర్మర ధ్వని
మ్రోగుతూ నా చెవిలో ఎప్పుడూ !

అది హృదయదారకంగా
ఈ చెట్టు చేసే ఆర్తనాదం !
దిగంతాలకు పాకి
లోకాంతరాలకు ఎగిసిపోయే
విషాద నాదం !

దూర దూరాన ప్రతిధ్వనించే
ఆ రోదన ధ్వని నేను విన్నదే !

ఆ విషాద స్వరమూర్ఛనలు
ఏ నిముషంలో చెవిని సోకినా
నా అంతరంగ దర్శనం లోపల
అద్భుతాకార మొకటి వింతగా
ఆవిర్భవిస్తుంది !

నేను పుట్టిన నా దేశంలో
నా చిన్ననాటి సంతోష వేళల
మనసున హత్తిన నీ రూపమే
సుమా అది వృక్షరాజమా!

నిన్ను తలుచుకుంటూ,
ఎన్నటికీ చెడని
విశ్రాంతిని చూరగొనే
నా ప్రాణాధిక స్నేహితుల్ని
సంస్మరిస్తూ
మీ కోసమే వ్రాస్తున్నాను
మనసునంతా నింపిపెట్టిన
మధుర మైన ఈ స్మృతి గీతాన్ని!

నేను కన్ను మూసిన
కొన్నాళ్ళ తర్వాతనైనా
సదా స్మృతికి వచ్చే
ఉదాత్త వృక్షాల కోవలో చేర్చి
ఉదాహరిస్తారు నిన్ను జనం!

'బారోడేల్' భూజాల లాగా
నిరంతరం నువ్వు గుర్తింపబడతావు.

ఆ చెట్ల అద్భుతమైన కొమ్మలకింద
అనంతమై చంచలించే ఆశాధిక్యం!
శల్యావశిష్ట మృత్యు భయం వెంట
ఛాయాత్మకమైన కాలం పోకడ!

స్పష్టంగా మలచలేదేమో
ఈ స్మృతి గీతాన్ని నేను.

అయినా ఈ నా గీతం
వయినంగా నీ అందాన్ని
పదేపదే ప్రకటిస్తుంది!

నీ మీద నాకున్న ప్రేమ
నిన్ను విస్మృతి కొనితెచ్చే
శాపాలనుండి కాపాడుతుంది!

# ఉపయుక్త గ్రంథసూచిక

(1) ఎ షీఫ్ గ్లీన్డ్ ఇన్ ఫ్రెంచ్ ఫీల్డ్సు - తోరూదత్ :

1. సాప్తాహిక సంబద్ ప్రెస్, భవానీపూర్, కలకత్తా 1876.
2. నవముద్రణ - సాప్తాహిక సంబద్ ప్రెస్, భవానిపూర్, 1878.
3. మరో ముద్రణ - కేగన్‌పాల్ అండ్ కంపెనీ లండన్ 1880.

(2) ఏన్ష్యెన్ట్ బాలెడ్స్ అండ్ లెజెండ్స్ ఆఫ్ హిందూస్థాన్ - తోరూదత్ :

1. ఎడ్‌మండ్ గాసే స్మృతి పూర్వక పరిచయంతో - కేగన్‌పాల్, లండన్, 1882.
2. మరో ముద్రణ - కేగన్‌పాల్ 1927.
3. కాళిదాస అండ్ కంపెనీ, మద్రాసు, సంవత్సరం లేదు.

(3) లె జర్నల్ డి మేడ్‌మాయ్‌సెలి 'డి' ఎర్‌వెర్స్ - తోరూదత్; ఫ్రెంచ్ నవల - మిలె క్లారిస్సే చాదెర్ స్మృతి పూర్వక పరిచయంతో - డి డెయ్‌ర్ - పారిస్ 1879. రాజకుమార్ ముఖోపాధ్యాయ, బెంగాలీ అనువాదం 1849; పృథ్వీంద్రనాథ్ ముఖోపాధ్యాయ 1958.

(4) బియాంకా ఆర్ ది యంగ్ స్పానిష్ మెయిడెన్ - తోరూదత్ - ఎనిమిది అధ్యాయాలు; బెంగాల్ పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడ్డవి. 1878 జనవరి నుండి ఏప్రెల్ వరకు.

(5) ఎ సీన్ ఫ్రం కాంటెంపొరరీ హిస్టరీ - తోరూదత్ - విక్టర్ హ్యూగో, ఎమ్. థెయిర్స్ చేసిన ఉపన్యాసాల అనువాదం. మచ్చుకు వారి కవితలతో సహా - బెంగాల్ పత్రిక జూన్, జూలై 1875.

(6) ఎస్సేస్ ఆన్ హె(న్రీ విన్సెంట్ డెరోజియో అండ్ ది కాంటు డిలిస్లె - తోరూదత్ - బెంగాల్ పత్రిక, డిసెంబర్ 1874.

(7) తోరూ రచనలు ప్రచురింపబడ్డ పత్రికలు-

1. సాటర్ డే రెవ్యూ, లండన్ - 1879.
2. లా గజట్ డి ఫ్రాన్స్ - పారిస్, ఫిబ్రవరి 1879.
3. ది ఇంగ్లీష్ మాన్, కలకత్తా, ఏప్రెల్ 19, 1876, మార్చి 21, 1879.
4. ది స్టేట్స్మన్ కలకత్తా, అక్టోబర్ 26, 1877, జూలై 15, 1878, మార్చి 31, 1879.
5. ది ఎక్జామినర్, లండన్ ఆగస్ట్ 1876, జూన్ 1878.
6. రెవ్యూ డెస్ డ్యూ మాంన్డెస్ (పారిస్) ఫిబ్రవరి 1877, ఏప్రెల్ 1, 1878.

ఇంకా కొన్ని పత్రికలు సంపూర్ణ పట్టిక, హరిహరదాస్ వ్రాసిన తోరూదత్ జీవితమూ సాహిత్యమూ (ది లైఫ్ అండ్ లెటర్స్ ఆఫ్ తోరూదత్) అనే గ్రంథంలో, అనుబంధం 4 లో లభిస్తుంది.

(8) బెంగాల్ పత్రికలో మార్చ్ 1873 నుండి ఏప్రెల్ 1878 వరకూ, వరుస తప్పకుండా వెలువడ్డ తోరూ రచనలు - తోరూ కలకత్తా రెవ్యూకు కూడా ఎక్కువగా వ్రాస్తుండేది.

(9) సావిత్రి - తోరూదత్ - ఇంటర్ మీడియట్ క్లాసులకు పాఠ్యగ్రంథం.

(10) లైఫ్ అండ్ లెటర్స్ ఆఫ్ తోరూదత్-హరిహరదాస్ రైట్; హానరబుల్ హెచ్. ఎ. యల్. ఫిషర్ పరిచయంతో - ఒ. యు. పి. 1921.

(11) ది బెంగాలీ బుక్ ఆఫ్ ఇంగ్లీష్ వెర్స్ - థియొడోర్ డగ్లస్ డన్ సమకూర్చగా, రవీంద్రనాథ్ టాగూర్ చేత పరిచయ వాక్యాలు వ్రాయబడినది. లాంగ్మన్, గ్రీన్ అండ్ కంపెనీ - మెద్రాస్ - 1918.

(12) క్లాసికల్ ట్రెడిషన్ ఇన్ తోరూదత్ పొయెట్రీ, హరిహరదాస్ - ఏషి యాటిక్ రివ్యూ - అక్టోబరు 1931 – కరపత్రం.

(13) ఇండియన్ రైటర్స్ ఆఫ్ ఇంగ్లీష్ వెర్స్ - లతికా బోస్ 1933.

(14) కవి తోరూ దత్ (బెంగాలీలో) రాజకుమార్ ముఖోపాధ్యాయ - ఆసియా పబ్లిషింగ్ కంపెనీ, కలకత్తా (1366 బెంగాలీ సంవత్సరం) 1959.

(15) ది వరల్డ్స్ గ్రేట్ క్లాసికల్ రినైజాన్స్ - ది కలోనియల్ ప్రెస్ న్యూ యార్క్ వాల్యూమ్-3. ది లిటరేచర్ అఫ్ ఇండియా.

(16) ది రినైజాన్స్ ఇన్ ఇండియా, లండన్ 1912.

(17) ఇండియన్ రైటింగ్ ఇన్ ఇంగ్లీష్ - కె. అర్. శ్రీనివాస అయ్యంగార్. ఆసియా పబ్లిషింగ్ హౌస్ 1962.

(18) ఇండియన్ కాంట్రిబ్యూషన్ టు ఇంగ్లీష్ లిటరేచర్ – కె. ఆర్. శ్రీని వాస అయ్యంగార్ - 1945.

(19) ఇండియన్ లిటరేచర్ - ఏప్రెల్ - జూన్ 1966. సాహిత్య అకాడెమీ - అలోకరంజన్‌దాస్ గుప్త, దీపేంద్రనాథ్ మిత్రాల వ్యాసాలూ, తోరూ రచనలలో నుండి కొన్ని భాగాలూ.

(20) లైఫ్ అండ్ వర్క్ ఆఫ్ రమేష్ చందర్ దత్ – జె. ఎన్. గుప్త - జి. ఎమ్. డెంట్, లండన్ 1911.

(21) పోయమ్స్ బై ఇండియన్ విమెన్ – సంపాదకత్వం – మార్గరెట్ మాక్నికాల్ - ఎసోసియేషన్ ప్రెస్ - వై. యం. సి. ఎ. కలకత్తా అండ్ ఓ. యు. పి. 1923.

(22) గ్రేట్ విమెన్ ఆఫ్ ఇండియా - ది హోలీ మదర్ బర్త్ సెంటినరీ మెమోరియల్ అద్వైతాశ్రమము - మాయావతి - ఆల్మోర.

(23) పాయొనీర్ విమెన్ ఆఫ్ ఇండియా — పద్మినీ సెన్ గుప్త - థాకర్ బొంబే 1944.

(24) ది ఇండియన్ లేడీస్ మాగజైన్ - సంపాదకులు కమలా సత్తియనాదన్ 1901 - 1934 - తోరూదత్ కవిత ఎక్కువగా ఈ పత్రికలో ప్రచురింప బడేది. ఆవిడను గూర్చిన వ్యాసాలు కూడా అధిక సంఖ్యలో వెలువడేవి.

(25) ఆన్‌వర్డ్ - జూన్ 1947 తోరూదత్ – నాజూభిల్మోరియా

(26) ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా :

1. మార్చి 4, 1956 తోరూదత్ - నాజూభిల్మోరియా.

2. జూలై 5, 1931 ఇండియన్ రైటర్స్ ఆఫ్ ఇంగ్లీష్ వెర్స్ - జానస్.

3. డిసెంబర్ 10, 1961 ఎ నెస్ట్ ఆఫ్ సింగింగ్ బర్డ్స్– రాజారావు.

(27) స్టేట్స్‌మన్ :

1. మార్చి 14, 1954 - తోరూదత్. ఇజ్జత్ యార్ఖాన్.

(28) ది టైమ్స్ ఆఫ్ ఇండియా :

1. మార్చి 7, 1954 - ఎ గిఫ్టెడ్ పోయటెస్ - అనంత్.